మదరాసు టెక్స్టుబుక్కు కమిటీవారిచే నంగీకరింపఁ

# వీరవిలాసిని

## ఇది చరిత్రాత్మక మగు నవల


'మహారాష్ట్ర వీరుఁడు', 'చిత్రభారతము', 'చిత్రభాగవతము', 'చిత్రరామాయణము' మున్నగు గ్రంథముల రచించిన వారగు,

బ్ర॥ శ్రీ॥ గరిమెళ్ల సత్యగోదావరిశర్మ గారిచే

విరచితము, పునః పరిశోధితము.


దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి

ఉపోద్ఘాతముతో కూడినది.


చెన్నపురి:

విపేకబోధిని కార్యాలయము,

మైలాపూరు.





[రు. 1-4-0

# విషయసూచిక



## రెండవ భాగము





# విషయసూచిక



జగదేవుఁడు ధర్మాత్ముఁడు. మహావీరుడు. తండ్రి-ఉదయాదిత్యుడు-మోహాంధుడు. మొదటి భార్య పన్నిన కుతంత్రములను నమ్మి జగదేవున కపచారములను జేసినను జగదేవుడు క్రోధ పరవశుడు గాక ధర్మ పరాయణుండై పురుషార్థమును సాధించెను. విజయవతీ జగదేవులు కేవలము కామ సూత్ర పరతంత్రులు గాక ధర్మ సూత్ర బద్ధులై కామితార్థములను బడయ గలిగిరి. జీవయాత్ర యందు కామ క్రోధ లోభోపహతు లనుభవించెడి దుర్గతిని, లాలాజి విఠ్ఠలు దాసు జయచంద్రుల కుతంత్రములును, కుశలా జ్యోతిష్కుల దురంతములును వెల్లడి చేయుచున్నవి. గ్రంథము నందలి దృశ్యములు వీరరస విలాస ఫలములైన భీభత్సమయముగ నున్నను శృంగార రస రంజితములైన ప్రేమ సూత్ర విలసితములై హృద్యముగ నున్నవి. వీరమతీ జగదేవులు విజయవతీ జగదేవులు, కనకాంగీ రత్నసింగులు, హేమాంగీ మాణిక్యసింగులు ప్రేమ ప్రభావమును విశదము చేయుచున్నారు. బలీయమైన విధిని సయితము ధర్మము జయింపగల విధమును విజయవతీ జగదేవుల స్థిరసంకల్పము, ప్రవర్తనము, సాహస పరాక్రమములు తెల్లము చేయుచున్నవి. విజయవతి పురుష వేషమును దాల్చి వీరా రాధనమును, ప్రేమా రాధనమును, ధర్మా రాధనమును, దైవా రాధనమును జేసి జగదేవుని హృదయ రాజ్యాభిషేకమును బడయ గలిగినది.

ప్రపంచ ప్రవృత్తియందు పురుషార్థ సిద్ధికి రాజస గుణారాధనము కన్నను సాత్త్విక గుణారాధనము ప్రబల

# విషయసూచిక



గోదావరి శర్మగారి రచనా సామర్థ్యమును విశదము చేయుచున్నవి. ఆంధ్ర పాఠక వర్గము వీరవిలాసినిని బాగుగ నాదరించి సత్యగోదావరి శర్మగారి సంకల్పమును. ప్రయత్నములను సఫలము చేయునని నమ్ముచున్నాను.

ప్రభవ చైత్ర [illegible]
సోమవారము

కా. నాగేశ్వరరావు.

శ్రీ సద్గురవే నమః.

# వీరవిలాసిని



## ప్రథమోల్లాసము

## పోటీ

మాళవదేశ చూడాయితమగు ధారానగరమును బరిపాలించురాజు ఉదయాదిత్యుఁడు. శౌర్యధైర్య పరాక్రమాదులయందా కాలపురాజు లాతనికి సాటి రారని మేటి కీర్తి దిగంత విశ్రాంతమయ్యెను. సామంతరాజు లందఱాతనిం గొల్వ నించుమించుగా నతఁ డుత్తర హిందూస్థానమున కంతటికిని జక్రవర్తియై ప్రజలను దన ప్రజలవలెఁ గాపాడుచుండెను. సంగీత సాహిత్యములయందా యవనీంద్రునకుఁ గలప్రీతి మెండు. ఆయుధ విద్యాపరిశ్రమమందాయన కున్న వ్యాపన మింకొకరికి లేదు. కావుననే యీయుదయాదిత్యుం డా ధారానగరంబున నాయుధవిద్యాకళాశాల యొండు నెల

కొల్పెను. శౌర్యధైర్య ధుర్యు లగు రాకుమారవీరులే యం
దుపాధ్యాయులు. సామంత రాజపుత్రు లెల్లకును దన తనయు
నితోఁ గూడి యా కళాశాలయందుఁ బరిశ్రమ మొనరింప
వలయు నని ఆ రాజు నియమించెను. రాకొమరు లెల్లరును
సమాన వయో రూప బల చాతుర్య శౌర్యధుర్యు లయి
యందు గడిదేఱుచుండిరి. జాతివిచక్షణ లేక యాయుధ
విద్యాపరిశ్రమమం దభిలాషు లగు బాలుర నందఱ నందుఁ
జేర్చుకొనుచుందురు. కళాశాల తెఱచి నాలుగు సంవత్సరము
లయ్యెను. సంవత్సరమున కొకతూరి యా తెఱచిన దినమున
గొప్పయుత్సవ మొనరించుటయు బాలకుల విద్యాప్రౌఢిం బరీ
క్షించుటయు వాడుకయయి యుండెను. క్రమక్రమముగా
బాలురసంఖ్య వృద్ధియగుటయుఁ బరిశ్రమమున వా రారి
తేఱుటయును దిలకించి యింకను వారల కుత్సాహమును
గలిగించుటకై, పరీక్షయందుఁ గృతార్థు లయిన బాలవీరు
లకు బహుమానము లిత్తు మని రాజుగారు ప్రకటించిరి.
గతించిన రెండు మూఁడు సంవత్సరముల యుత్సవములలో
బహుమానము లీయఁబడినవి. విద్యార్థులు మొదటిబహు
మానము నందుకొన నిప్పుడును నహమహమికతోఁ బరిశ్రమ
మొనర్చుచుండిరి. పట్టణ మంతయును శృంగారింపఁబడియె.
రంగురంగు పతాకము లున్నత గోపుర సౌధోపరిభాగంబుల
గాలివిసరున నల్లల నాడుచు బాటసారుల నాహ్వానించు
చున్నట్టు లొప్పుచుండెను. పరీక్షాస్థాన మెంతయు రమణీయ
ముగ నలంకరింపఁబడెను. ఎచ్చటఁ గూరుచుండిన నొక్క
తీరుగనే కానిపించునట్లు చూపఱ కాసనము లేర్పఱుపఁ
బడియెను. ఎల్లరు పురజను లుల్లాసంబున మంచిమంచి దుస్తులు

దొడుగుకొని యమూల్యము లగు నగల నలంకరించుకొని, కొందఱు బండ్లలోను, గొందఱు కాలినడకతోను రంగమును జేరుచుండిరి. వచ్చిన తగుమనుష్యులను గౌరవించి యుచిత రీతి నాసనవిన్యాసాదుల నుపచరింప నియమితు లగునాగరికు లెంతయుఁ జతురులయి పనిసేయుచుండిరి. కొంతసేపటికి రంగ మంతయుఁ గలకల లాడుచుఁ బౌర మహాజనాకీర్ణ మయ్యెను. ఆహ్వానభేరి మ్రోగుచుండెను. పరీక్షనిచ్చు రాజపుత్రు లందఱు నొక్కతీ రయినదుస్తులు దొడిగికొని యాయుధహస్తు లయి తూర్యరావములు చెలంగ, లయగా నడుగులు వేయుచు క్షత్రియత్వము బాల్యమును వీడుచు నిన్నిమూర్తు లయి వచ్చెనో యనునట్టులు రంగస్థలమును సమీపించిరి. చూప అందఱును గరతాళ ధ్వనులఁ జేసిరి. కుమారులు తమకు నియమితమైన ప్రదేశమున నిలిచి ప్రేక్షకులదృష్టు లాకర్షించుచుండిరి.

ఇంతలోఁ గోటలోనుండి ప్రస్థానభేరీ ధ్వానము విన వచ్చెను. మహారాజుగా రుత్సవమును దిలకింప బయలు వెడలుచుండి రని యెల్లరు ననుకొనిరి. అంత మున్ముందు తురుపు సరదారు లరుదెంచిరి. తరువాత సార్వభౌముఁడు నాలుగు గుఱ్ఱములు పూన్చిన రథముపై నమూల్య వస్త్రాలంకరణ భూషితుఁడయి సాక్షా దింద్రుఁ డనుతలంపు గలిగించుచు రంగస్థలమును జేరవచ్చెను. ఎల్ల రుల్లాసంబున "జయజయ, మహారాజా" అని జయజయ శబ్దము లొనరించుచుఁ గరతాళ ధ్వనులు మేళవించిరి. రథము దిగి మహారాజుగారు, వేత్రహస్తులు బరాబరులుసేయ నుత్తమ సింహాసనమును సమీపించెను. ఇంతలోఁ దన తురంగమును గురం

గమువలెఁ జెంగలింపఁజేయుచు మహారాజకుమారుఁడు రణధవళసింహు, రంగమును సమీపించి యశ్వము నవరోహించి తన రాక కుత్సాహయుక్తు లయి కోలాహల మొనరించు నాగరికుల చూపులు చూఱఁగొనుచు సింగపుఁగొదమవలెఁ దండ్రిగారికడ కరిగెను. ఉదయాదిత్యుఁడు తన తనయుని చేయి పట్టుకొని తన సింహాసనమునకుఁ బ్రక్క నున్న యుపరంజి గద్దియపైఁ గూర్చుండఁబెట్టి తాను దన గద్దియపయిం గొలువుతీరెను. కళాశాలోపాధ్యాయులు రాజాజ్ఞకై చేతులు కట్టుకొని యెదురుచూచుచుండిరి. రాజుగారి సెనుసన్న నంది మంత్రి సత్తిముఁడగు ప్రభాకరసింహు, సభఁ గలయం గనుంగొని యిట్లు చెప్పఁదొడంగెను. ''ఆర్యులారా! మన మీ దినమున నిచ్చట సమావేశ మగుటకుఁ గారణము మీ రెఱింగియే యుందురు. ఆయుధ విద్యాపరిశ్రమమం దారితేఱిన యీ రాజపుత్రులను బరీక్షయొనర్చి మొదటివాఁడుగఁ గృతార్థత నందినవాని కొక గొప్ప బహుమానము దయచేయింప శ్రీవారు ప్రకటించియున్నారు. అది యిప్పుడు జరుగఁగలదు. కావున మీ రెల్లరు సావధానమనస్కులరై వీరల నేర్పులను విమర్శింపుడు. పేరుల వరుసను బాలు రందఱును దమతమ కౌశలమును జూపించి కృతార్థత నొందుదురు గాక'' అని చెప్పెను. సభాసదులు కరతాళధ్వాను లొనరించిరి.

రంగమున కొక రాకొమరుండు వచ్చెను. ఆ బాలుఁడు కొంత దనుక నాయుధ వ్యాపారమునఁ దనకుఁగల చాతుర్యమును జూపెను. ఉపాధ్యాయుఁ డింకొక బాలకుని బిలిచి మొదటివానికిని, వానికిని యుద్ధముఁ జేయ నాజ్ఞ యిచ్చెను.

అందు రెండవ వాఁడు మేలుచేయి గైకొనెను. గురువు మఱి యొకనిని వానితో డీకొలిపెను. ఇట్టులు వరుసగ బాలుర కందఱకును నొకఁడు గెల్చిన, వానితో మఱియొకనికిఁ బోరాటము గలిగెను. తుదకు గెలిచిన బాలుఁడు మంత్రిగారి పుత్రుఁడు విక్రమసింహుఁడు. తరువాత మంత్రిగారి తనయునకును రాజుగారి తనయునకును పోటీ పోరాటము సాఁగెను. వారిరువురు నొకరి కొక రీసుతీయక కొంతసేపు పోరిరి. చూపఱు అతి కౌతూహలమ్మునఁ దదేకాయత్తచిత్తులై చూచుచుండిరి. నడుమ నడుమఁ దమ యాహ్లాదమును బ్రకటింపుచుఁ జేతులు దట్టుచుండిరి. కొంతసేపు పోరిన తరువాత మంత్రిపుత్రుఁ డించుక యలసెను. రణధవళసింగే మేలుచేయి గైకొనెను. ఎల్లరు నాతనినే పొగడుచుండిరి. కలకలముతో రంగము ఘూర్ణిల్లుచుండెను.

ఇట్టి సమయమున నొకముసలివాఁ డాయుధపాణియై రంగమును సమీపించెను. ఆతని వెనుక నొకబాలుఁ డరుగుదెంచెను. వారిరువురి వస్త్రములు నంత ప్రశస్తములు కావు; కాని వారి తేజస్సుమాత్రము ప్రశస్తతరముగ నుండెను. ఆకర్ణాంత విశాలలోచనుం డగు నా బాలుఁడు రంగముపై నున్న రణధవళసింహుపైఁ దనచూపులు ప్రసరింపఁ జేయుచుండెను. ఆ వృద్ధుఁడు దక్షిణహస్తము నెత్తి యెల్లర నూరకుండుఁ డని సంజ్ఞచేసెను. కొన్ని నిముసములలో సభ నిశ్శబ్ద మయ్యెను. "అయ్యా! ఇచ్చటి కళాశాలయందు విద్య నభ్యసించు బాలురే యీ పరీక్ష నీయ నర్హులా? లేక యీయూర నున్న బాలకు లెవరైన నీ పరీక్ష నీయవచ్చునా? దయచేసి చెప్ప వేఁడెద" నని వృద్ధుఁడు పలుక "ఎవరైన నట్టి

వారున్న నిప్పుడు చిరంజీవితోఁ దలపడవచ్చు" నని రాజుగారు సెలవిచ్చిరి. "ఇదిగో? ఈ కుఱ్ఱవాఁడు పరీక్షనీయఁ గుతూహలపడుచున్నవాఁడు" అని తనదగ్గఱ నిలువంబడి యున్న బాలునింజూపి వృద్ధుఁడతనిని రంగము నెక్కించెను. ఆ బాలుని జూచినవారందఱు పరిపరి విధముల ననుకొన సాగిరి. రణధవళుం డా బాలుని నిర్లక్ష్యముగాఁ జూచు చుండెను. అంత మంత్రిగారు లేచి "యువరాజుగారు మా చిరంజీవితోఁ బోరి యించుక యలసియున్నవారు; కావునఁ గొంతసే పీ బాలుఁ డొక్కరుండును దనపరిశ్రమ పాటవమును జూపినపిదప నిరువురును బోరుట సమంజసము" అని యన నెల్లరును సమ్మతించిరి. ఆ బాలుఁడు తనకుఁ గల యాయుధ పరిశ్రమ పాటవమును గొంతవఱకుఁ జూపెను; తరువాత రణధవళునితో డీకొని పోరాడఁదొడంగెను. వారి యుద్ధము చూచువారి కుత్సాహమును రెట్టించుచుండెను. రణధవళునికంటె నబ్బాలకుండు రెండు మూఁడు సంవత్సరములు వయస్సునఁ బిన్నయయ్యు నించుకయు నీడుతీయక పోరుచుండెను. కొంతసేపటికి నిరువురి శరీరములును రక్తసిక్తము లయినవి. చూచువారి కీ పోరాట మెట్లు పరిణమించునో యను భయము గలుగుచుండెను. అట్లు లా యిద్దఱు నొక్కతీరుగాఁ బోరుచు నలసిపోయిరి. ఒకయరగంట యయ్యెను. పరిణామము తేలలేదు. రణధవళునికిఁ గోపము వచ్చెను; పోటీమర్యాద నతిక్రమించి యా బాలకుని ఖండింప ఖడ్గము నెత్తెను. అది యా బాలుఁడు గ్రహించి చమత్కారముగ నాతని వ్రేటును దప్పించుకొని కోప మినుమడింప వీరావేశమ్మున నొడలు తెలియక పోరుచు, యుద్ధధర్మ

మును దప్పక, దగ్గర కా, రాజపుత్రుఁడు చేరకుండునట్టులు ఖడ్గమును ద్రిప్పసాగెను. రణధవళుఁడు భయపడి యేమి చేయుటకును దోఁపక యూరక నిలువఁబడ వలసినవాఁ డయ్యెను. ప్రేక్షకులు యువరాజ పరాభవమును గుఱుతించి చిన్నవోయిరి. మహారాజా దృశ్యమును జూచి పోరాట మాఁపివేయ వలయు నని యాజ్ఞ యిచ్చెను. గంట వాయింపఁ బడెను. బాలవీరుఁడును ఖడ్గము ద్రిప్పుట మానెను. ఆ కుఱ్ఱ వాని మొక మరుణసరోజాకృతి వహించెను. వీరత్వమే యా బాలకుని రూపముగ వచ్చెనని యెల్లరును దలంచిరి. మంత్రి, తలవంచుకొని యున్న యువరాజును దీసికొనివచ్చి రాజుగారిప్రక్కను గూర్చుండఁబెట్టెను. రాజుగారు బాల వీరునిం దనకడకు రమ్మని పిలిచిరి.

రాజు : అబ్బాయి! నీ పేరేమి ?

బాలు : బాలవీరుఁడు.

రాజు : నీ పేరు సార్థకము. మీ తండ్రిగా రెవరు ?

బాలు : బాలభానుఁడుగారు.

రాజు : నీ తల్లి పేరేమి ?

బాలు : పద్మాలయాదేవి.

రాజు : ఆ వృద్ధుఁ డెవరు ?

బాలు : ఆయన మా మాతామహులు; నాకు గురువులు.

రాజు : మీ రెచ్చట నున్నారు ?

బాలు : ఈ నగరముననే.

రాజు : మా సంస్థానమున నీవు గొలువుచేసెదవా ?

బాలు . మాతల్లిగారి నడుగవలయును.

రాజు : "నీవీ పరీక్షయందు మొదటివీరుఁడవుగఁ గృతార్థుఁడ వైతివి; కావున మా ప్రకటన ప్రకారము నీకీయ వలసిన బహుమాన మిదిగో తీసికొనుము" అని వేయి మొహరులు గల యొక సుందర మగు సంచును నందించెను. బాలుఁడు దాని నందుకొనియెను.

తనపుత్రుఁ డోడె ననుమాట తలంపక యా బాల వీరుని గౌరవించిన రాజుగారి నెల్లరుఁ బ్రశంసించుచుఁ గర తాళధ్వను లొనరించిరి. రణధవళుని కొడలు మండు చుండెను.

రాజు : బాలుఁడా! నీ కీదినము మొదలుకొని, దినమునకు మూఁడు రూపికలు వేతన మీయఁ దలంచితిమి. ప్రతి దినమును నీవు మాసభకు వచ్చుచుండవలయును. కళాశాలయందు నీ వింకను బరిశ్రమ మొనరింప వలయును. నీకు మా తామహులయి, నీయట్టి బాల వీరుని శిష్యునిగ నేలిన మీ గురువుగారికిఁ గళాశాల యందుఁ బ్రథానాధ్యాపకుని యుద్యోగ మిచ్చితిమి. నీ తల్లిగారి సెలవొంది రేపటినుండి నీవును నీ గురువు గారును మీఁద వివరించిన ప్రకారము తప్పక జరప వలయును.

బాలు: చిత్తము.

రాజు: "తమకు నిది యిష్టమే కదా?" అని వృద్ధు నడిగెను.

వృద్ధు: "చిత్తము" అని తనయంగీకారమును సూచించెను.

రాజు వారిరువురిని బుష్పమాలాలంకృతులఁగఁ జేసెను. రాజు తన యుత్తమాశ్వములలో నత్యుత్తమము లగు రెండశ్వములను దెప్పించి వారికి బహుమానముగ

నిచ్చెను. మఱియు మహారాజుగా రా బాలవీరుని దగ్గఱం దీసి కౌఁగిలించుకొని తనచేతిఖడ్గము నాతని కొసంగి "చిరం జీవితోఁ దమ్మునివలె నీవు తిరుగుచుండుము" అని ముద్దిడు కొనెను. ఆ చర్యలకు సభ్యు లెల్ల రాశ్చర్యము నొందు చుండిరి. రణధవళుని హృదయము పులమల మఱుగుచుం డెను. వృద్ధుని కన్నులనుండి యానందాశ్రులు జలజల జాలు వాఱం జొచ్చెను. రాజుగారు లేచిరి. ఒక్కొక్కరుగ నెల్ల రును నిజ నివాసముల కరిగిరి. బాలవీరుఁడును వృద్ధుఁడు నుత్తమాశ్వముల నెక్కి తమగృహమున కరిగిరి.

---

ద్వి తీ యో ల్లా స ము

# కా రా గా ర వా సి

"హా! పరమేశ్వరా! నీ మాయావిలసనము నెఱుంగ నెవ్వరి తరము? మహామహులగు మహేంద్రాదిబృందారకు లును, నిర్వికల్ప సమాధినిష్ఠా గరిష్ఠులగు యోగి రాట్టులును నీమాయ నెఱుంగక మోసపోవుచుండ దీనుఁడ నగు నే నెంతవాఁడను? ఈకారాగారవాస దుఃఖము ననుభవింప నే నేమి పాప మొనరించితిని? ప్రస్తుతావస్థను మాత్రము దలంచు కొని తదనుగుణముగ జీవి ఖేద మోదముల నందుచుండును గాని యెప్పటి కేమి వచ్చునో యని యించుకయు, దలంప నేరఁడు. దేవా! సద్గుణవతియగు నిల్లాలును ముద్దులు మూట గట్టు సంతానమును, ఒకరి కింత యొసఁగి సుఖానుభవమునఁ

ప్రొద్దుపుచ్చు నను వగు సిరియును, తగుపిన్నపెద్ద లౌరా యనుగౌరవమును నీవు నా కొసంగ నిజముగ నా భక్తికి సంతోషించితి వని తలంచితిని; కాని, యంతలోనే నాహృద యేశ్వరి నకాలమరణము నొందించి నన్ను జీవచ్ఛవముగ నొనర్తు వని తలంపనైతిని. నాఁటినుండియు నిన్నతివేలముగఁ బ్రేమించి భజించుచుంటిని: కాని నీవాత్సల్యము ననుమా నించియెఱుంగను. ఆ లాగున నొకదశ గడపి యామరణాంత మా విధముగా జరిగిపోవునని తృప్తిపొందియుండ నంతలో నా ముద్దు చెల్లెలను భర్తతోఁగూడ నీ సన్నిధిం జేర్చుకొంటివి. అప్పటికిని ధైర్యము వహించి నామేనల్లుని మేనగోడలిని దోడ్కొనివచ్చి సవయస్కులగు నాబిడ్డలతోఁ గలిపి వారి విద్యావ్యాసంగమునుగాంచి సంతోషించుచు నీధ్యానము నేమఱక దినములు గడపుచుండ నామగపిల్లలను పరదేశ ముల పాలొనరించితివి. ఆ దుఃఖమున వివశుఁడ నయి యుండ నా యాఁడు పిల్లలనుగూడ నగుపింపకుండఁ జేసితివి. అంతకును గసితీఱక నన్నీకారాగార బడబానలంబునఁ బడ వైచి వేఁచుచుంటివి. ఒక్కసారిగఁ జంపి పుణ్యము గట్టుకో రాదా? నీ యెడ నేనే మపరాధము గావించితిని? కరుణా కరుండ వగు నీ కిట్టి కఠినతన మెట్టు లలవడెను. జ్ఞానము వచ్చినదాదిగ నిరంతరమును నిన్ను ధ్యానించుచుండినందుల కిదియే కాఁబోలు నీవు నా కొసంగిన సామ్రాజ్యము?'' అనియు నింకేమేమియో దుఃఖోద్రేకముచేఁ బలవించుచు నొక్కింత తెలివొంది "అయ్యయ్యో! సర్వేశ్వరు నారక దూఱు చున్నవాఁడను. ఎట్టి జ్ఞానికైనను ప్రారబ్ధకర్మ మనుభవిం పక తీరునా? కడచిన జన్మంబున నెవ్వరి నెట్లు బాధించితినో

యిప్పుడది కట్టి కుడుపుచున్న దనుకొనక పరమ దయాళుం డగు పరమేశ్వరుని నిందింపవచ్చునా! తండ్రీ! విశ్వనాథా! నన్నెట్టి లీ విపదంబుధి నీఁదించి దరి జేర్తువో నీదియే భారము. ని న్నెన్నఁడును మఱవను. నే నెట్టులయినను నా కింతయేని చింత లేదు. నన్ను రక్షింపు మని కోరను; కాని లోక మెఱుంగని పసిపాపల నా నలువురిబిడ్డల ననిశమును కంటికి ఱెప్పవలెఁ గాఁచి రక్షించుచుండుము'' అని యొక ఖైదీ విచారించుచు దేవుని వేఁడుకొనుచుండెను. రాత్రి తొలి జాము మీఱెను. ప్రపంచ మంధకారబంధురముగ నుండెను. అంతరిక్షము తారకితమయి పెల్లుగఁ బూచిన మల్లెపందిరి వలెఁ దనరారుచుండెను. నగరమున నగరున నలికిడి తగ్గెను. ఆ సమయమున పొడవరియు నాజానుబాహువు నగునొక తేజోమూర్తి యచ్చట నావిర్భవించెను.

ఖైదీయై యున్న పురుషుఁడా తేజశ్శాలిని, తనకట్టెదుట నినుప గజముల కావలి చీడీపయి నిలిచియుండ గాంచెను. దూరముననుండి తన గదిలోనికి వచ్చుచున్న దీపపు వెల్తురున నప్పురుషహస్తము నించుక గాంచెను గాని, యతఁడు ద్వార మున కడ్డముగ వచ్చి నిలువంబడిన తరువాత నాతని రూప మిట్టిది యని ఖైదీ పోల్చుకొన వీలు లేకపోయెను. పిఱుఁదులవఱకు వ్రేలాడు జడలును, నురముదనుఁక పెరిఁగిన తెల్లని గడ్డమును మిక్కిలి పొడ వగు నాకారమును మాత్రము గాంచి, తా ననిశమును భజించు విశ్వనాథుండే యట్లు వచ్చె నని యా కారా గృహవాసి తలంచి భక్తియుక్తుండై యచ్చ టన్నే సాగిలిపడి మ్రొక్కి యేమో చెప్పఁబోవుచుండ నింతలో, వచ్చిన జడదారియే ''తండ్రీ! ఒక్కమాట వినుము. నీ

యాఁడుబిడ్డలు నా బిడ్డకడ సుఖంబుగ నున్నవారు. నీ మగబిడ్డ లిప్పుడు, పాంచాల రాజధాని యగు కన్యాకుబ్జమున సేమముగ నున్నవారు. వారికేమియు భయములేదు. నీవు క్రిందటి జన్మంబున నొనరించిన పాతకవశమ్మున నీ కడగండ్లన్నియు నిన్ను జుట్టు ముట్టినవి. అదంతయు నిప్పుడు చెప్ప వలనుపడదు. నీవు విచారమును వీడి విశ్వనాథుని నన్నపూర్ణాసనాథుని నిరంతరమును భజించుచుండుము. ఇంకఁ గొంతకాలము గడచిన తరువాత నీ నలువురు బిడ్డలును నీవును గలిసికొందురు; మొదటివలె సుఖంబుందురు. అంతవర కోపిక మెయి నుండుము. నేను నీ సహోదరుఁడ నగుటచే నింతగాఁ జెప్పవచ్చితిని. ఇదిగో నే నరుగుచున్నాఁడను" అని చెప్పి జడదారి నాలు గడుగులు నడచి యదృశ్యుఁడయ్యెను.

నిరుపేద కొక పెన్నిధి గానుపించి యదృశ్య మయిన తెఱంగున నా యభాగ్యున కా యోగీంద్రుఁడు దర్శనమిచ్చి యంతలోనె మఱుఁగుపడుట కేమి కారణమో తెలియదు. ఆ నిర్బంధితుఁడు మాత్ర మాతని వచనామృతమును గ్రోలి పరమానందము నొందెనుగాని యంతలోనె యతఁ డరుగుట కెంతయుఁ జింతించెను. అతఁడు వచియించిన మాటల కన్నిటికి నర్థము తెలియక పలుతడవు లాకారాగృహస్థుఁడు బుద్ధిని బదిలపఱుచుకొని యాలోచించెను; కాని ప్రయోజనము లేక పోయెను. అతఁడు తనలో నిట్టు లనుకొననాగెను. "నా కొడుకు మేనల్లుఁడును గూఁతురును మేనకోడలును సుఖంబుండి రనుట నిజముకదా! అనశన వ్రతమ్మున జీవమ్ములు విడువవలె ననుకొన్న నే నీ మహామహునిమాటలవలన నా యుద్దేశమును

మరల్చుకొనవలసివచ్చినది. ఈ వచ్చిన యోగీంద్రుఁడు నాకు సహోదరుం డెట్లయ్యెను? పరమపాతకియు, భ్రాతృద్రోహియు నగు నా యరి భీకరుఁడు తక్క నాకెట్టి యన్నదమ్ములును లేరు ఈతనికుమార్తె దగ్గఱనే నా యాఁడుపిల్లలున్నవారఁట, ఈతని యాకారమును గాంచిన సంసార జంజాటమునఁ దగిలియున్నట్టులు పొడగట్టను. ఈ యంశము మాత్ర మిదమిత్థ మని నేను నిర్ణయించుకొనలేను. ఈతఁడు మహానుభావుఁ డగుటకు సందియము లేదు. కాకున్న నిర్నిద్రు లయి యుండఱు కారాగారమును గాచుచున్నను నేరికిం దెలియకుండ నిచ్చటికెట్టులు రాఁగలిగెను? కావున నీతనివచనంబులు యథార్థములు కాకపోవు. అవశ్యము ననుభోక్తవ్య మ్మగు నీ కారాగారవాస దుఃఖము సహింపక తీరదు. తరువాత నా బిడ్డలం గలసికొని సుఖింతును" అని యనుకొని యోగీంద్రుఁ డాడినమాట లొక్కొక్కటిగఁ దలంచుచు నాలోచించుచుఁ బండుకొని నాఁ డాతఁడు సుఖనిద్రకు లోనయ్యెను.

---

## తృతీయోల్లాసము

# పరాభవాగ్ని

రణధవళునికి నాఁడు జరిగిన పరాభవము హృదయశల్యమయ్యెను. ఏమిసేయుటకును వానికిఁ దోఁచదయ్యెను. జిహ్వాకాహారము రుచింపదయ్యెను. కన్నులకుఁ గూరుకు రాదయ్యెను. వాని సర్వాంగములును బగ్గున మండుచుండెను. నాఁటి

రాతి రంతయు నతఁడు శయ్యపైఁ బొరలుచుండెను. ఉస్సు రని వేఁడి నిట్టూర్పులు పుచ్చుచుండెను. "ఆ వైరిహతకుండు సమసినం గాని నా కూరట జనింపదు. వాఁ డున్నంతకాలము నేను బేరును బ్రతిష్ఠయును లేక జీవచ్ఛవమువలె నుండ వలసి వచ్చును. 'కళాశాలా విద్యార్థుల కీ పోటీపరీక్ష' యని ప్రకటించి యన్యుఁడగు వాని రాకకుఁ దండ్రిగా రేల యను మతింపవలయును? అనుమతించితిరిపో, నే నేల యడ్డువెట్టక పోతిని? నే నింతకాల మెంతయో శ్రద్ధగాఁ బరిశ్రమ మొన రించి జగదేకవీరుఁడు రణధవళుఁడను ఖ్యాతిని వహించితినే. నేఁటితో నది యంతయుఁ బటాపంచలయి పోయెనే. అయ్యయో! మీఁదుమిక్కిలి తండ్రిగారు నా పరాభవమును గణింపక వానిం దమ తనయునివలెఁ జేరఁజీరి ముద్దాడి గౌర వించిరే. బహుమానము నిచ్చుటయే కాక తమ చేతి ఖడ్గముఁ గూడ నొసంగిరే. ప్రతిదినమును సభకును గళాశాలకును వచ్చి ప్రక్కలోని బల్లెమువలె వానిని నిరంతరమును నాఁతోఁ గలసిమెలసి తిరుగవలయునని సెలవిచ్చిరే. నేనేమి చేయుదును? ఎట్టులు వానితో సిగ్గువిడి తిరుగఁగలను? వాని రూపమును గాని, శక్తిని గాని నేర్పును గాని చూచినచో నా కొడలు గడగడ లాడనాగునే; వాని నెట్టులైనఁ గడతేర్చ వలయును; లేదా నేనే ప్రాణములు విడువవలయును. ఇంత కంటె నిం కెద్దియు పీడ తీర్చుకొనువెరవు లేదు" అని రణధవళుఁడు పరిపరి విధములఁ దన మనంబున ననుకొనుచు రాత్రి వేఁగించుచుండెను.

అట పరీక్షాపరిణామ మంతయును విని యసూయా పరురాలగు మహారాణి వాఘూలాదేవి మండిపడెను. తన

కుమారునకుఁ గలిగిన నాఁటి పరాభవమునకు రాజుగారే కారణభూతులని యామె నిశ్చయించుకొనెను. కుమారుని యలజడి యంతయును గన్నులారఁ గాంచిన యామెదుఃఖము నకు మేర లేకపోయెను. "అయ్యయ్యో! ఏనాఁడో నా సవతి నిలువెడలఁగొట్టితినో యానాఁటినుండి యీనాఁటివఱ కే పోరును బొక్కును లేక హాయిగా నుంటినే. నా యట్టి ధన్యాత్ము రాలెవ్వతె కల దీలోకమున నని గర్వించితినే. నాథుఁడు నాకు వశంవదుఁ డని యుప్పొంగితినే. రణధవ ళుని యోటమి నాకు హృదయశల్య మగునని యైన నామం దుఁడు దలంపక, యే మూర్ఖజాతునో రావించి నిండు సభలో నా కుమారునిం బరాభవించి పెరవానికి బహుమానంబు నొసంగునా? నా బిడ్డనికిఁ గంటిలోని నలుసువలె వాని నిక్క డనే యుంచుటకు నిర్ణయించునా? రాజు మన మ్మింత మాఱఁ గొనిన యా బాలుఁ డెవఁడై యుండవచ్చును? ఇట్టి పరా క్రమము వాని కెట్టులు గలిగెను? ఈఁడు పదునేనుసంవత్స రము లుండునఁట, వీఁడు నా సవతిబిడ్డఁడై యుండఁడు గద! వానిం దల్లితోఁ గూడ నిలువెడలనడిపించి పదునాలుగేండ్లు గతించెను. వా రెచ్చటి కరిగిరో యేమయిరో నే సి మధ్య గమనింపనైతిని. మహారాజ పుత్త్రుఁడే కాకున్నచో నొరుల కిట్టి బాహుపరాక్రమ ముండునా? నాయెడ భయపడి కుటి లుఁడయి యీ రాజు వారి నెందేని గూఢముగా నుంచి పాలనపోషణము లాచరించుచుండెఁ గావలయును. ఇది నిశ్చ యము. లేకున్నఁ గళాశాలయందు విద్య నభ్యసింపనివానికిఁ బరీక్షయం దేల ప్రవేశము గలుగఁజేయును! ఏల వానిం జేరదీసి ముద్దాడి గారవము చూపును!! అదియునుం గాక

తన యుత్తమాశ్వమును ఖడ్గము నేల యొసఁగును!!! లేకున్నఁ 'ప్రతిదినమును మా చిరంజీవితో నీవు వాని తమ్మునివలెఁ దిరుగుచుండుము' మను మాట లేల యాతని నోటినుండి వెడలును!!!! నన్ను మోసపుచ్చి రాజావగలాసిం గూడి సుఖించెననుట నిశ్చయము. కానిమ్ము. ఈ రహస్యమును కర్తింప లేకపోవుదునా? ''కుశలా! కుశలా! వేగముగా రమ్ము'' అని యామె తన చెలికత్తెను బిలిచెను. ''అమ్మా! ఇదె వచ్చితిని'' అని యామెయును వచ్చెను. ''ఓసీ! చూచితివా మీ ప్రభువుగారి యాగడము! అబ్బాయిని నేటిదిను సభలో నగౌరవపఱచి యెవ్వనికో బహుమానము నిచ్చిరఁట. అబ్బాయి పడుచున్న యలజడిం జూచిన నాకు భయమవుచున్నది. కావున బహుమానము నందినవాఁ డెవఁడో? ఎచ్చట నున్నాఁడో చెప్పవలయును. నీవు మాయలమల్లివి. నీ సామర్థ్యము నే నెఱుంగుదును. పోయిరమ్ము'' అని యామె నంపి కుమారునివద్దకు వచ్చి రాణి పలుకరించెను. అతఁడులుకును బలుకును లేక యున్నరని సర్పమువలె నిట్టూర్పులు పుచ్చుచుండెను. ఒడలిపైఁ జేయివైచిచూడ నామె చేయి చుఱుకెను. ఎన్నిమాఱులు పిలిచిన నతఁడు పలుకఁడయ్యెను. భయక్రోధము లామెను ముంచెను. నిప్పులు త్రొక్కిన కోఁతివలె నామె, గంతులు వేయుచు నాభరణమ్ములన్నియుఁ దీసివైచి తల విప్పుకొని మలినవస్త్రధారిణి యయి యేడ్చుచుఁ దనగదిలో నొకమూల భూమిపైఁ బండుకొనియెను

రాజుగారికీ సంగతు లేవియును దెలియవు. ఆయన వాఁ డతిసంతోషము నొందియుండెను. భుజించి యింమక

యాలసించి మంత్రాలోచనము గావించి వాఘూల మహాలునక
కరుదెంచెను. ఆమె పడకగదిలో దీపము లేదు. చెలి
కత్తె లెవ్వరును లేరు. మహ లంతయును దిగులు దిగులు మను
చుండెను. అతని ప్రియురా లెచ్చట నుండెనో కనుపింప
దయ్యె. పాప మతనికి నేమియుఁ దోఁచదయ్యె. చప్పునఁ
దిరిగి క్రింది యంతరువునకు వచ్చి యతఁ డచ్చట నొకదాసి
వలన జరిగిన సమాచారము నంతయును వినెను. ఒక దీప
మును జేతఁ బట్టుకొని దాసి దారిచూప నతఁడు రాణి పడుక
గదికి వచ్చెను. తల విరియఁబోసికొని మలిన వస్త్రధారిణి
యయి వట్టినేలఁ బండుకొని బుసకొట్టు నాఁడు నాగమువలె
నుస్సురనుచు నేడ్చుచున్న తన ప్రేయసీ రత్నమును గాంచి
నంతలో నమ్మహారాజునకు గుండెలో రాయి వడెను. అట్టి
రూపమున నట్టి యవస్థయం దామె నా పడికెన్నఁడా రాజేం
ద్రుఁడు చూచి యెఱుంగఁడు. కొంప మునిఁగిన దనుకొనెను.
దాసిని బొమ్మనెను. భార్యకడ కరిగి పలుకరించెను.
లెమ్మనెను. బ్రతిమాలెను. దుఃఖకారణ మేమనెను.
ఓదార్చెను. బుజ్జగించెను. "నీ వెట్టు లాజ్ఞాపించినను
జేయుటకుఁ జేతులు కట్టుకొని సంసిద్ధుఁడ నయి యున్నాఁ
డను. ప్రసన్నురాలవై లేచి నీ యిష్టమును దెల్పుము"
అని చేతులు పట్టుకొని వేఁడుకొనియెను. ఎట్టకేల కేడ్చి
యేడ్చి యామె లేచి మొగము కడుగుకొని జుట్టు ముడివేసి
కొని యించుక హృదయమును బదిలపఱుచుకొని తన నాథుని
చెంతకు వచ్చి కూర్చుండెను; తల వంచుకొనియెను. అప్పు
డతఁడు, "ప్రియురాలా! నీ విట్టి యవస్థ నొంద నేమి కారణము?
నే నేమి కావించితిని?" అని యనునయవాక్యము లాడెను

వాఘూ : కన్ను పొడిచి కన్నీరేల కారుచున్న దన్నవారి కేమి చెప్పవచ్చును?

రాజు : అక్కటా! నే నేమి యెగ్గు గావించితిని? నే నేమియు నెఱుఁగను.

వాఘూ : ప్రభువు లొరుల తప్పుల నెంచఁగలరు గాని తమ తప్పుల నెఱుంగరు.

రాజు : పోని మిమ్మింత మేల? నేఁ గావించిన తప్పేదియో చెప్పరాదా?

వాఘూ : నేఁ జేమి చేసితిరి?

రాజు : నీ విషయమున నే నే యపరాధమును జేయలేదు.

వాఘూ : నా విషయముననే చేసినారు.

రాజు : అది యేదియో చెప్పరాదా?

వాఘూ : పరిశ్రమ బహుమానముల సంగతి నా కేమియును జెప్పినారు కారు.

రాజు : అందులకే గదా నే నిప్పు డిచ్చుటకి వచ్చితిని. ఇంత లోనే నీ వలిగిన నే నేమి చేయఁగలను?

వాఘూ : ఎవరి కిప్పించితిరి బహుమానము?

రాజు : బాలవీరుఁ డను నొక విద్యార్థికి.

వాఘూ : అతఁడు మన కళాశాలయందే పరిశ్రమ మొనరించెనా?

రాజు : లేదు.

వాఘూ : పోటీపరీక్ష కళాశాలా విద్యార్థులకే గదా?

రాజు : అవును.

వాఘూ : అయిన నిందలివానికేఁ గాక ' వే ఱొకని' - కేల యొసంగితిరి?

రాజు: పరిశ్రమాభివృద్ధియే మనకు ముఖ్యము గాని బహు
మాన మెవరు గైకొనిన మన కేమి?

వాఘూ: అలాగున నా! ఆ కుఱ్ఱవాఁ డెవరి పుత్త్రుఁడు?

రాజు: బాలభానుని తనయుఁడ నని యతఁడే చెప్పెను.

వాఘూ: తమ పే రేమియో చెప్పఁగలరా?

రాజు: అది యే మాలాగున నడుగుచున్నావు? నా పే రుద
యాదిత్యుఁ డని తెలియదా?

వాఘూ: తెలియ కేమి? ఉదయాదిత్యుని బాలభానుఁ డందు
రేమో యని యడిగితిని.

రాజుగారి కొడలు జల్లుమనెను. అతని కేదియో జ్ఞాప
కము వచ్చెను. అతఁ డాలోచనా ప్రవాహమున మునింగెను.

వాఘూ: "అయ్యో! ఎంతల కీ నిశ్చేష్టత? మగవారు మా
యావులు. మీ చాతుర్య మంతయు నిప్పుడు తెలిసి
కొంటిని. మీ సామర్థ్యము కొనియాడఁ దగినది.
వారి నే యింట నిడికొనిన మేము మా పుట్టినింటఁ
బ్రదుక లేకపోవుదుమా? ఈ పాటిదాని కింత గొడవ
యేల? నా తనయుని నిండు సభలోఁ బరాభవింప నేల?
ఇప్పు డేమియు నెఱుంగని వారివలె నీ నయగారపు
మాట లాడ నేల? ఆవలఁ బుత్త్రుఁ డే మయ్యెనో
చూచితిరా? ఇంత యేని మా బ్రతుకు మాడనిచో
మే మిచ్చట నున్న ప్రయోజన మేమి?" అని
దుఃఖము పొంగి పొరలి రా నామె యేడువసాగెను.
రాజుగారికి గోడ పెట్టు చెంప పెట్టును దగిలినవి. అయి
తఁ డాత్మలో నానందము నే యనుభవించెను.

చతుర్థోల్లాసము

# దురదృష్టము

ఉదయాదిత్యుఁడు రాజ్యమునకు వచ్చిన కొన్నిదినములలోనే వాఘూలాదేవినిం బెండ్లియాడెను. ఆమె మిగుల నందకత్తె. వాఘూలాన్వయ సంజాత; సంగీత సాహిత్యవిశారద. వాఘులీరాజ్య రమావల్లభుని గారాబు పట్టి. ఆమె తన తెలివి దేటలచేతను, నెఱజాణతనముచేతను, సంగీత సాహిత్య కళావిలాసములచేతను, నిరుపమాన సౌందర్య మహిమచేతను, నిరతిశయ లావణ్య విశేషముచేతను, ననురాగబలముచేతను బతిమనం బాకర్షించి, యాతని నానందాంబుధి నోలలాడించెను. అట్టి జాయారత్నము దొరకినందుల కెంతయు సంతసించుచు నా రాజచంద్రుఁడు రాజ్యలక్ష్మిని నామెను బ్రేమతో సమానముగాఁ జూచి యేలుచుండెను. ఇట్లు నాలుగైదువత్సరము లతఁడు నిండుజవ్వనంపుపస లలరారఁ జూచువారి కానంద సంధాయకుండై ప్రజలను గన్నబిడ్డలఁ బోలెఁ గాపాడుచు ధర్మము తప్పక రాజ్యమేలుచు నెవరి నెట్టులు సంతోషింపఁ జేయవలెనో వారి నటులు సంతసింపఁజేయుచు నౌరా యనునట్టులు రాజ్యమును బాలించుచుండెను; శత్రువులకు మాత్రము కంటకుం డయి యుండెను.

సోలంకి రాజవంశమున నుదయించిన రతినంపు మొలకయగు శ్రీమహాలక్ష్మీదేవి, యన్నల మిన్నలకుఁ దలకట్టయి

పరిపూర్ణయౌవన సుగుణగణోల్లాసినియై, యుదయాదిత్యుని సత్కీర్తి విని, యాతనిం దప్పం దక్కొరునిం బరిణయ మాడ దానగా నని శపథము చేసెను. ఆమెతండ్రి చిఱుతతనమ్మ ననే గతించుటం జేసి పినతండ్రియగు భాస్కరరాయఁ డామెను బెంచుచుండెను. వారు సాధారణసంసారు లయ్యును గులగౌరవాదులలో క్షత్రియకుటుంబములయందు వన్నె కెక్కియున్నవారు. ఆ బాలికామణి తమ సాధారణ స్థితిని గమనింపక, కులగౌరవమును మాత్రము బలమైన యాధారముగాఁ గైకొని యుదయాదిత్యునియందు బద్ధానురాగ యయ్యెను. తన యుద్దేశమును బిన్నతండ్రిగారికి విన్నవించి యతఁ డెన్నివిధముల వలదని చెప్పినను వినక రాజుగారికిఁ దన యనురాగమును మనో నిశ్చయమును జెప్పి పంపించెను. గుణగ్రహణ పరాయణుం డగు రాజేంద్రుఁ డెంతయు సంతోషమున నామెను జూడవచ్చి వారి స్థితిగతులను గణింపక, యామె యుదారహృదయమును మన్నించి, యామెను బెండ్లాడి వాఘూలతోపాటు శ్రీమహాలక్ష్మినిగూడఁ బ్రేమించి సుఖించుచుండెను. రెండవ భార్యను బెండ్లాడినప్పటి నుండియు వాఘూలకుఁ గొంచెము విచారము మనంబున నంకురించెను; సవతియం దసూయయు నుదయించెను. సౌందర్య చాతుర్యాదులందు వాఘూల కెవ్వరు సాటి రా రనియు, సుగుణ వివేకాదులందు శ్రీమహాలక్ష్మి కెవరుం సాటిరా రనియు నంతఃపురమునను గ్రమక్రమముగఁ బట్టణమందంతటను, రాజుగారి హృదయమందును నభిప్రాయములు బలపడెను. సవతి కిట్టి కీర్తి వచ్చుట వాఘూల కిష్టము లేకుండెను. సమయము వచ్చినప్పు డామె నెట్టులయిన

వంచింపవలయు నను దుర్బుద్ధి వాఘూలకుఁ గల్గెను. అంత
కంత కది బలపడెను. ఇంతలో నామె నెలఁదప్పి తొమ్మిది
నెల లయినపిమ్మట నొకబాలునిఁ గనెను. ఆ బాలుఁడు
మిక్కిలి చక్కనివాఁడు. ఆతని జన్మమున కా దేశమ్మున
నా బాలగోపాలమును సంతసించి రనఁ దల్లిదండ్రులమాట
చెప్ప నక్కఱలేదు గదా. వారితోపాటు నవ్యాజానందము
ననుభవించిన మహాలక్ష్మీదేవి యోగ్యతను మాత్రము
వర్ణింపఁదగును. బాలుని ముద్దులతో మునింగి రాజును రాజ
పత్నులును దినములు నిముసములవలెఁ బోఁజేయుచుండిరి.
పేదవారింటి యాఁడుపడుచనియో, సపత్నీత్వమును వహించి
తనతనయున కేమేని యపకారము గావింపవచ్చుననియో,
కాని కుబ్జవానిని శ్రీమహాలక్ష్మీదేవిదగ్గఱ నుంచుట వాఘూల
కిష్టము లేదు. చూచునప్పు డామె నసహ్యించుకొనుటయుఁ
జెలికత్తెలతోఁ దనసవతి పేదవారిబిడ్డ యనియు నామె
చులుకనచేసి చెప్పుటయుఁ గలదు.

కొంతకాల మిట్టులు గడచుచుండ శ్రీమహాలక్ష్మియు
నెల దప్పెను. అంతఃపురమునందును రాజుగారి యంత
రంగమునందును నగరమునందును నా సమాచార మానం
దము నింపెను; కాని యసూయాపరవశురాలగు వాఘూలను
మాత్ర మానందింపఁజేయ లేకపోయెను. మీఁదుమిక్కిలిగ
నామెను మఱింత యసూయావశంవదురాలను గా నొన
ర్చెను. మహాలక్ష్మి గర్భమందలి శిశు వెదుగుచుండఁ
బంతము వేసినట్లు వాఘూల హృదయమం దసూయయు
నెదుగుచుండెను. ఎట్లయినఁ దనసవతి నింకఁ బరాభవిం
పక తీరదని యామె నిశ్చయించుకొనెను. తమ పురోహితుని,

కార్తాంతికుని రావించి యామె యేమియో బోధించి వారికిఁ జాల ధన మొసంగి సమయమును గనిపెట్టుచుండెను.

శ్రీమహాలక్ష్మీదేవి ప్రసవించెను. రత్నమువంటి మగ శిశువు గలిగెను. ఆ వృత్తాంతమును విని మహారాజుగా రెంతయు సంతోషించిరి. అందఱును సంతసించిరి. సవతి బిడ్డనిం జూడఁ బోయిన వాధూల పురిటింటినుండి యివతలికి వచ్చినప్పు డెంతయు మాఱిపోయెను. ఆమె వదన కమలము వికాసహీన మయ్యెను. అందుల కేమికారణము? పూర్ణ చంద్రునివలె వెలుంగు నా బాలుఁడే కదా! ఆహా! అసూయా మహిమ!

పది దినములు గతించెను. పురోహితుఁడును జోస్యుఁడును గలిసి యేమి యాలోచించిరో మనకు తెలియదు గాని వారిని రావించి చిన్నవానిజాతకమును గుఱించి మహారాజుగా రహుగ వారి విధమునఁ బల్కిరి. "రాజేంద్రా! ప్రభుహితమును గోరు పండితుఁ డప్రియ మయినను సత్యమునే పలుకవలయును గదా! ఇప్పుడు దాఁచి తరువాత మీచే నిందింపఁబడుటకన్న నున్న దున్నట్లు లిప్పుడు మనవి చేసికొనుటయే మంచిది. మహాలక్ష్మీదేవిగారు ప్రసవించిన కాలము విషమగ్రహ కూటము. అన్నియును వచింపఁజాలము. వెంటనే, తల్లితోఁగూడ నా శిశువు నీ యూరినుండి యావలి కంపించి వేయవలెను. మీ సతీసుతు లనుపామ రత్నమును గూడ మీరు విడుచుకొనవలయును. ఇట్లు కానిచో మీ రాజ్యమును బ్రాణములును దక్కవు. మీకు వంశము గూడ నుండదు. తరువాత దేవరచిత్తము. మే మింతకంటె నెక్కువగాఁ జెప్పఁజాలము. ఈజననముచే మీ కెట్టి కీడును

రాకుండఁ దగినశాంతిని జేయింతుము. మహా మంత్రములు పురశ్చరణ మొనరించి గ్రహశాంతి చేసి మీ యారోగ్యమును గూర్తుము. ఇంతే మేము చేయవలసిన పని'' అని గ్రహముల స్థితిగతులును లగ్నము నునికియు వేఱు వేఱ నిరూపించి యేవేవియో శ్లోకములు పఠించి సరిపెట్టి నచ్చఁ జెప్పిరి. రాజుగారికి మిన్నువంగి మీఁదఁబడిన ట్లయ్యెను. గుండెలు జల్లుమనెను. ''సరియే; ఆలోచింతుముగాక'' అని వారి నంపివేసి యా విచారమున నా రాత్రి భోజనము చేయకయే యతఁడు పండుకొనెను. ఆ సతీసుతులను విడుచుట కాతని కిష్టము లేదు. విడువక తీరదు. ఆ రాత్రి ప్రక్కపైఁ బొరలుచు నాలోచించి యాలోచించి యేమియుఁ దోఁచక నివ్వెరపడి యుండి రాజు కొంతసేపటికి నిద్రకు లోనయ్యెను. భయంకరము లగు స్వప్నము లాతనిని వేధించెను. కాలయముని వంటి భయంకరాకారుం డొకఁ డొక గదను ధరించి తన్ను మొత్తుటకై వచ్చినట్లు కలగాంచెను. ఆతఁ డులికిపడి లేచెను. పెద్దకేక పెట్టెను. సేవకు లందఱును వచ్చిరి. వాసులా దేవి వచ్చెను. ఎవ్వరికి నేమియుఁ జెప్పక యందఱ నావలి కంపివేసి వాధాలా దేవితో నయ్యపరరాత్రిని దాను గాంచిన కలను, జోస్యులు చెప్పినమాటలను జెప్పి రాజు మిక్కిలి దుఃఖించెను. ఆయనతో నామెయు మిక్కిలి దుఃఖించెను. ఇట్లు వారు మాటలాడుచుండఁ దెల్లవారెను. ఆతని కపరిమితముగ జ్వరము వచ్చెను. అది యంత కంత కధిక మయ్యెను. నిజముగఁ దన రెండవ కుమారుని జనన దుష్కాల మహిమ నే తన్నట్లు వేధించుచున్నదే నని నిశ్చయించి యతఁడు పెద్దభార్యతో నాలోచించి చిన్నభార్యను

పుత్రుని నామె పుట్టినింటి కంపించెను; వారి కొక గ్రామము మాత్రము గ్రాసమునకు వ్రాసి యిచ్చెను. వారి నంపించిన పటిననాఁడే యాతనికి నారోగ్యముగా నుండెను. జాతకమును వ్రాసి తత్ఫలమును జెప్పిన జ్యోస్యునకు రాజు మంచి బహుమానము నిచ్చెను. తగు శాంతియుఁ జేయించెను. కాలము చాలని వేళ నన్నియు నిట్టులే సమకూరును!

ఇట్లు లెంత ప్రజ్ఞావంతుఁ డయ్యును దనభర్త సవతి మాటలను విని మోసపోయి తన్నును దనపుత్త్రుని విడిచి పుచ్చె నని కొన్నాళ్లకుఁ దెలిసికొని శ్రీ మహాలక్ష్మీదేవి యెంతయు దుఃఖించెను. దుఃఖించి యేమి చేయఁగలదు? తన పినతండ్రి సాయమువలన నెట్టు లయిన నా చిన్నవానిం బోషించి పెద్దవానిం జేయుటయే తన ముఖ్యవిధిగా నామె నిశ్చయించుకొని కొన్నాళ్లా యూరనే యుండెను. పది యేండ్ల యీడు గలవాఁడై చదువను వ్రాయను బాగుగ నేర్చినవాఁ డయి ముద్దు మాటలతోఁ దన తెలివి చేటలతోఁ దల్లిని నానందమున ముంచుచు జగదేవుఁ డను నామధేయముతో శ్రీ మహాలక్ష్మీ పుత్త్రుఁడు మహాలక్ష్మీ పుత్త్రునివలె నెంతయుఁ దనరారుచుండెను.

అంత నేరికినిం దెలియకుండు నట్లు బీద వేషములు వేసికొని యా బాలుఁడును దల్లియుఁ దాతయును వచ్చి ధారా నగరంబున నొక మూలఁ బ్రాంతపడి యున్న యొక మేడ నద్దెకుఁ దీసికొని వసించుచుండిరి. వా రెవ్వరో యూరిలోనివారి కెవ్వరికిని దెలియదు. రహస్యముగాఁ దాతగారే యా బిడ్డనికి శస్త్రపాండిత్యము శాస్త్రపాండిత్యము నలవడఁ జేసెను. కుశాగ్రబుద్ధి యగు నా బాలుఁడు నాలుగు

వత్సరములలోనే శాస్త్రములయందు మంచి జ్ఞానమును సంపాదించెను. అస్త్రవిద్యాపరిశ్రమమందా నాలు గేండ్లలో నెట్టి నేర్పరి యయ్యెనో పరీక్షారంగమున మనము గాంచియే యున్నారము. తన యుదంతము రాజుగారికిఁ దెలుపుట కిష్టములేకయే శ్రీమహాలక్ష్మీదేవి తన కుమారుని రాజుగారడిగిరేని పేరులు కొంచెము మార్చి చెప్పు మని బోధించి పంపెను. పోటీపరీక్షలోఁ దన కుమారుండు మేలు చేయి గైకొని తెచ్చిన బహుమానములు గాంచియుఁ దత్సమయమున నాతఁడు రాజుగారిచే గౌరవింపఁబడిన సంగతి వినియుఁ బదునాల్గు సంవత్సరములనుండియుఁ దా నొందుచున్న దుఃఖమంతయు నొక్కసారి పటాపంచలుగాఁ బోవ నామె ప్రమోదమ్మున నొడలు మఱచెను. ఆ బుడుతఁడు తన పరాభవమును దీర్చి వంశగౌరవమును నిలుపునని యామె నెమ్మది నొందెను.

ఇచ్చట రాజమహలున వాఘూలదగ్గఱ రాజుగారా రాత్రి రాతీరున రాపడియుండి తన చిన్నతనయుఁ డతఁడే యని తెలిసికొని యానందించెను; కాని వారు తమ సన్నిధి నున్నచో మరల నెట్టి యిక్కట్టులు గలుగునో యని భయమందెను; వాఘూలతోఁ గలసి రణధవళుని గదిలోనికిఁ బోయెను; నిద్రించుచు నులికిపడుచు లేచుచు మరలఁ గూర్కుచు మిక్కుట మగు జ్వరముచే బాధపడుచున్న యాతని శరీరమును స్పృశించెను. రాజుగారి యొడలు గడగడ లాడెను. కొడు కొడ లెఱుంగక పలవరింప విని భయమంది యేమి చేయుటకును దోఁచక రాజు వాఘూలతో నాలోచించి తుద కొక నిశ్చయమును జేసికొనెను. జగ

దేవునిం గోటకుఁగాని, కళాశాలకుం గాని రా వలదనియుఁ దమకు నంత తెలుచుగ నగుపింప వలదనియుఁ దన వేతనము తా నున్న తావున కంపించి నేయుదు మనియు, నతని కుదయ మున నే మంత్రిగారిచేఁ గబురంపెను. మంత్రిగారి కేమో గాని యట్లు చెప్పుట కిష్టము లేదు. ఎట్లులైన మంత్రి గారి కీ సమాచార మాదినుండియుఁ దెలిసియుండవచ్చును. రాజాజ్ఞ యనుల్లంఘ్య మగుటచేఁ దా నేమి యనుటకుఁ గాని, చేయుటకుఁగాని వీలులేక యీ వార్త నా బాలునికిఁ జెప్పించెను. ఉదయమునఁ జటులోక్తి విశారద యగు కుశల శ్రీ మహాలక్ష్మీదేవికడకుఁ బోయి చమత్కారముగా మాటలాడి వారి సంగతి నంతయును గుఱుతించి తన యజ మానురాలితోఁ జెప్పెను. జరుగ వలసిన దంతయు నా వఱకే జరిగి యుండెను. ఆ యుదంతము నంతయు విన్న రణధవళు నికిం గ్రమ క్రమముగ శరీర మారోగ్యము నొందెను. బుద్ధి పదిలపడెను. ద్వితీయ పుత్రుఁడు జనించినకాలము మంచిది కా దనుమాట రాజుగారి హృదయమున మఱింత గట్టిగా నాటెను.

---

పంచమోల్లాసము

# పెండ్లిమాటలు

పోటీపరీక్షయందు గెలుపొందిన బాలవీరుఁడు రాజు గారి చిన్నభార్య యగు శ్రీ మహాలక్ష్మీదేవి పుత్త్రుఁ డనియు, నాతని బల పౌరుషంబులు సౌందర్య చాతుర్యంబు లద్వి

తేయంబులనియు, నీయంశము లెఱింగియు రా జాతనిం దగి నట్లు గౌరవించి చేఁబట్టుకొన లేదనియు నను మొదలగు సంశయములు కర్ణాకర్ణికగా ఘూర్జర దేశమునం దంతటను వ్యాపించినవి. అంత కంతకు జగదేవుఁడు శస్త్రపరిశ్రమ మందును శాస్త్రపరిశ్రమ మందును నారితేఱి రాజధర్మము లన్నియును దెలిసికొని రెండు మూఁడు వత్సరములలో నతి మేధావి యనియు నిరుపమాన శౌర్య ధైర్య పరాక్రమముం డనియు మంచి కీర్తి సంపాదించెను. రాజకార్య మర్మములు మంత్రిగా రప్పు డప్పుడు రహస్యముగ నతని సంధించుచు నుపదేశించుచుండెను. చక్రవర్తిత్వమును వహింపఁ దగిన గుణగణమ్ములు జగదేవునియందు మూర్తీభవించి యున్న వనియు, నతఁడే రాజ్యార్హుం డనియు మంత్రి గుఱుతించెను. రణధవళుండు తక్కువ వారికంటె నెక్కువ వాఁడే గాని చక్రవర్తిత్వమునకుఁ దగిన గుణగణము లలవఱుచుకొనలేక పోయె ననియు, నందుచే రాజ్యమున కతఁ డనర్హుం డనియు మంత్రి నిశ్చయించుకొని యుండెను. క్రమ క్రమముగ నీ నిశ్చయము నగరమువారికే కాక నగరాంతముల వారికిని గలిగెను. జగదేవుని కీర్తిచంద్రిక దిక్చక్రములందు నిష్కళంకమై వ్యాపించెను.

ఆ కీర్తిని విని గౌడ దేశాధీశ్వరుం డగు గంభీర సింహుండు జగదేక వీరుండైన జగదేవునకుఁ దన పుత్త్రి యగు సీతాబాయి నిచ్చి పెండ్లి గావింపవలయు నని కుతూహలము నొందెను; శుభస్య శీఘ్ర మ్మని తన మంత్రి దయాల సింహుని, కులగురు వగు విశ్వేశ్వర శాస్త్రిని పెండ్లి మాట లాడుటకు ధారానగరమ్మునకుఁ బంపెను. వారును

నగరమ్మునఁ బ్రవేశించి యొక మేడలో బసచేసి నగరము నందలి విశేషములను దెలిసికొనుచుండిరి. వారు వచ్చు సమయమునకు నుదయాదిత్యుండు తన మిత్రుండగు మేండా ధీశునిం జూడ నరిగియుండెను. రాజ కార్యములను రణధవళుఁడు మంత్రిసాయమున నెరవేర్చుచుండెను. వారు వచ్చిన సంగతి యెట్లు గుఱుతించెనో గాని కుశల గుర్తించెను. వెంటనే యా తన యజమానురా లగు వాఘేలా దేవి కా సంగతి విన్నవించెను. యువరాజైన తన కొమరుం డుండ జగదేవునికి గంభీరసింహుని యంతటి వాని ముద్దు తనయతోఁ బరిణయ మగు నన్న నామె కోర్వ నశక్య మయ్యెను. ఎట్టులయినఁ దన చమత్కారముచే న కన్యను దన తనయునకు పరిణయము గావింపవలయు నని యామె తలంచెను; రహస్యముగా కుశలచేఁ గబురంపి దమాల సింహునకుఁ దెలియకుండ విశ్వేశ్వరశాస్త్రిగారిని రావించి తగు రీతి సన్మానించి వేయి మొహరు లాయనకు బహుమాన మిచ్చెద నని చెప్పి తన తనయునకే సీతాబాయిని గూర్చు నట్టులు కట్టుదిట్టము గావించెను. పురోహిత మహాశయుం డతి సంతోషముతో వారి పురోహితునిం గలిసికొని యావ ఱకుఁ దముచే వ్రాయఁబడి యున్న జగదేవుని జాతకమును దీసికొని యింటికి వచ్చెను. మంత్రి కా జాతకమును జూపి "యిట్టి యభాగ్యునకు మన రాజకన్యక నెట్టులు గట్టుట కిచ్చగింతుము? రాఁబోవు సంవత్సర మా జగదేవునికి గడవ రాని మారకము గలదు. అది గడచినను దరువాత మూఁడేండ్లకు వచ్చు మారకము మాత్ర మాతని ప్రాణము లను హరింపక విడువదు. ఎంతటి పరాక్రమవంతుఁడైన

నేమి ప్రయోజనము? అల్పాయుష్కునకు మన రాజపుత్త్రినిం గూర్చితి మేని తరువాత మన రాజుగారి కడ మనకు మాట వచ్చును. కావున నీ రాజేంద్రుని తనయుఁడును, యువరాజును, పరమార కుల రత్నాలంకారమును, దీర్ఘాయుష్మంతుఁడును, పరాక్రమ నిధియును, సౌందర్య విలాసుండును నగు రణధవళునకు మన రాకన్నియను గూర్చితి మేని మనము కృతకార్యుల మగుదుము తమ రాలోచించి తగినంత వేగముగాఁ గార్యమును నెరవేర్పుఁడు'' అని లంచగొండి యగు విశ్వేశ్వర శాస్త్రి యొకటి కొకటి కల్పించి దయాల సింహుని మనస్సును త్రిప్పివేసెను. గంభీరసింహుని యాజ్ఞ లేక రణధవళునకుఁ బెండ్లిమాట లాడ నా మంత్రిగారికిఁ దొలుత నిష్టము లేకపోయెను, గాని, యుక్తి వాగ్విశారదుం డగు విశ్వేశ్వరశాస్త్రి స్వతంత్రించి మంత్రించి యెట్టులో మంత్రిగారి మనస్సును త్రిప్పి యొప్పించెను; విమర్శించి యిట్టులు యువరాజునకు తన తనయను గూర్చి నందులకు గంభీరసింహుం డెంతయు సంతసించు ననియు, నట్టులు గావించుటయే తమకు విధి యనియు బోధించెను. ఏలాగయిన నేమి యిరువురు నిష్టపడి రాజమందిరమున కరిగి వాడుక చొప్పున నారికేళ ఫలమును రణధవళుని చేతి కందించి యాతని నుదుటను దిలకమును దిద్ది తమరాజగు గంభీరసింహుని తనయను సీతాబాయిని రణధవళసింహున కిచ్చి పరిణయము గావింపఁబడు నని సభలో నుపన్యసించిరి. రాణిగారి యాజ్ఞ చొప్పున మంత్రి ప్రభాకరసింగు వారి నెంతయును గౌరవించెను.

మఱునాఁటి సాయాహ్నంబున విశ్వేశ్వర శాస్త్రి

గారితోఁ గలిసి దయాలసింహుం డుద్యానవనమును దిల కించుచుండ నచ్చటి కమూల్య వస్త్రాలంకరణభూషితుం డై యుత్తమాశ్వము నెక్కి యతి త్వరితగతిని, జంబిత శ్వాసనుం డగు నొక బాలుం డరుదెంచెను. అతఁ డాజానుబాహువు. పరిశ్రమవిలసిత మగు నాతని మొదలి సొంపు ముద్దులు గులుకుచుండెను. ఆతని ముద్దుమోమున నూనూఁగు మీసము మొలకలెత్తుచుండెను. లావణ్య విల సితములగు నా బాలకుని చెక్కు లద్దములవలె మెఱయు చుండెను. లక్ష్మీనిదానము లగు కన్ను లాకర్ణాంత విశా లము లై యతఁడు మహాపురుషుం డగునని సూచించు చుండెను. విశాల మగు ఫాలమును, నించుక యున్నతమగు నాసికయు నతని బుద్ధి చాతుర్యముల నుద్బోధించుచుండెను. నీలంపు టుంగరములవలె చుట్లు చుట్లుగఁ జుట్టుకొని మెడ పైని వ్రేలాడు జుసపము లెంతయో శృంగారము నక్కు ఱ్ఱ వానికిం గూర్చుచుండెను. గుఱ్ఱపుస్వారి చేసి యలసిపోవు టచే నాతని నుదుటను ముత్తియములు చెక్కినట్లు చెమట బిందువులు పొలిచి పొలుపారుచుండెను. తన స్వారి కాఁగియు ముచ్చెమటలు పోసి మిక్కిలి యలసియున్న హయరత్నమునుండి చెంగునఁ గ్రిందికి దిగి బాలుఁడు, దయాలసింహుఁడును విశ్వేశ్వరశాస్త్రియు నున్న చలువ రాదిన్నెకడకు వచ్చి నిలిచెను. వాని యాకారమును జూచి వారిలో వారు మాటాడుకొని యీతఁడే జగదేవుం డయి యుండనోపు నని నిర్ధారణ చేసికొనిరి.

“ఆర్యులారా! వందనములు. మీ రెవ్వరు? ఈ యూరికిఁ గ్రొత్తవారుగాఁ గాన్పించుచున్నవారు” అని యా

కుమారుం డడిగెను. "చిరాయు రస్తు. కుమారా! నీవు బాగుగ గుఱుతించితివి. నిజముగ మే మీయూరికిఁ గ్రొత్త వారమే. గౌడదేశాధీశుండగు గంభీరసింహుని కులగురువు విశ్వేశ్వర శాస్త్రిలవారు వారు; నేను వారి మంత్రిని; నా పేరు దయాలసింహుఁ డందురు" అని మంత్రిగారన "ఓహో! అలాగునా! మీ మహారాజునకుం గుశలమే కదా! మీ దేశమందలి ప్రజలు ప్రసన్నులు గదా! బాబయ్యగారిని దర్శింపవచ్చి యున్నవారు కాఁబోలును. వారు ప్రస్తుతము గ్రామాంతరమున నున్నట్లు వినియున్నాఁడను" అని జగదేవుఁ డనెను. "కుమారా! నీ నామధేయ మేమి? నిన్నుఁజూడ మాకుఁ గన్నులపండు వగు యాహ్లాదము గలుగుచున్నది" అని మంత్రిగారన "నన్ను జగదేవుఁ డందురు" అని యతఁడు జవాబుచెప్పెను. వారిరువురు నాతని మృదుమధురము లగు పల్కులు వించు నానందించుచు నాతని పేరును విని చకితులయి యాతని నాపాద మస్తకమును దిలకించుచు నేమియు మాటలాడ లేక యూరకుండిరి. తరువాత నతఁడు వినయముతో వారికి నమస్కరించి యించుక యలికతీరిన తనగుఱ్ఱముపైకిఁ జెంగున నెగిరి కుచ్చుల కళ్లాయి సరిచేసికొని వారి ననుమానంపుఁ జూపులఁజూచుచు సంతలో నుద్యానమును దాఁటి నగరములోని కేగెను. తాము విచారింపక తొందరఁ జెంది రణధవళునకుఁ దమ రాకన్నియు నీయ నిశ్చయపఱిచితి మని పశ్చాత్తాపము నొందుచుఁ దమ బసల కరుదెంచి వారు, మఱునాఁడు తమదేశమునకు బయలుదేఱి పోయిరి.

# చిత్రపటము

కుమారుడు: "నాన్నగారూ! అతఁడే నా చెల్లెలిని పాణిగ్రహణ మొనరించుకొన నర్హుండు. తరువాతఁ దమ చిత్తము.

తండ్రి: వత్సా! నీ యిష్టమువచ్చినట్లు గావించుట కే యాటంకమును లేదు; కాని యతఁడు నిరుపేద యయి యుండె ననియుఁ దండ్రిచేఁ దిరస్కరింపఁబడె ననియును వినియుంటిమి. అదియునుంగాక నీవు చెప్పిన రీతిని వరుం డంత యోగ్యుం డయినచో గంభీరసింహుండు తనతనయ నాతని కేల యొసంగఁడు? అతఁ డంత యవివేకియా?

కుమా: నిజముగఁ బేద యని తలంచియే తనతనయ నా వీరుని కీయ నొడంబడని యెడల గంభీరసింహునికంటె నవివేకి యింకొకఁ డుండఁ డని నాతలంపు.

తండ్రి: అది యేమో మన కా సంగతి యెట్లు తెలియంగ నగును? ఇప్పు డుదయాదిత్యుండు మనమీఁదికి దాడి వచ్చుచున్నవాఁడో, లేక తనకుమారుని వివాహ మహోత్సవమ్మునకుఁ దరలివచ్చుచున్నాఁడో తెలిసికొనవలసియున్నది.

కుమా: మన మాయన కేమి యపకారము గావించితిమి? వారికి మనము గట్టు కప్పము తప్పక కట్టుచుంటిమి; కావునఁ బెండ్లికే తరలివచ్చుచుండె నని మనము

నిశ్చయించుకొనవలెను. కా దేని మన సేన లన్ని యును దమయాజ్ఞచే యుద్ధసన్నద్ధము లయి యుండనే యున్నవి. మీ కుమారుని చేతి బిగువును మీరు నూడనే చూతురు. దీని కింత యాలోచన యేల?

తండ్రి: తండ్రీ! నీవు చెప్పిన వియ్యమునకుఁ గాని, కయ్యము నకుఁగాని యుదయాదిత్యునితో మనము తూగఁ జాలము. అతనికి సైన్యబలమును, సామంతబలమును మనకంటెఁ బదునేను మడుంగు లెక్కువ. ఆయన ప్రసాదించినదే మన కీరాజ్యము. నే వృద్ధుఁడనై యుంటిని. ఆయనకడఁ గొన్నాళ్లు ముఖ్యసేనా ధ్యక్షుఁడ నై యుండి యెంతో గౌరవింపఁబడి యుంటిని, కావున నాతనిమీఁదికిఁ గయ్యమునకుఁ గాలు ద్రవ్వుట నా కిష్టము లేదు.

కుమా: సరియే, మీ యాజ్ఞను నే నెన్నటికిని దాఁటువాఁ డను గాను. మన కిప్పుడు కర్తవ్య మేమియో సెలవిండు.

తండ్రి: చారులు వచ్చినపిదప విచారించి సగౌరవముగా వారి నాహ్వానించుటయే నా ముఖ్యోద్దేశము. వారును రెండవ తలంపున నుండరు''

అని టుకటోడా నగరమున కధీశ్వరుం డగు రాజసింహుండును నతనిపుత్రుం డగు వీరసింహుండును మాటలాడుచుండ, నొకవారికుఁడు, చారులు వచ్చి యున్నారని విన్నవించెను. త్వరగఁ బ్రవేశపెట్టు మని రాజాజ్ఞ యయినంత వాఁడు పోయి వారిం బ్రవేశపెట్టెను. వా రల్లంతదూరమున నుండియే

రాజుగారికి సాష్టాంగముగ మ్రొక్కి "దేవా! ధారా నగరాధినాథులు ఉదయాదిత్య సార్వభౌములు తమ పెద్దకుమారుని వివాహమునకై తరలివచ్చు చున్నారు. మఱియొకగంటలో మనయూరి కవతలి తోఁటలో డేరాలు వేయుంతురు. తరువాత దేవర చిత్తము" అని చెప్పి వారు ప్రక్క కొదిగియుండిరి. రాజసింహుఁడు చారులతో మరల నేదియో చెప్పి పంపివేసి, "అబ్బాయి! నీవు పరివార సహితుఁడవై యెదురేఁగి మనప్రభువును నాతని యనుంగుఁ గొమరులను, దోడితెచ్చి మన పూలతోఁటయందలి సౌధమున విడియింపుము. తామసింపక శీఘ్రమున నరుగుము. నేను లోనికిఁబోయి యమ్మాయి వీరమతితో మాటలాడి మన మాలోచించిన యంశము కృతార్థత నొందు నట్టిప్రయత్నము చేసెదను" అని చెప్పి వీరసింహునిం బంపి తాను నగరులోనికి నరిగెను.

"ఇట్టి రూపపటము నెవఱు కెవ్వఁడును నేఁ జూచి యెఱుంగను. జగన్మోహనాకార మిన నిట్టు లుండవలయు నని చతురాస్యుం డూహించి తన సామర్థ్యము నంతయును శక్తి వంచన లేక వినియోగించి యిందలి మనోహరాకారుని సృజియించెనో; లేక యీరితేజన నవనాగరిక శిఖామణి యగు నీ చిత్రకారి యనుపమాన మ్మగు తన ప్రతిభా విలాస సర్వస్వము నుపయోగించి యిట్టిరూపమును లిఖించెనో తెలియదు. ఆహా! ఏమి యీతని సౌందర్య మహిమ? ఈతని కీడుజోడగు బాలికా రత్న మెచ్చట నున్నది? ఈ

తనిం జెట్టపట్టనినాఁ డీజన్మ మేల? ఈ రాకొమరునిగూర్చి యెంత యడిగినను గులుకులాడి యగు నాచెలి చెప్పక మురి పించుచున్నది. ఈతఁ డెవ్వరైనను సరియే, నే నీతనిం దక్కఁ దక్కొరునిం గన్నెత్తి యయినం జూడను. సన్నీతఁ డనుగ్రహింపనినాఁడు బ్రహ్మచారిణినై యాజన్మము తీవ్ర మగు తప మొనరించి మఱుజన్మంబున నాతనిం జేపట్టి కృతార్థురాల నయ్యెదను. నే నీతని వరించితిని గాని యీ వన్నెకాఁడు నన్నంగీకరించునో లేదో?'' అని యొక రూపపట ముం జూచుచుఁ జక్కనిచుక్క యగునొకరాకన్నె మిన్న తనతల్పమునఁ గూరుచుండి యోచించుచుఁ దనకరమునకు రము నందుకొని యందుఁ దన ముద్దునెమ్మోమును నాపటముం జూచుచుఁ గొంతసేపటి కొకచిఱునవ్వు నవ్వెను. ఈషద్వికసితమగు నధరబింబమును, ఆనందవిలాసమును, బట్టియిచ్చు సౌభాగ్య కటాక్ష లీలలును నా సుందరీ ముఖసరోజమున కెంతయు వన్నెగూర్చినవి. బాల సుధాకరునిపైఁ గవియు బాల జలధర మాలికలతీరునఁ గుటిలము లగు ముంగురు లామె నెన్నొసటిపైఁ జిఱుగాలి వశమ్మున నాట్య మాడు చుండెను. సర్వాంగ సుందరి యననొప్పు నట్టు లవయవము లెల్లఁ బంతమువేసి యొకదానిని మించి యొకటి సౌందర్య నిధానమయి యలరారు చున్నది. కొంతవడి కచ్చటినుండి లేచి నిలువుటద్దముదగ్గఱకుఁ బోయి తనహొయలు నా వరా రోహ గనుంగొనుచుండెను. నాఁడే యామె యభ్యంజనమ్మొన రించెఁ గావలయు నామె కేశపాశ ముగ్గులుగ్గులుగ వెన్నున జాఱి, త్రికంబు నతిక్రమించి, పిఱుందు నధిరోహించి, యూరు వుల దాఁటి, జానువులమీఁఱి మణమ మట్టిపఱడ్ల నందుకొను

చుండెను. "ఏమి! నా ప్రాణసఖి యిప్పుడే వచ్చెద నని చెప్పి యింత దనుక రాకున్నది! దీని శరీరము చిన్నతనమును వీడి నను బుద్ధి మాత్ర మింకను జిన్నతనమును విడువకున్నది. ఈ నవమోహనాంగునితో నన్నుఁగూర్పవలయు నను నుద్దేశముతోడనే యీ పటముఁ దెచ్చినది. దీనిఋణముం దీర్చు కొనలేను" అని నిలువు టద్దముకడ నిలుచుండి యా బాలిక యనుకొనుచుండెను.

"చెలియా వీరమతీ!" అని గుబాలునఁ దలుపు తెఱచుకొని వచ్చి, ముసిముసి నవ్వులు నవ్వుచు "నీ కొక మంచి మాట చెప్పెదను. నా కేమి యిచ్చెదవు?" అని యామె చెలికత్తె యడిగెను.

వీర: నీ కేమి కావలసినను లేదనక యిచ్చెదను.

చెలి: ఇచ్చెదవా? నిజమే కద? ఇదిగో వినుము. నీకు రెండు మూఁడు దినములలోఁ బెండ్లియగును.

వీర: చాలునే నీ యెగతాళిమాటలు. నీ వెప్పుడును బెండ్లి పెండ్లియే యనుచుందువు. నాకుఁ బెండ్లియును వలదు, పేరంటమును వలదు.

చెలి: అమ్మా! ఎంత ముద్దరాలవే. నీ చేతిలోనున్న దేమి?

వీర: "ఏమియునులేదు" అని తనతల్పముకడకుఁ బరువెత్తి పోయి యా పటమును దనపడుకలో దాఁచివేసెను.

చెలి: తెలిసినవిలే నీచేష్టలు! నిన్నఁటికిని నేఁటికిని నీ వెన్ని వన్నెలు చిన్నెలు నేర్చితివే! ఆ పటము నిట్టు లిచ్చెదవా లేదా?

వీర: నే నీయను.

చెలి: ఆ పటము నిచ్చివేయుము. నేను మంచిదానను గాను జుమీ.

వీర: ఇచ్చెదను గాని నీ వల్లరిచేయక నాయొద్దఁ గూర్చుండి నే నడిగిన యంశములకు సదుత్తరముల నిమ్ము. నీవు పరిహాసము చేయుకాలము మించినది.

ఆమె దగ్గఱఁగూర్చుండి, పరుపు క్రిందినుండి రూప పటము దీసి యా పటమును జూచి వీరమతీ ముఖమును దిల కించి యనసూయ నవ్వెను. వీరమతి యామెచేతినుండి పటముం దీసికొనెను.

అన: ఇ దేమే నేఁ జూడకూడ దా యేమి?

వీర: చూడవచ్చును గాని యీ పట మే మహానుభావునిదో తెల్పవే.

అన: అదియేమో నాకేమి తెలియునే?

వీర: చెలీ! అనసూయా! నీ కీ పట మెట్లు లభించెనే?

అన: మొన్న మాపిన్నతల్లిగారియూరికిఁ బోయితిని. వారి గదిగోడపై నీచిత్ర మమర్పఁబడియున్నది. ఇది యెవ్వరి దని మా తమ్ముని నడిగితిని. వాఁ డేదియో యొకపేరు చెప్పి, యీ చిత్రమును గుఱించి యొక చరిత్రమును జెప్పెను, నేను దిరిగి యిచ్చటికి వచ్చునప్పుడు మాపిన్ని "అమ్మా! నీ కేమికావ లయు"? నని యడుగ నే నీ రూపపటము నిమ్మని కోరితిని. వా రొసంగిరి, నేఁ దెచ్చితిని.

వీర: ఈయన పేరేమని మీ తమ్ముఁడు చెప్పెను?

అన: నీ కెందుల కాయన పేరు?

వీర: ఏమి నే వినఁగూడదా?

అన: నీ మనసులోని మాట నే వినఁగూడదా?

వీర: పోసియవే. ఎంత మురిపించుచుంటివి? పటము చూపించుటకే నిన్నంతయును మురిపించితివి. పేరు చెప్పుటకీనాఁడంతయును మురిపింతువు కాఁబోలును.

అన: మురిపించుట కేమిగాని నే నొకమాట యడిగెదను. అబద్ధమాడక యున్నదున్నట్లు చెప్పెదవా, నీ కాతని యుదంతము నంతయు నెఱిఁగింతును.

వీర: అడుగుము. నీకడ దాపఱిక మే మున్నది?

అన: నిజమే కద? నా చేతిలోఁ జేయి వేయుము.

వీర: ఎంత వన్నెలాడివే నీవు. నా మనస్సున కిష్ట మైనచోఁ జెప్పెదను.

అన: ఈ పటమును జూచినవెంటనే నీ కెట్టిభావ ముదయించినదో చెప్పవలెను.

వీర: నీ మాట నా కర్థము కాలేదు, భావ మేమి! ఉదయించు టేమి!

అన: ఆ! పాపము! నీ కేమియును దెలియదు కాఁబోలును! సరిలే పోనిమ్ము, నా పటము నా కిచ్చివేయుము.

వీర: చాలును నీ వగలాడితనమును గట్టిపెట్టి యీాయన పే రేదియో చెప్పుము.

అన: నే నడిగినమాట నీవు చెప్పితివా? నేను మాత్ర మేల చెప్పవలయును?

వీర: ఏదియో యొకభావము గలిగిన దనుకొనుము; దానిఁ జో నీ కేమి ప్రయోజనము?

అన: ఏదియో యొకపేరున్న దనుకొనుము; దానితో మాత్రము నీ కేమి లాభము?

వీర: ఎంత దానవే నీవు!

అన: నీయంత దాననే నేను.

వీర: పోనీ. చెప్పకున్న నీపని నీవు చూచుకో; నాతో మాటలాడకు.

అన: ఆలాగుననే; నా పటము నా కిచ్చివేయుము.

వీర: నే నీయను.

అన: ఏమి న్యాయమే యిది, ఇది నీ సొత్తా?

వీర: అవును నా సొత్తే.

అన: చేతికి దొరకినంతమాత్రమున నతఁడు నీసొత్తెట్లయ్యెనో?

వీర: గడుసరి! చాలింపు మీ విసురులు. ఆలాగున నయిన నీతో మఱి మాటాడను.

అన: ఇప్పుడే సరిగా మాటలాడవు. ఆలాగున నయిన నింక మాటలాడుదువా?

వీర: నీ వెక్కడ నేర్చితివే యీ మాటలు?

అన: మన మిరువుర మొకబడిలోనే కదా చదివితిమి!

వీర: గట్టిదానవే.

అన: నీకంటెనా?

వీర: పేరడిగిన నెంత కల్పించితివే! పోనిమ్ము. నీవు చెప్ప నక్కఱలేదులే. ఇంక నీతో మాటలాడిన నొట్టు. ఇదిగో! పోవుచున్నాను.

అన: (చీరచెంగు పట్టుకొని) ఇదిగో! చెప్పుచున్నాను, కోపింపకుము.

వీర: చెప్పుము మఱి.

అన: ఇతఁ డొక రాజపుత్రుఁడు.

వీర: సరిపోయినది. ఈపాటి పోల్చుకో లేకపోయితి ననుకొంటివా?

అన: వీరిది ధారా నగరము.

వీర: మీ పినతల్లిగారియూ రనునప్పుడే యది తెలిసినది.

అన: వీరి తండ్రిపే రుదయాదిత్యుఁడు.

వీర: తరువాత?

అన: ఆయన కుమారుఁ డీయన.

వీర: తండ్రి యుదయాదిత్యుఁ డన నాయన కుమారుఁ డీయన యని చెప్పవలయునే! పెంకెతనమును మాని పే రేదియో చెప్పుము.

అన: పేరు మఱచిపోయితినే.

వీర: నీవు చెప్పకుండిన నాపై నొట్టే.

అన: ఈతని పేరా?——ఉండుమీ చెప్పెదను——ఆ! జ-గ-దే-వుఁ-డు.

వీర: (అనసూయను గౌఁగిలించుకొనెను.)

అన: కాని యీయన విషయమున నీ యభిప్రాయ మేమో చెప్పకున్న నీకును నాపై నొట్టే.

వీర: ఒట్టులేదు. గిట్టులేదు. నా కేమియును దెలియదు.

అన: ఐన నొట్టు పాలించుకొందువే?

వీర: అయిన నే మందువే?

అన: ఏమియును లేదు. నిన్న నీ పటమును జూచినప్పటి నుండియుఁ గ్రొత్త చిన్నెలు నీయందుఁ గాన్పించి నవి. వానికి గారణ మేమియో చెప్పుమందును.

వీర: నీ వేమనుకొంటివో తెల్పుము.

అన: నే ననుకొన్నది నిజమయినచో నొప్పుకొందువా?

వీర: తప్పక.

అన: నీ వాయనయందు బద్ధానురాగ వైతి వనుకొంటిని.

వీర: దాని కేమిగాని చెలీ! నీ వీ చిత్తరువు నేలఁ దెచ్చితివి?

అన: పొరపాటే; మన్నింపుము.

వీర: ఏమి తప్పు చేసితివి?

అన: ఆయనను దీసికొని రాక పటముం దెచ్చితిని.

వీర: ఆయన యెవరే?

అన: నీ మనోహరుఁడు.

వీర: చాలింపవే. ఆయ నెక్కడ? మన మెక్కడ?

అన: ఇప్పు డిద్దఱు నొకయూరనే యున్నారు.

వీర: ఎవ రెవరు?

అన: కాఁబోవు భార్యా భర్తలు.

వీర: ఎవరే వారు?

అన: వీరమతీ జగదేవులు.

వీర: చెలియా! నా కంతటి యదృష్టము పట్టునా?

అన: రేపీపాటి కెంతటి యదృష్టము పట్టునో చూచుకొనుము.

వీర: అది యేమో వివరించి చెప్పరాదా? న న్నేల యుల జడిఁ బెట్టెదవు?

అన: చెలీ! నీ వదృష్టవంతురాలవు. నేను సంకల్పసిద్ధురాలను

వీర: మరల నీ సోఁకులు మొదలిడితివి. ఆలస్యము చేయక
చెప్పవే.

అన: వీరమతీ! నే నీ పటమును జూచిననాఁడే సదయా
సక్తుం డయి, సాయాహ్నంబునఁ బురవీథిని వచ్చు
నీ మనోహరుం గాంచితిని. ఇప్పటి రాజకుమారు
లలో నట్టి సౌందర్య పరాక్రమములు గలవాఁ
డెందును లేఁ డని చెప్పవచ్చును. ఆయనను జూచి
కన్ను లున్న ఫల మనుభవించితిని. ఆయన పరా
క్రమాదులను విని శ్రవణేంద్రియము కలిగిన లాభము
నొందితిని. పరమేశ్వరుఁడు మీ యిరువురకును
దాంపత్యము కూర్చినచోఁ బ్రశంసార్హుం డను
కొంటిని. మీ నాన్నగారును, అన్నగారును, నా జగ
దేవ కుమారునికే నిన్నీయ నిశ్చయించిరి. పొంచి
యుండి యిప్పుడే వా రాడుకొన్న మాటలు విని
వచ్చితిని. ఉదయాదిత్యుని పెద్దకుమారుం డగు
రణధవళసింహునకును గౌడదేశాధీశ్వరుని యనుంగుఁ
గూఁతురు సీతాబాయికిని వివాహము గావింప
నిశ్చయ మయ్యెను. మగపెండ్లి వారందఱును దరలి
వచ్చిరి. నేఁడు మన యూరికి వత్తురు. వారి
నాహ్వానించుటకు మన యన్నగారు చనియున్నారు.
నీ మనోహరుం డీ పెండ్లికి వచ్చునో లేదో తెలి
యదు. ఏలొకో యాతఁడు తండ్రిగారికిని రాజ్య
మునకును దూరుఁ డయియున్నవాఁడు. ఆతఁ
డుండవలసిన స్థితియందుఁ లేఁడు. ఆతనిం గూడఁ
దీసికొని రావలయు నని ప్రత్యేకముగ గంభీర

సింహుఁ డుదయాదిత్యునకు వ్రాసియున్నాఁ డని యును ధారా నగరమ్మునసే వింటిని. కావున నాతఁడును వచ్చియే యుండును. ప్రస్తుతము పేద వడియున్నను నతనికే నిన్నీయవలయు నని యన్న గారు నాన్నగారితో గట్టిగఁ జెప్పియున్నారు. నీ యిష్టమును దెలిసికొన నాన్నగా రిప్పుడే యిచ్చ టికి వత్తు మని బయలుదేఱిరి. అన్నగారు పెండ్లి వారి నాహ్వానించుటకును నాన్నగా రంతఃపురము నకును నేను నీకీ సమాచార మెఱింగించుటకు నొక్కసారిగా బయలుదేఱితిమి.

ఇంతలో "అమ్మా! వీరమతీ! నాన్నగారు పిలుచు చున్నారు. వేగముగా నమ్మగారి యంతఃపురమునకు రావలయు నని సెల వయినది" అని యొక దాసి పరుగెత్తి వచ్చి చెప్ప "సరి యిదిగో వచ్చుచున్నానని వచింపుము" అని దాసిం బంపి "చెలీ! ఈ పటమును భద్రముగా నుంచుము. నేను మరల నిప్పుడే వచ్చెదను" అని వీరమతి గల్లు గల్లు మను నొయ్యారముతో బయలువెడలెను.

---

సప్తమోల్లాసము

# రాగాంధుని యవస్థ

స్థలము దుర్గమ మగు నరణ్యము. నాఁ డమా వాస్య. నిశీథసమయము, మేఘము లంతరిక్షమున దట్ట ముగ నల్లుకొని యున్నవి. జగ మంతయుఁ గాఱుక ప్పూసి.

నట్టు లయోమయం బయియున్నది. వఱదులు మున్నగు
నీచ జంతువుల యఱపులును గూబలు మొదలగు క్షుద్ర
పక్షుల కూఁతలును మాత్రమె వినవచ్చుచున్నవి. అప్పు
డప్పుడు భయంకరము లగు ఘాతుక మృగముల గాండ్రింపు
లును బొబ్బరింతలును శ్రవణేంద్రియమును హృదయ
ముతోఁగూడఁ బగల్చుచున్నవి. మెఱుగుడు పురుగులు
కాననమం దంతటను మెఱయుచుఁ బరువెత్తుచున్నవి.
అప్పటి దృశ్యమున నవియే యించుక వెలుఁగు గల పదా
ర్థము లయి యున్నవి. ఇట్టి భయంకరాటవిలో నొక యేఁటి
దరిని గొందఱు పాంథులు గుడారములు వేసికొని యున్న
వారు. సుమారు పది పండ్రెండు గుడారము లొక్కతీరున
వలయాకారముగ వేయఁబడియున్నవి. దానికి నడుమ
నతి సుందర మగు పట్టు డేరా యొకటి వేసియుండెను. అందు
శిబిరమున కిరుప్రక్క విచ్చుకత్తులను బూని జవానులు
నిర్నిద్రులయి పహారా లిచ్చుచున్నవారు. కవచధారి యగు
నొక పురుషుఁడు గుడారములచుట్టు నాయుధపాణి యై
యతి జాగరూకతతోఁ దిరుగుచున్నవాఁడు. గంట కొక
సారి యా యాయుధపాణి పట్టుగుడారములోని కరిగి వెంటనే
తిరిగివచ్చుచున్నాఁడు. దాన నతని నేలువా రందు నిద్రించు
చుండి రని మన మూహింపవచ్చును. రెండు మూఁడు సారు
లాతఁ డా పట్టుగుడారము చుట్టు తిరిగి వచ్చి యొక్కొక్క
గుడారమున కరిగి యందలి జవానుల చెవులలో నేదియో
రహస్యముగాఁ జెప్పుచు వచ్చెను. ఆతనిరాక చూచినంతనే
యా జవానులు చేతులు జోడించి "చిత్త" మను మాట
తప్ప నింకేమియు ననుట కొక్కఁడును సాహసింపలేదు.

దీనింబట్టి చూడఁగా వారి కంపతి కతఁ డధికారి యని తోఁచును. తరువాత నతఁడు తన గుడారమున కేగి హొరాయలు గులుక నలంకరించుకొని సువాసనలను వెదఁజల్లు దుస్తులను దొడిగికొని చేత బెత్తమును బట్టుకొని మీసమును నొయ్యారముగ దువ్వుకొనుచు మెల్లఁగ నడచి వచ్చెను. నాల్గవసారి యాతఁ డా గుడారమును బ్రవేశించెను. ఆతఁ డేలొకో యిన్నితడవ లా గుడారమున కేగుచున్నాఁడు! అచ్చట నెద్దియొ విశేష ముండియుండును. ఇంతి వేష మింత శ్రద్ధతో వేసికొని యీ నిశీధమున నితఁడీ గుడారమున నేమిచేయ నేగుచున్నాఁడో చూతము గాక!

అతఁడు లోపలఁ బ్రవేశించెను. శిబిరాంతర్భాగమున నాకు పచ్చ మకమలుతో నిటయిన మేలుకట్టు కట్టఁబడి యున్నది. పూర్ణచంద్రునివలెఁ గాచపాత్రమున దీపము వెలుగుచున్నది. అం దొకప్రక్కను సమంచితము లగు బంగరు టాసనములు, సైమకమలు రంగుతోఁ గలిసి తళతళ మెఱయుచున్నవి. వానికి సమీపమున మేజా బల్లలు రెండమర్పఁబడి యున్నవి. ఒకదానిపై ఫలములు పానీయములు నెలకొని యున్నవి. ఇం కొకదానికిఁ బై భాగమున మంచి ముకురము సంతనము చేయఁబడియున్నవి. తల నూనెలు, వాసన ద్రవ్యములు, దువ్వెనలు మున్నగు వస్తువులు దానిపై నిండి యున్నవి. వాని కెదురుగ బల్లకు రెం డేసి మంచి కుర్చీలు వేసి యున్నవి. దాని సమీపమునఁ దాంబూలపు సంపుగులు రత్నఖచితము లగుటచే నెంతయుఁ బ్రకాశించుచున్నవి. ఇం కొకప్రక్క నొక మరల మంచ మున్నది. మంచమునకుఁ గఱ్ఱతోఁ జేయఁబడు వస్తువులు వెండితోఁ

జేయఁబడినవి. దానిపై నొకపాగడ చక్కియున్నది. ఆ చక్కికిఁబైని జుట్టును బది యంగుళముల యెత్తుగ మంచమును గలిసియే గిలకల వరుస యున్నది. చక్కి నానుకొని దానిపై హంసతూలికతోఁ దయారు చేయఁబడిన రెండు పఱుపు లున్నవి. మెత్తని పట్టు కుబుసములతోఁ జెన్నలరు దిండ్లు గలవు. నేలకు రెండడుగుల మీఁదుగ నా మంచము వెండి గొలుసులతో గుడారపు పైదారువులకుఁ గట్టబడి వ్రేలాడుచున్నది. దానికిఁ జుట్టును సన్నని దోమతెర వేసి యున్నది. పరమ లావణ్యవతి యగు నొక బంగారు బొమ్మ యా శయ్యపైఁ బ్రక్కబారుగఁ జెక్కిలిక్రింద నరచేయిఁ జేర్చుకొని పండుకొని నిదురఁబోవుచున్నది. ఆమె యందము వర్ణింప నలవికానిది.

ఆ సైనికాధికారి యొడలు గడగడ లాడుచుండెను. పాదములు తొట్రుపడుచుండెను. ఆమెను జూచి వాని కన్ను లెంత సంతోషించినవో చెప్పలేము. ఇంతలో నామె చిన్నచిఱునవ్వు నవ్వెను. పైకపోలముపైఁ జిఱుగుంట పడెను. ఆహా! ఏమి యా మోము చక్కఁదనము! బొమలు కొంచె మాకుంచితములయ్యెను. కొంచెము పెదవు లెడఁ బడెను. తదేక దీక్షతో నామె ముఖమును దిలకించుచున్న వానియలజడి చెప్పఁదరము కాకుండెను. ''ఏమి నా యదృష్టము! ప్రియా! రమ్ము! రమ్ము!'' అని యామె నోటినుండి నాలుగుమాటలు వెలువడెను. వాని యానందమునకు మేర లేకపోయెను. ''ఏల సంకోచించుచుంటివి! నిన్నే దైవముగ నమ్మియున్న నాకడ నీకీ మొగమోటమి యేల?'' అను రెండు పలుకులు మరల నామె పల్కెను. అతని యొడలు

పులకాంకురిత మయ్యెను. "ఆహా! తరుణీమణుల మనోనిశ్చయములను గుఱుతించునప్పు డెంతటి యనుభవ రసికులును బరిపాటిగఁ బొఱపాటు పడుచుందురు గదా! రెండు నెలలనుండియు ననుదినమును నీమె యంతరంగము నా యెడల నెట్టులున్నదియో గుఱుతింప వలయు నని యెంతయో ప్రయత్నించితిని. నే నొనరించుసేవ యంతయు నిరర్థకమయిన దనియు, నొకమాఱు అయిన నీమెను గన్నులారఁ జూచుభాగ్యము లభింపలే దనియు, నా యుద్దేశము నీ సుందరాంగి గ్రహింప లేకపోయిన దనియు నిశ్చయించిగదా యీ నాఁడీ సాహసమునకు నెట్టుకొంటిని. నా పైని బరిపూర్ణ మగు ననురాగ మున్నట్టు లీ మాటలవలన స్పష్టమయ్యెఁగదా! ఔ నౌను! ముగ్ధలన నిట్టివారే. పోనిమ్మేది యెట్టులయిన నే సాహసించుటయే మంచి దయినది. దైవ మన్నియు నట్టులు కూర్చుచుండును. నిన్నఁటి సాయాహ్నమున నామె దరిసెనమే కాక యున్న నేఁ డిట్లు సాహసింపలేను. నిన్నఁటినుండియు నేఁ బడిన పరితాప మా దేవునకే తెలియును. ఎట్టు లయిన నేమి? ధన్యుఁడ నైతిని. రామామణితో రాజ్య రమామణియు నా స్వాధీన మగును. స్త్రీల చిత్తమును, బురుషుని భాగ్యమును నే వేళ కెట్లు మాఱునో దేవునికైనను దెలియదఁట" అని యనుకొనుచు న మ్మోహాంధుం డుయ్యెల మంచమును సమీపించెను.

"ప్రాణనాథా! నిన్నుం గాంచినప్పటినుండియు నే నొందుచున్న యలజడి యా సర్వేశ్వరునికే యెఱుక. దగ్గఱకు వచ్చియుండియు నొకమాటయైన నాడవు. నీ వచన సుధారసమున నా హృదయతాపము నార్పుము. ఆలస్య మొనరిం

పకనం జేపట్టి ప్రాణదాన మొసంగుము" అని యామె మరలఁ బలికెను. వానిమన స్సెట్టు లుండెనో వానికే తెలియును. మన కేమి తెలియును? ఆపలుకులు విని యతఁ డెట్టు లెట్టులో సాహసించి యామె శయ్యకడకుఁ బోయెను, కాని మాటాడుటకు గాని చేయి వైచుటకు గాని సాహసింప లేకుండెను. సోమతెర తీసివేసెను. ఆమె ముఖమును దగ్గఱకుఁ బోయి చూచెను. ఆమె గాఢనిద్రా పరవశయై యుండెను. వాని కేమియును దోఁచకుండెను.

ఒకమంచి యుద్యానవనము కలదు. అందొక చక్కని జలాశయ మున్నది. ఆ దరిని రమ్యమగు లతా మంటప మున్నది. అందొక యందమైన చిగురుపా న్పమర్పఁబడి యున్నది, ఆ పాన్పుపై ననుపమాన లావణ్యవతి యగు నొక యంగనామణి శయనించి యున్నది. ఆమె చుట్టును బుటపాకము దీఱిన పసిండి శలాకను మించు మించుఁ బోఁడు లున్నవారు. ఆ సమీపమున నొక బంగరుకొండ కలదు. దానిపైనుండి యమృత ప్రవాహము వచ్చుచున్నది. ఆ ప్రవాహము వెనువెంట గంధర్వ కామినీమణులు వగుచున్నారు. ఆ కొండమీఁదినుండి యీ జలాశయమువఱకుఁ జంద్రకాంత శిలామయములగు సోపానములు వెలుఁగొందుచున్నవి. ఆ సోపానములపైనుండియే యీ ప్రవాహము వచ్చుచున్నది. ఆ ప్రవాహము ననుసరించియే యీ గంధర్వాంగనలు వచ్చుచున్నారు. క్రమ క్రమముగఁ గొలను నిండెను. దానిలోఁ దిగి యీ గంధర్వ స్త్రీలు జలక్రీడ లాడుచుండిరి. ఒడ్డున నొక కల్ప పాదపము కలదు. అది శాఖ లోనికి వంగి యుండెను. దానిపైఁ గొందఱు గంధర్వులు

నిలిచి యుండిరి. జలక్రీడ లాడిన కామినీమణులు చేతు
లెత్తిరి. వారి పురుషు లా సుందరుల చేతులు పట్టుకొని
కల్పవృక్షములమీఁదికిఁ దీసికొనిరి. చూచుచుండఁగ నా తెరు
రాజ మొక ప్రాసాద మయ్యెను. ఒక్కొక్క స్త్రీరత్న
మొక్కొక్క పురుషుని చేయి పట్టుకొని వారందఱు నిముస
ములోఁ దత్సౌధోపరి భాగంబున కరిగిరి. వారి ముఖముల
కెదురుగ శరత్పూర్ణిమా సుధాకరుఁడు వెలుఁగొందు
చుండెను. ఆ చంద్రకిరణము లమృతధార లయి వచ్చి
యా గంధర్వ యువ యువతి నికర ముఖ కమలములఁ జొచ్చి
లీన మయ్యెను. ఆ ముఖ కమలము లన్నియు నన్ని చంద
మామ లయి ప్రకాశించుచుండెను. ఆ చందమామ లన్నియు
వరుసగా గానము చేయ నారంభించెను. గంధర్వ దంపతుల
శరీరములు మఱి కనుపింపవయ్యె. గానము మాత్రము
కర్ణ రసాయనముగ వినవచ్చుచుండెను. ఒక చందమామ
కంటె నింకొక చందమామ తన గానచాతుర్యమును
జూపించుచుండెను. సుగంధఁ యుతమై గాలి చల్లఁగ మెల్లగ
వీవఁ దొడంగెను. ఆ వెన్నెలయు నా గాన మాధుర్యమును,
నా పరిమళ గంధవాహమును నొకదానితో నొకటి పంతము
వేసినట్లు సౌఖ్యమును గూర్చుచుండెను. పల్లవ తల్పమునఁ
బవ్వళించియున్న యా చప్పని యీ సౌఖ్యమును జూఱఁ
గొనుచున్నది. ఆ గానమునకు నా వెన్నెలకును జంద్రకాంత
శిలానిర్మితమగు నా సౌధ మంతయు నీరయి యా పద్మా
కరమునఁ గలిసెను. ఆ చందమామ లన్నియు నేకమయి
నవి. ఒక పూరుషాకృతిని వహించినవి. ఆ పురుషుని
చక్కఁదన మెంతటి రసికులును వర్ణింపఁజాలరు. ఆ యువతి

మణి తటాలున లేచి చేతులు జోడించి నిలిచి యా పురుషు నచ్చటికి దయచేయు మని ప్రార్థించెను. అతండు దగ్గఱకు వచ్చి మఱి యనుగ్రహింపఁడయ్యె. ఆమె యవస్థ వర్ణనాతీతము. చూచుచుండఁగ నచ్చటి దృశ్య మంతయు మాయ మయ్యెను. ఆమె యతిదీన వదన యై కన్నీరు కాల్వలై కార నేడ్చి యేడ్చి తుద కర్ధ నిమీలిత నేత్ర యై కర కమలంబులు మోడ్చి యా పురుష విగ్రహంబును మనఃపీఠంబున భద్రముగా నుంచి యితర వ్యాపారములయందు బుద్ధి నరుగ నీయక చిత్తవృత్తిని నిరోధించి యేకాగ్రతతో ధ్యానించెను. ఆమె కన్నులు మూసికొని యుండఁగానే యొక తేజస్సు కనబడెను. చూడఁ జూడ నందా పురుష విగ్రహము గాన్పించెను. ఎంత బ్రతిమాలిన నతఁడు మాటలాడఁడు. ఇది యొక యవస్థ. స్వప్నము. ఈ స్వప్నమును గాంచుచున్న బాలికామణి దగ్గఱనే యా మోహాంధుండు నిలిచి యామె వదనమును నిరీక్షించుచున్నాఁడు. స్వప్నములోని ధ్యాన సమయమునఁ బ్రత్యక్షమైన పురుషుని గుఱించి చేయు నామె నోటినుండి వెడలిన మాటలా కామాంధుని మోహాంధుని గావించినవి. ఆమె నిద్రించుచుండె నేమో యని వాఁడు భయపడెను. మరల నేదియో యామె మాటలాడసాగెను. వాఁడు కొంచెము ప్రక్కకు దొలఁగి నిలిచెను. "నా ప్రాణపదమా! ఏల నన్నిట్టి యిక్కట్టుల పాల్పఱతువు. నీ ప్రథమదర్శనముననే నా యర్ధప్రాణములు నీ కర్పించితిని. నన్ను జేపట్టక తీఱదు. ఏమి? నే నేకపత్నీవ్రతస్థుఁడ నందువా? స్త్రీహత్య గొడిగట్టుకొన సాహసింతువా? ఇంత దాఁపునకు వచ్చియు నేల నా పాణిని గ్రహింపవు? ఇదిగో!

నా హస్తము. నీ వెందులకును జంకవలసిన యవసరము లేదు'' అని యా రమణీమణి తన దక్షిణహస్తము నెత్తెను. ఇంక నేమి సంశయ మని యా రాగాంధుఁడు నవరత్న సువర్ణ కంకణాంగుళీయక విరాజితమై పరమ పవిత్ర మయి తళ తళమని మెఱయుచున్న యామె హస్తమును బట్టుకొనియెను. వాని యొడలు జల్లుమనియెను. ఆమెకుఁ దెలివి వచ్చి యులికిపడి లేచి కన్నులు విప్పి యెదుట నున్న యా మూర్ఖునిఁ గాంచెను. తోఁక త్రొక్కిన యాఁడు త్రాచువలె నాతనిం జుఱచుఱం జూచుచు నెడమ చేతితో వానిచేయి పట్టుకొని ప్రక్క క్రింది ఛురికను దీసి వాని గొంతుకలోఁ గ్రుచ్చెను. ఆమె కెప్పుడు మెలఁకువ వచ్చెనో వాఁ డప్పుడే యొడలు తెలియక జీవచ్ఛవ మయ్యెను. తరువాత నిజముగ శవ మయ్యెను. దుబ్బు మను శబ్దము వినిపింప నామె చెలికత్తెలు మేలుకాంచి ''ఏమా చప్పుడు'' అని దిగులొంది యడుగ ''నోరు మూసికొనుఁడు. ఏమియును లేదు'' అని యామె పలికెను. ఆమె యాకృతిఁ జూడ నతి భయంకర మయి యుండెను.

---

### అష్టమోల్లాసము

## ఆపద్బాంధవులు

ఒక్క దినములో నగర మంతయును శృంగారింపఁబడెను. నగరవాసు లెల్ల రత్యుత్సాహముతోఁ జెలంగ నుండిరి. కలపములు చల్లి రాచబాట లూరివారలు శుభ్రపఱిచిరి. గృహ ద్వారములయందును వీథులలోఁ గట్టిఁ

వితానములయందును రసాల దళ తోరణములును గుసుమ మాలికలును నలరారుచుండెను. రంగు రంగుల జెండాలు సౌధోపరిభాగమ్ములయం దెగురుచుండెను. "అయ్యా! విచ్చేయుఁడు" అను నక్షరములు బంగారు వెండి ద్రావకములతోఁ జీనాంబర ఖండములయందు వ్రాయఁబడి మేలుకట్టుల శిరోభాగములయం దమర్పఁబడి యుండెను. యాత్రా యాత జనమ్ముల కల కలమ్ములు వివిధ తూర్య రావమ్ములు మంగళ ధ్వనులును మిన్ను ముట్టుచుండెను. ఇంతలో రాజపుత్రుఁడు వీరసింహుండు తనవారితోఁ గలిసి యుద్యానమందు విడియించిన యుదయాదిత్యుని సభా భవనముఁ జేరెను.

చెఱి యొకప్రక్క నిరువురు తనయులును గూర్చుండి యుండ కొలువుదీరి యున్న యుదయాదిత్యుఁడు వీరవర్మ నెదురుకొని సత్కరించెను. లౌకిక విధానము లగు మర్యాదలును మాటలు నైన తరువాతఁ దన తండ్రిగారి యుద్దేశమును దెలిపి, నారికేళ ఫలమును జగదేవుని చేతి కిచ్చి, నుదుటఁ దిలకమిడి వీరసింహుండు "నేఁటి సాయాహ్నమునిమిది గంటలకు నా సోదరీమణి యగు వీరమతిని జగదేవ కుమారున కొసంగి వివాహముఁ గావింప శ్రీ నాన్నగారు తగు పెద్దలతో నాలోచించి నిశ్చయించియున్నవారు. నాలు గైదు తరములనుండియు సత్యాంత మైత్రిగల పరమార కుటుంబముతో సంబంధము కలిసినందులకై మే మొందు చున్న యానందమునకు మేర లేదు. తమ తాత తండ్రుల వలె మా కుటుంబమునం దవ్యాజానురాగమును జూపు చుండుటయే కాక యీ రాజ్యము మా కొసంగి కీర్తి ప్రతి

ష్టలు కలుగఁజేసిన శ్రీ చక్రవర్తి ధారానగరేశ్వరు లుదయాదిత్య మహారాజుగారు మా నాన్నగారిచే మనఃపూర్వకముగ నీయఁబడు నా చెలియలు వీరమతిని దమ కోడలుగా నంగీకరించి యనుగ్రహింపవలయు నని నమస్కార పూర్వకముగ వేఁడుకొనుచున్నాఁడను" అనునంత సభవా రందఱును కరతాళ ధ్వను లొనరించుచుఁ దమ యుత్సాహమును సూచించిరి. "శిరసా వహించి రాజసింహ సరదారువా రిచ్చు నుపాయనము సంగీకరించితిమి" అని మహారాజుగారు సెలవిచ్చిరి. భూసుర పుంగవులు సుస్వరయుక్తముగ వేదోక్తంబు లగు నాశీర్వాదంబు లొనర్చి పుష్పములు నక్షతలును జగదేవ కుమారునిపైఁ జల్లిరి. అందఱు నాశీర్వాదంబుల ననువదించుచు "తథాస్తు తథాస్తు" అనిరి.

సుగ పెండ్లివారు కళ్యాణమంటపమునకుఁ దరలి వచ్చిరి. సాక్షాల్లలితాదేవివలె నలరారు వీరమతిని బసిఁడి శలాకలవలెఁ దనరారు బన్నిద్దఱు చెలికత్తెలు పరివేష్టించి కళ్యాణ మంటపమునకుఁ దెచ్చిరి. పెండ్లి కొమరుఁడు తెర కావలను, బాలిక యీవలను నుండి యొకరి నొకరు చూచుకొనవలయు నని యువ్విళ్లూరుచుండిరి. బ్రాహ్మణోత్తములు వేద మంత్రములను జదువుచుండిరి, పుణ్య స్త్రీలు మంగళ గీతములను బాడుచుండిరి. వివిధ మంగళ వాద్యధ్వనులును బోరుకలగుచుండెను. విధి విధానముగఁ బెండ్లి తంతు జరిగిన పిదప రాజసింహ సరదారల్లుని పాదములు గడిగి, మధుపర్క మిచ్చి సకలోపచారము లొనర్చి పూజించి సాలంకృత కన్యాదానమును మనం బలరార నానంద బాష్పములతో, నక్షతోదకములతో నొసంగెను.

ఈ యాపద్బాంధవు లెవ్వరో మనకుఁ దెలియదు గాని యాకారములను జూచిన యిర్వురును రాజపుత్రు లనియే తోఁచును. రెండు గంటలసేపయినతరువాత వీర సింహునికిఁ దెలివి వచ్చెను. కన్నులు విచ్చిచూచెను చీఁక టిగా నుండుట కచ్చెరువంది లేచెను. కన్నులు తిరుగ మరలఁ బ్రక్కపైఁ బడెను. ఇంచుక తడవునకు మరలఁ దెలివి రాఁగా లేచి, తనచేతి కందుచున్న గవాక్షమును దెఱ చెను. ఎదుటి మంచముపై జగదేవుఁడు పండుకొనియుండెను. ఆతఁడు చనిపోయెను గాఁబోలు ననుకొని వీరసింహుఁడు మిక్కిలి దుఃఖించెను. ఇంతలో నతనికి మరల మూర్ఛ వచ్చెను. దానిలోనే నిద్దుర పట్టెను.

మఱి యైదు నిమిషములైనతరువాత జగదేవునికిఁ దెలివివచ్చి కన్నులు విచ్చి చూడ నెదుటి మంచముపైఁ బండుకొన్న బావమఱఁది యగుపించెను. ఆ దయామయుచే త మిద్దఱ శయ్యలపై బండుకొనఁ జేసిరని యతఁడనుకొనెను. వీరసింహునిగతి యేమయ్యెనో చూడవలయు నని లేచెను. కన్నులు చీఁకట్లు గ్రమ్మ నట్టులే కొంతసే పుండెను. తరు వాత వీరసింహుఁడు లేచెను. ఆతనికి మిక్కుటముగ దప్పి గలిగెను. లేచి చూచుసరికి జగదేవుఁడు కూర్చుండి యుండెను. తన శయ్యపైనుండి సంతోషమును బట్టఁజాలక యాతఁ డీతనిశయ్యపై కొక్కయుఱుకునఁ బోయెను. ఇరు వురు నొండొరులను గాఁగిలించుకొని, ధన్యుల మనుకొని, వా రెందుఁ బోయిరో చూడవలయునని పెద్దతలుపులు తెఱ చిరి. లోపలి బల్లపైఁ గూజా యుండెను. "కావలసినంత నీరు దీనిలోనిది త్రావుఁడు. మాధూలా పరిచారకులను

నమ్మవలదు. ఇప్పుడు జరిగిన యుదంత మెవ్వరికిని దెలుప వలదు'' అని వ్రాసి యొకచీటి కూజాకుఁ గట్టబడి యుండెను. అది చూచి యిరువురు నందలి యుదకమును గావలసినంత త్రావిరి; కొంచెము సేపటిలో నెమ్మది నొందిరి; వా రెందుఁ బోయిరో తెలియకపోయె నని విచారించిరి; ద్వారపాలకునిం బిలిచి యా రాకొమరు లెందు వోయి రని యడిగిరి. 'వారు మాతో, ''నింక రెండు గంటలవఱకు నెవ్వరును మేడలో నికిఁ బోఁగూడ దని వీరసింహులుం డాజ్ఞాపించెను'' అని చెప్పి మన నగరములోనికే పోయిరి. తరువాత సంగతి మా కేమియుఁ దెలియ' దని వాఁడు వచించెను. వారును గుఱ్ఱ ములనెక్కి కోట కరిగిరి. ఆ రాత్రియే యెల్లరును బయలు దేఱి గౌడదేశమునకుఁ బ్రయాణము సాగించిరి.

---

నవమోల్లాసము

# ఆకస్మిక సంఘటనము

ప్రపంచ సభాంతరమ్మున నెలకొని రాజ కార్యములు నెఱవేర్చుకొని దినరా జస్తాచల సౌధాంతర్భాగమున కరి గెను. సంజ కెంజాయ లెల్లెడల నల్లుకొనియెను. మంద మారుతమ్ములు వీఁచుచుండెను. దిన మంతయును వేఁడి వెలుఁగుచేఁ దపింపఁబడిన జంతువుల ప్రాణము లొక్కింత కూఁడఁ జేరుకొనుచుండెను. కడుపార నెర దిని, కొంత పుక్కిళులఁ జిక్కించుకొని, శకుంత సంతానములు తమ తమ

సంతానములను జూచు నుత్సాహముతోఁ గులాయములను జేరుకొనుచుండెను. ప్రకృతి యందు శాంతి నెలకొనియెను. పుష్పిత తరుశాఖాగ్రముల నిలిచి పక్షులు పలు పల్కులు పల్కుచుండెను. ఇట్టి సమయమున గౌడదేశ రాజధాని యగు వీరసాగర ప్రాంతాటవిలో నిరువు రాశ్వికులు వచ్చుచుండిరి. వా రెంత దూరమునుండి బయలుదేఱిరో గాని యశ్వములతోఁ గూడ స్వేద జలంబునఁ దొప్పఁదోఁగిరి. అప్పటికిని వా రిరువురికి నించుక విశ్రాంతి దీసికొనవలయు నను నభిలాష జనింపకుండుట కడుం గడుఁ జోద్య మయ్యె. విశాలములగు ఫాలములును, నాజానువు లగు బాహువులును, ఆకర్ణాంతము లగు నేత్రములును, గుండ్రని ముఖ సరోజములును, నూనూఁగు పస మీఱిన మీసములును, సమూల్యమ గు నుదుపులును, వెడంద లగు నురంబులును, స[illegible]తము లగు భుజశిఖరములును, బలిష్ఠము లగు కాయములును. ధీరము లగు దృష్టిప్రసారములును, కోశ సహితము లయి నడుములనుండి మడమలవఱకు వ్రేలాడు నుత్తమ ఖడ్గంబులును, అరబ్బి హయంబులును, రత్న ఖచితము లగు నుంగరమ్ములును, హారాయలు గులుకు పగిడీలును, తళుకు లీను తురాయులును వా రుత్తమ రాజపుత్ర వీరు లని చెప్పక చెప్పుచున్నవి. వారు హయరత్నములతోఁగూడ మిక్కిలి యలసిపోయిరి. అనుకొన్న వేళకు వీరసాగరమును జేర లేక యా నట్టడవిని జిక్కుకొనిరి. అందు ముం దేగువాఁడు "ఏమోయీ! మన మీ దినమున వీరసాగరమును జేర లేము. ఇచ్చటి కింక నది యిరువది మైళ్ల దూరమున నున్నది. అశ్వము లలసిపోయినవి. మనము

వలసిపోయితిమి. ఈ రాత్రి యీ యడవియందే కడప
వలయు నని తోఁచుచున్నది" అని పల్కెను. "ఏమి చేయ
వచ్చును? ఇది భయంకర మృగముల కిరవగు ఘోరారణ్య
భాగము. ఇందుఁ దలఁ దాచుకొనుట కైన నొండు నెల
వగుపింపకున్నది. మనమాట కేమి గాని గుఱ్ఱము లింక
నడుగు పెట్టిన మఱి మనవి కావు. ఈ దినముననే యీ
మార్గమున నొక సైన్యము నడచినట్టులు గన్పట్టుచున్నది.
వారిం గలసికొంటిమేని సుఖపడుదుము; కాని వారీ యడవిని
దాఁటినట్టులు పొడగట్టుచున్నది. ఈ సమీపమున నెద్దియే
నొక కిరాతాలయమేని గానరాకున్నది. అప్పుడే చీఁకటి
క్రమ్ముకొనివచ్చినది. నా కేమి చేయుటకును దోఁపకున్నది"
అని రెండవవాఁ డుత్తరమిచ్చెను. "రత్నసింగు! అల్లదె
చూడుము. మన కెదురుగాఁ గూఁతవేటు దూరమున మినుకు
మినుకు మనుచు దీపము గానవచ్చుచున్నది. మనము గుఱ్ఱ
ములను డిగి మెల్లగ నడపించుకొని యా కుటీరములను జేరు
కొందము రమ్ము" అని మొదటివాఁ డనుచుఁ గళ్లెమును లాగి
తురంగమును నిలిపి దానిపై నుండి దిగెను. రెండవవాఁ
డును దిగియెను. ఇరువురు రెండు గుఱ్ఱముల కళ్లెములను
బట్టుకొని మెల్లమెల్లగ నడచుచు దివ్వె కానవచ్చు దిక్కున
కభిముఖులయి పోవఁ దొడఁగిరి. ఇట్టు లేవియో మాటలాడు
కొనుచు రెండు గడియలసేపు నడచినను వారు కుటీరములను
జేరుకొనలేక పోయిరి. నడచుట కతికష్టముగా నుండెను.
అంత కంతకుఁ జీఁకటి దట్టముగ నల్లుకొనెను. మిఱ్ఱు పల్లం
బుల నేర్పఱుప శక్యము గాకుండెను. తడవుకొనుచు నడవ
వలసివచ్చెను. ఎట్టులయిన నేమి నడవ నడవ దీపము సమీ

పించెను. మఱికొంచెము సమీపించినంతట నది యొక గ్రామ మని వారు గుఱుతించిరి. ఇంకఁ గొన్ని దీపములు గనిపించినవి. వారికిఁ గొంత యూరట జనించెను. కాలిగోరి జలోనికి దిగి పూర్వముఖముగా వారా గ్రామములోని కేగిరి. గ్రామంబు గవను వేసియుండెను. ఆదాఁపుననే యొక చావడి యున్నది. ఆ చావడిలో నున్న దీపమే, మన మార్గస్థుల నచ్చటికిఁ దెచ్చినది. దాని కెదురుగా నెట్టి యడ్డును లేదు.

"అయ్యా! ఎవ్వ రా చావడిలో నున్నవారు? దయ యుంచి యీ గవను దీసి యీ రాత్రి మాకుఁ దలఁదాచుకొన నొక్కింత స్థల మిచ్చి పుణ్యము గట్టుకొందురా?" అని రత్న సింగు గట్టిగా నడిగెను. ఆ చావడిలోనుండి యిరువురు పురుషులు వచ్చి గవని కట్లు విప్పిరి, గుఱ్ఱములతోఁ గూడ మన బాటసారులను నాదరయుక్తముగఁ జావడికడకుఁ దీసికొనిపోయిరి. మీ రీ గదియం దీ రాత్రి గడపుఁడు. మీ వేషభాషలను జూచిన నుత్తమ రాజపుత్రులవలెఁ గాన్పించు చున్నవారలు. పాలను బండ్లను దెచ్చి యిచ్చెదము. గుఱ్ఱ ములకును దగిన యేర్పాటులు గావింతుము. ఇప్పుడే మువ్వురు బాటసారులు ఫలాహారములను జేసి యీ యెదుటి గదియందు శయనించి యున్నవారు. ఇచ్చట దాఁపుననే మంచికోనేరు గలదు. తాము స్నాన మాచరింప వలయునేని మాతోడ రండు. ఇట్టు లా గుఱ్ఱములను మా చేతి కిండు" అని యా యిరువురు పురుషులును జెఱియొక గుఱ్ఱమును దీసికొని పోయి దగ్గఱ నున్న యొక శాలలోఁ గట్టి, కొంతకసవు వేసి వచ్చి, యా రాజపుత్రుల యుడుపుల నందుపుచ్చుకొని, యెదుటి

గదియం దుంచి కరదీపికం గొని వారిం దోడ్కొని కొలని కరిగిరి.

వీరు వచ్చుసమయమున రెండవ గదిలో నున్నవారు కొంచెము వెంగటిలిరి. తరువాత దీపపు వెలుతురున వారి యాకారములను గాంచి "కనకము! మా రత్నమును గాంచితివా?" అని యొక రన "రత్నసింగా యాతఁడు? నే నానవాలు పట్టలేక పోయితిని. రెండవ వాఁడు మాణిక్యసింగనుట కింక సందేహము లేదు. ఎన్ని దినము లయ్యె వీరిం గాంచి? ఆనవాలు పట్టలేక పోయితిని. హేమ! వీ రేల యిట్లు వచ్చిరో?" అని రెండవ వ్యక్తి పలికెను. మూఁడవ వ్యక్తి వారి మాటలను వినుచుండెను. "కనకాంగీ! నిజమో యబద్ధమో తొందర నొందకుము. బాగుగాఁ బరీక్షించి చేయవలసిన విధానము నాలోచింప వలయు"నని హేమాంగి యన "అమ్మలారా! మీ మాటలు నా కర్థము కాలేదు. ఎవ్వరా వచ్చిన వారు? మీకును వారికి నెట్టి సంబంధము? ఒకరి నొకరనుకొని మీరు తొందరపడినచో మనము బయలు పడుటయు నాపదల నొందుటయుఁ దటస్థించును" అని మూఁడవ వ్యక్తి పలికెను. "నేను బాగుగ గుర్తించితిని. అందు శ్యామాంగుఁడు మా యన్న రత్నసింగు. ఆ గౌరాంగుఁడు మా కనకాంగి సహోదరుఁడు. సుమారు నాలు గేండ్లయినది—వీరు దేశాంతర సందర్శన కుతూహలు లయి యిలు వెడలి పోయిరి; ఎన్నఁటికిని రాక పోయిరి. వారి యందే మా మనంబులు లగ్నమగుట యును, బూర్ణ యౌవనమున దుష్ట పూరుష నికాయ్యమ్ము లగు నగరమ్ముల వసించుట ముప్పనియుం దలంచి యిలు

బయలువెడలి నిన్నుఁ గలసికొంటిమి. నీవు మ మ్మాదరించి మా వెనువెంట బయలుదేఱితివి. ఈ జన్మమున వీరిం గలసికొందు మనుకొన లేదు. నేఁటి కిట్టి భాగ్యము మాకు లభించినది" అని హేమాంగి యనెను. "చెలులారా! మీరు నన్ను విడిచి పోవుదురా? మనము జీవితకాలము నొక చోట నుండవలయు ననుకొన లేదా? మీ తపమ్ము ఫలించె నని నేనును సంతసించుచుంటిని; కాని మీరు న న్నెడఁబాసి పోవుదురేమో యని భయపడుచుంటిని. పోనిండు. మీ వారలఁ గలసి మీరైన సుఖింపుఁడు. ఎప్పటికైన మీరు మీ భర్తలతోఁ గలసి సిద్ధరాజ నగరమునకు వచ్చునటులు నాకు మాట యిండు. నా సంగతి మాత్రము మీ రెచ్చటను బయలుపఱుప రాదు. నేను దెల్లవాఱుజామున బయలుదేఱి ముందు మకామున కరిగెదను" అని యా మూఁడవ వ్యక్తి పలికెను. అంతలో నా గ్రామమునఁ బెద్ద కలకల ముదయించెను. అది యంతకంత కధిక మయ్యెను. తులువ లెవ్వరో గ్రామము కొల్లపెట్టుచున్నట్లు వారు గుఱుతించిరి; త్వరపడి వారు వారి వేషములను వేసికొని యీవలకు వచ్చిరి. ఊరి వారును దోపిడి వారును గ్రుమ్ములాడుచుండ వీ రా మూఁకలోఁ గలిసిరి. ఇంతలో స్నానార్థ మేగిన రాజకుమారులును గ్రామాధికారియును బరుగుపరుగున వచ్చిరి. "అయ్యా, వీరు తుంటరు లగు దోపిడిగాండ్రు. ఊరివా రందఱును మిక్కిలి నొచ్చియున్నారు. మనమును మనకుఁ దోఁచిన రీతి వీరికి సాయము గావింతము. నేను మా యింటికిఁ బోయి నా ఖడ్గమును దెచ్చుకొనెదను. మీరును మీ ఖడ్గముల నందుకొనుఁడు" అని గ్రామాధికారి చెప్పి తనయింటిలోని

కరిగెను. రాజపుత్రు లిరువురును సన్నద్ధు లయి తమఖడ్గ ముల నందుకొని యా మూఁకలోఁ జొరఁబడిరి. పాపము! వా రలసి యలసి యుండి యాఁకలితో వేగుచున్నను నాపన్నివారకము లగు నంతఃకరణములతోఁ దొమ్మిలోఁ గలిసిరి! ఎవరికిఁ గలిగిన పరాక్రమము కొలంది వారు పెనఁగిరి. వచ్చినది ఘూర్జర సైన్యము. గ్రామస్థులును గ్రామాధికారియును, రాజ పుత్త్రులును గలసి యొకవిధముగ దోపిడిగాండ్రను గొందఱఁ జుద ముట్టించిరి. అందు మఱి ముప్వురు మహాయోధులు చూపిన పరాక్రమమునకు నిలువలేక దోపిడిగాండ్రు కాందిశీకులై పలాయితు లైరి. గ్రామస్థులును దోపిడిగాండ్రును జాలమంది హతు లయిరి. తుదకు గ్రామాధికారి కర దీపికలు వేయించి చూడ నిరువురు స్త్రీలు పురుషవేషధారిణు లయి పడియుండి కానవచ్చిరి. వారి శరీరములకుఁ దగిలిన గాయములకు లెక్క లేదు. వారు నెత్తుటిలోఁ గొప్పఁదోఁగి యుండిరి. గ్రామాధికారి వారిని జావడిలోనికిఁ దెప్పించెను; వారు చనిపోలే దని తెలిసికొని సంతోషించెను. ఇంతలో దోపిడిగాండ్రను వెంటఁ దవిలి రాజపుత్త్రు లిరువురును దిరిగి వచ్చిరి. చావడిలోనికి వచ్చి ఖడ్గములను నేల వైచి యున్న రని యొకవైపున మేను వాల్చిరి; చేతితో నేదియైనఁ బానీయమును దెమ్మని సంజ్ఞ చేసిరి. గ్రామాధికారి గ్రహించి యింటికిఁ బరుగెత్తి యావు పాలను దెచ్చి వారి నోటిలోఁ బోసెను. ఒక యరగంటకు వారు మూసిన కన్నులను దెఱచిరి. గ్రామస్థులు కొందఱా చావడిలోఁ గూర్చుండి వారికిఁ బరిచర్య లొనర్చుచుండిరి. ఆ స్త్రీ లిద్దఱును గాయముల బాధచే మూల్గుచుండిరి. రాజపుత్త్రు

లాహారములను గోర గ్రామస్థులు కొన్ని రొట్టెలను ఫలము లను గొనివచ్చి యిచ్చిరి. కొంచె మాహారము దిని సేద దేఱిన తరువాత నా మూల్గుచున్నవా రెవ్వరని యా రాకొమరు లడిగిరి. "వీ రిద్దరు స్త్రీలు; పురుష వేషధారిణులు. వీ రింకొక వ్యక్తితోఁ గలసి నాయంత్ర మీ యూరికి వచ్చిరి. వీరు పురుషులని మే మనుకొంటిమి. వీరు యుద్ధముఁ జూపిన సాహసము వర్ణనాతీతము. కాయ మెల్ల గాయముల మయమై వీ రిప్పుడు, పాపము, మిక్కిలి బాధ నొందుచున్న వారు. ఆ మూఁడవ వ్యక్తి యెందేగెనో యేఱికిని దెలి యదు" అని గ్రామాధికారి బదులుచెప్పెను. మఱి కొంత సేపటికి రాజ పుత్త్రులు శ్రమ్మ దేఱిరి. వారి మనమ్ము లా గాయముల నొందిన యువతులను జూడవలయు నని త్తొందర నొందుచుండెను. వారు మెల్లన లేచి యా యువతుల కడ కరిగిరి. దీపపు వెల్తురున వారిని బోల్చు కొనలేకపోయిరి.

ఆ యువతులు కన్నులు విచ్చి తమ దగ్గఱ నున్న పురుషులను బరికించి చూచిరి. వారి కన్నులనుండి యశ్రు జలము వెల్లువ యయి ప్రవహింపసాఁగెను. "అన్నా, మమ్ము మఱచితివా? నేను హేమను; ఆమె కనకము నీ ప్రియురాలు" అని హేమాంగి పలుక, మాణిక్యసింగు రత్నసింగు మోమునుం జూచి "బావా! చూచితివా! వీ రిరు వ్రురును గనకమును హేమయు నఁట. ఆహా హా! వీరి కెట్టి యవస్థ సంభవించెను?" అని యనెను. "బావా! హేమ మాటలాడినంత నే, నేను బోల్చితిని. నా కానందమును దుఃఖమును మిక్కుటముగ నొక్కసారి గలుగుటచే నింత

దనుఁక మాటలాడ లేకపోయితిని. అయ్యయ్యో! మీ కేమగుదురో, మనమేమి సేయఁగలము?'' అని రత్నసింగు కన్నుల నీరు నించెను. వారలకుఁ గల బాంధవ్యమును విని గ్రామస్థు లచ్చెరువందిరి; వారికిఁ దగిన యుపచారములు చేయించిరి. ''సోదరీ ఆ మూఁడవవా రెవ్వరు?'' అని మాణిక్య మనఁ ''నా వ్యక్తిని గుఱించి మీకేమియును దెలుప వీలులేదు. ఆమెయు మముబోఁటి రాజపుత్త్రి యువతియే. ఇంతకు మించి చెప్పలేము. క్షమింపవలయు'' నని కనకాంగి ప్రత్యుత్తర మొసంగెను. ఆ రాత్రి వారి వారి దేశాటనపు వృత్తాంతములతోను యుద్ధప్రసంగముల తోను బల్లునఁ దెల్లవాఱెను.

---

## దశమోల్లాసము

# ఏకపత్నీవ్రతము

వీరనాగర నగరమునఁ బెండ్లి సందడి యేమియుఁ గానరాదు; కాని యేదియో ప్రయత్నము మాత్రము జరుగుచుండెను. తెల్లవాఱు సరికి మగపెండ్లి వారు నగరమునకు సమీపమున నున్న తోఁటలో విడిసిరి. అంతకు ముందే వారు వచ్చుచుండి రని చారులవలన గంభీరసింహుం డెఱింగి యుండెను. వారణాసీ నగరపాలకుం డగు జయంతచంద్రుఁడా మఱునాఁడే గౌడదేశమును ముట్టడింప వచ్చుచుండె నని చారులవలన విని గంభీరుఁ డెంతయు విచారించుచుండెను. వీరాగ్రేసరుం డగు గంభీరసింహుఁడు యుద్ధమునకు భయ

పడి విచారింపలేదు. ఉదయాదిత్యునితో వియ్య మంద వలయు నను నుత్సాహముతో నున్న తనకు జయంతిచంద్రునితో కయ్య మందవలసి వచ్చె నని చింతించెను. దాని విషయమై మంత్రులతో నాలోచించి యుద్ధమున జయమో, పరాజయమో నిశ్చయమైనపిదపఁ గూఁతు వివాహ మహోత్సవము గావింపవచ్చు ననియు నుదయాదిత్యుండును దనకు సాహాయ్య మొనరించుఁ గావున విజయమే చేకూర వచ్చు ననియుఁ దలంచి యుద్ధప్రయత్నమే చేయుచుండెను. ఈ యుదంతము నుదయాదిత్యునకుఁ దన కుమారుఁడు విజయసింహునిచేఁ దెలియఁజేసెను. ఇందఱును యుద్ధమునకు సంసిద్ధులై యుండిరి.

మఱునాఁడు తెల్లవాఱునదికి జయంతచంద్రుఁడు పారావారము వలె పొంగి పొరలి వచ్చు తన చతురంగ సైన్యముతో వీరనాగరమును ముట్టడించి, గంభీరునకు తన క్రొత్త మంత్రికుమారుం డగు సదానందభట్టుచే నిట్లని రాయబార మంపెను. "నాలుగైదు తరములనుండియు మనకున్న వైరము జగత్ప్రసిద్ధమే. దీనిని నేఁటితో సమాప్తి నొందించుకొనవలయు నను నుద్దేశము కలిగి వచ్చితిని. నీ యనుంగు తనయ యగు సీతాబాయి సౌందర్య నిధాన యనియు నామెను నుదయాదిత్యుని కుమారున కిచ్చి పెండ్లి గావింప నుంటి వనియు వినియున్నాను. ఆ సంబంధమును విడిచి నీ కూఁతును నా కొసంగితి వేని మన వైరము నేఁటితో నంత మొందును. ఉదయాదిత్యుని భయము నీ కావంతయును వలదు. మన మిరువురమును గలసితి మేని వాని నొక్క నిముసమున జయింపవచ్చును. ఈ రాయబారమును నీ

వంగీకరింపవేని యుద్ధమునకు సంసిద్ధుండ వై యుండ వలసినదే.''

సదానందభట్టు నోటినుండి యీ రాయబారపు మాటలు విని యంతనే గంభీరసింహుండు మండిపడెను. యుద్ధమునకే సిద్ధుండ నయియుంటి నని ప్రత్యుత్తర మిచ్చి భట్టురాజువారి నంపివేసెను. మఱి యేమి యున్నది? ఆ మాటలు విని జయంతచంద్రుండు కోపోద్దీపితుం డయి వీరనాగరమును ముట్టడించి కోటకు లగ్గలు పట్టెను. అంతకు ముందే సిద్ధమయియున్న గంభీరసింహుని సేనలు వైరిసేనలను దలపడి మహాధైర్యముతో పోరం దొడంగెను. ఈ సంగతి సంతయును విని యుదయాదిత్యుండు తన కుమారు లిరువురితోం గూడి జయంతచంద్రుని సేనల మీందికిం దన సైన్యమును డీకొలిపెను. అప్పటి సంగ్రామ మతి ఘోరం బయ్యెను. ఇరు వీడులకు సమముం జిక్కుకొన్నను జయంతచంద్రుని సేనలు చూపు పరాక్రమము వర్ణింపం దరముకా కుండెను. ఆతని సేనాధ్యక్షుం డరిభీకరసింహుం డత్యుగ్రుండు. సమరాంగణమ్మున నతని నెదిరించు వీరుండు బ్రతికిపోవుట యరుదు. ఆతని పరాక్రమమును నమ్ముకొనియే జయంతచంద్రుం డిట్టి సంగ్రామమునకుం దలకొనియెను. నిజముగ నరిభీకరుం డరిభీకరుండే యనునట్టు లతండు తన మూల బల మైదువేల యాశ్వికులతోం జెలరేగి వీరనాగర సైన్యముల నడలం గొట్టెను. గంభీరసింహుండును బోటరులలో మేటియై కాని వయసు మళ్లినవాం డగుటచే నతని కోల్తలను భరింపలేకుండెను. అతని తనయుండు విజయసింహుం డత్యుగ్రుం డై యరిభీకరునిపై గుఱికెను. వా రిరువురును సమానవయో

బల సంపన్ను లగుటచే నిలుకడయక పోవుచుండిరి. గంభీర సింహుండును తన సైన్యముల బురికొల్పి కుమారునకు బాసట యై పరాక్రమించుచుండెను. వీరియుద్ధ మింతలోఁ బెనుబలు వల్లరుల పొడఁగట్టెను.

అటు జయంతచంద్రుండును తమ బలముపైఁ బడ వచ్చు నుదయాదిత్యుని నాఁపి నిలువరించి దిట్టరి యై పట్టు విడువక కడంకతో ఘోరముగా బోరుచుండెను. ఉదయా దిత్యుండును బ్రళయాదిత్యుని వలె నత్యుగ్రుఁడై జయంత చంద్రుని సైన్యమును జెల్లా చెదరుగఁ బరువెత్తించు చుండెను. పాఱిపోవుచున్న తన బలముల నిలువరించి జయంతచంద్రుం డుదయాదిత్యు నెదుర్కొని సరా సరిగ రణం బొనరించెను. రెండు వేల మదగజములతో సదా నంద భట్టు జయంత చంద్రునకు బాసటయై యుదయా దిత్యుని సైన్యములను వెనుకకుఁ దఱిమెను. పాఱిపోవు చున్న తమ సైన్యములను, నొంటరి యై యతి కష్టముగఁ బోరుచున్న తమ తండ్రిని దిలకించి రణధవళుఁడును, జగ దేవుఁడును నగ్నియు, వాయువునుం బలెఁ జెలరేగి భట్టుగారి వారి బలములను మారి మసంగినట్లు నశింపఁ జేయ నాగిరి. వా రిరువురిని దేఱి చూచుట కెరికిని శక్యము కాకుండెను. భట్టుగారును భయంకరోగ్ర మూర్తియై యీ యిరువురు సోదరులతో సమానముగా యుద్ధము సేయుచుండెను. రణధవళుం డాతని యౌద్ధత్యమును సహింపలేక యీటెతో నాతని మదగజమును బొడిచెను. ఇంతలో భట్టు గజేంద్రము నుండి లంఘించి ఖడ్గ మెత్తి రణధవళుని గుఱ్ఱమును నఱ కెను. అతఁడును దురంగము నుండి లంఘించెను. ఇరువురును

కరవాలముల ధరించి డీకొని పోరుచుండిరి. భట్టుగారి సైన్యములు పైఁ బడుచుండ జగదేవుఁడు వానిని నిలువరించెను. ఈ సంగతి తెలిసి జయంత చంద్రుఁడు తఱుముకొని రా నుదయాదిత్యుం డాతని నాఁపెను. భట్టాజియును రణధవళుఁడును గొంత తడ వహ మహమికతోఁ బోరిరి. ఇరువురి ఖడ్గములు ముత్తునియ లైనవి. జగదేవుఁడు వారిని వారించి విడఁదీసెను. భట్టు తిరిగి తన సైన్యములోనికి వచ్చెను. రణధవళుండును మఱి యొక యశ్వము నెక్కెను. జగదేవుండు తమ సైన్యముతో జయంత చంద్రునిపైఁ బడెను. ఆతని వెన్నంటియే రణధవళుండును దఱిమెను. ఉదయాదిత్యుండు తన పుత్త్రుల శౌర్య ధైర్యములఁ జూచుచుఁ బోరుచుండెను. ఇరువురును దండ్రిగారి నతిక్రమించి జయంతచంద్రుని బలమును బటాపంచలుగాఁ బరువెత్తించిరి. ఇంతలో భట్టాజీ యొక యుత్తమాశ్వము నధిరోహించి యా యన్నదమ్ములను డీకొనెను. యుద్ధ మెప్పటికిని ముగియకుండెను. భాస్కరుం డస్తాచలమున కేగెను. ఉదయము నుండియు నతి ఘోరముగాఁ బెనంగిన బలములెంతయు నలసిపోయినవి. అది చూచి యిరు వీడులవారును యుద్ధాంతమును సూచించు జెండాల నెత్తిరి. ఎవరి శిబిరములకు వా రేగిరి.

మఱునాఁడు తెల్లవాఱెను. ఉదయ శైలో పరిభాగమ్మున నాదిత్యదేవుం డెంతయు రమ్యముగాఁ బ్రకాశించుచుండెను. వీరు లెల్ల రుల్లాసమ్మున నాహ్నికమ్ములను దీర్చుకొని మరల యుద్ధమునకుఁ గడంగిరి. ఆ నాఁటి సమరము దేవాసుర సమరమే. వొమ్మి యుద్ధములోఁ బ్రధాన యోధు

లందఱును జేరిరి. ఉదయాదిత్యుఁడు జయంత చంద్రుని. జగదేవుఁ డరిభీకరుని, రణధవళుఁడు సదానంద భట్టును దల పడిరి. గంభీర సింహుఁడు నతని కుమారుఁడు విజయ సింహుఁడు నరి బలమును నుగ్గాడుచుండిరి. రెండు జాముల వేళయయ్యెను. పరిణామము తేలలేదు. రక్తపు టేఱులు ప్రవహించుచుండెను. ఉగ్రము లగు వీరుల సింహనాదముల తోడను, మద కలభంబుల ఘీంకార ధ్వనులతోడను, హయ రాజంబుల హ్రేషా ధ్వనులతోడను. యోధుల కుత్సాహ మును రెట్టింపఁ జేయు తూర్యనాదంబులు గలిసి మిన్నుముట్టు చుండెను. కాళ్లు, చేతులు, మొండెములు. తుండెములు తెగి పడుచుండెను. మాంసము. మేదస్సు, ఎముకలు క్రొవ్వు, రక్తముతోఁ గలిసి చూచువారికి హృదయముల నగల్చుచుండెను. ఇట్టి తరుణమ్మునఁ జిన్నపోవుచున్న కాశీ నగరాధిపుని సైన్యములకు బాసటయై యిరువురు యోధులు కలిసిరి. వా రతి రయమ్మున వచ్చి తమ వారిం గలిసికొని సేనా ముఖమున కరిగిరి. అరిభీకరునకును జగ దేవునకును జరుగు యుద్ధము వారి కన్నులఁ బడెను. వా రొడలు మఱచి జగదేవునిపైఁ బడిరి. జగదేవుఁ డొక్కఁ డయ్యెనని గంభీరసింహుండు తన కుమారునితోఁ గూడి వారి నదలించి నిలువరింప నం దొక్కఁడా గౌడ రాజ యువరాజుల కాఁగి నిలిచెను. రెండవ వాఁడు ఖడ్గము నెత్తి జగదేవునిపై కుఱికెను. అరిభీకరుండు మడిసె మడిసె నను సమయంబున కిట్టు లకస్మాత్తుగా వచ్చి జగదేవుని దక్షిణ హస్తమునకు గుఱి వెట్టి ఖడ్గము నతఁడు విసరఁ బోవ నంతలో రివ్వు మను శబ్దముతో నొక బాణము వచ్చి యా

పెరుసి బాహు మూలమ్మునం దగిలెను. అతని ఖడ్గము క్రిందఁ బడియెను. ఉస్సురని యతఁడు రోఁజుచు వెనుకకుఁ దిరుగు నంతలో నరిభీకరుని శిర మ్మెగిరి పోయెను. "జయ జగదేవా!" అను జయ జయ శబ్దమ్ము లుదయాదిత్యుని బలమ్మునుండి వినవచ్చెను. ధారానగర మూల బలమ్ము జగదేవుని జయమును జూచి యుత్సాహమ్మునఁ బెల్లు రేఁగి జయంత చంద్రుని బలమ్ముల నుగ్గాడుచు లోనికిఁ దఱుము కొని పోయెను. తన్ను నఱుక వచ్చిన వాని ఖడ్గము క్రిందఁ బడుట కచ్చెరు వొంది జగదేవుఁ డరిభీకరుని వధియించిన పిదప నెవరు తన కిట్టి యుపకారము గావించిరో యని వెను దిరిగి చూచెను. ఎవరో తెలియక పోయెను. చెల్లా చెదరయి జయంత చంద్రుని బలంగము పరువిడఁ జొచ్చెను. సాయాహ్న మయ్యెను. నాఁటికిని బరిణామము తెలియకయే యుద్ధము నిలుపుచేయఁ బడెను.

ఆ మఱునాటి దినము తెల్లవాఱ నంతనే యుభయ బలంబులును మరల డీకొనెను. సేనాధ్యక్షుండు పోయె నని జయంత చంద్రుఁడు మిక్కిలి దుఃఖించెను; ఈ నాఁ డెట్టు లయిన జగదేవుని సంహరింపక విడువరాదని దీక్షచేసి యోధుల కందఱకును దెలియఁ జేసెను. తొలినాఁటి బాణాహతుండును నతని చెలికాఁడును 'మే మీ దినమున మా సేనానిం జంపిన వైరి ఘాతకునిం బరిమార్పక మరలి రా' మని యాయుధమును ముట్టి ప్రమాణమును గావించుకొని బయలుదేఱిరి. ఆ నాఁ డా సైనికుల దృష్టు లన్నియు నొక్క జగదేవునియందే యున్నవి. యుద్ధము ప్రారంభ మయ్యెను. ఆ నాఁడు గూడ జగదేవుని ప్రతాపము దుర్నిరీక్ష్య మయ్యెను.

అతని కుభయ పార్శ్వమ్ముల యందు నుదయాదిత్యుఁడును రణధవళుఁడును నిలిచి యత్యుగ్రముగాఁ బోరుచుండిరి. ఆ సమయమున ముందటి కేఁగుచున్న యోధుఁడు ప్రక్కకొదిగి తన మిత్రునికిని జగదేవునికిని యుద్ధ మగుచుండ నకస్మాత్తుగాఁ జగదేవుని పైఁ బడ నుంకించెను. దైవ విలాస మెట్టిదో కాని యాతని ప్రక్కలో వెనుకనుండి యెవరో గాఢముగ హృదయములోనికిఁ జొచ్చునట్లు లోక బల్లెముతోఁ బొడిచిరి. 'హా హా! హతోస్మి' యని వాఁడు నేల కొఱిగెను. రెండవ మాఱును దన్నెవ్వరో రక్షించిరని తెలిసికొనియు నెదురుగ యుద్ధము చేయువారికడ నేమఱి యుండరా దని తలంచి జగదేవుఁడు జోరుగా వానితో సమరము చేయుచు 'నా ప్రాణదాతకుఁ గృతజ్ఞుఁడ' నని పలికి యా యులుకునఁ దన శత్రువును మూర్ఛఁ గొట్టెను. వారిపువును మూర్ఛపడిన తరువాత జగదేవు నెదిరింప నెవ్వరును సాహసింపలేకపోయిరి. అచ్చటికిఁ గొంతదూరమున భట్టూజీ రణధవళునితోఁ డీకొని పోరుచుండెను. ఉదయాదిత్యుఁ డా దిక్కుననే యుండెను. ఈ తరుణమ్మును జూచి జయంతచంద్రుండు భరింపలేక జగదేవునిం జంపెద నని కన్నుల నిప్పులు రాల నరుదెంచెను. జగదేవుఁడు దన కిరుప్రక్కల నిరువు రాశ్వికులు కవచధారులై సాహాయ్య మొనరించుటను గాంచి వా రెవ్వరో తెలిసికొనలేక పోయెను. వారు చేయుయుద్ధ మసాధారణముగ నున్నది. ఆ రెండు వ్యక్తులే రెండుసారు లాతని ప్రాణమ్ములు గాపాడియుందురని యాతఁ డనుకొనెను. ఆ మువ్వురి నెదురుకొన్న జయంతచంద్రుని పని యే మగునో యని సేనలు తల్లడిల్లు

చుండెను. పాపము భట్టుగా రది చూచి రాజుగారిని రక్షింప వలయు నని తలంచి రణధవళుని మూర్ఛకొట్టి తెలివిచేసి కొనివచ్చుచుండ నుదయాదిత్యుఁ డాతని నదలించి పిలిచి మాఱ్కొని కదలనీయక నిలువరించెను.

మూర్ఛ నొందిన యిరువురి యోధులలో నొకఁడు ప్రాణమాత్రావశిష్టుఁ డయ్యె. వానిని శిబిరమునకుఁ గొంపోయిరి. రెండవ వాఁడు మూర్ఛ దెలిసి చూచుసరికి జయంత చంద్రుఁడు మువ్వురు వీరుల మధ్య నుండెను. పాప మతఁ డతివేగముగ నొక తురంగము నెక్కివచ్చి రాజున కడ్డు పడెను. ఇంతలో నొక వ్యక్తి మరల నొక బాణము నాతని కంఠముమీఁద గురిచేసి కొట్టెను. నెత్తురు పొప్పఁబోఁగ నాతనికన్నులఁ జీఁకట్లు క్రమ్మెను. జగదేవుఁడు జయంతి చంద్రునితోఁ బోరాడి పోరాడి తుదకతని ఖడ్గమును తుత్తునియలుగఁ జేసెను. జయంతుని కెందఱో బాసట యగుటకు వచ్చుచుండిరి; కాని రెండవ కవచధారి, వారి నందఱ నతి శీఘ్రకాలమున నంతకాతిథులుగాఁ జేయుచుండెను. జయంతిచంద్రుఁడు నిరాయుధుఁడై నిలువంబడెను. జగదేవుఁడాతనిం బట్టుకొనియెను. తక్కినవా రందఱును గలసి యాతనిం గట్టివేసిరి. భట్టుగారు రాజపరాభవమునుజూచి తాను నాయుధమును విసర్జించి నిలువంబడెను. బ్రాహ్మణుం డగుటచే నాతని నెవ్వరు నేమియుఁ జేయరైరి. తక్కిన వారణాసీ నగర సైన్యములు తిరిగిచూడక పలాయితము లయ్యెను. జయంతచంద్రుని. భట్టూజీవారిని, మూర్ఛిల్లిన యోధుల నిరువురి నొకచోఁ జేర్చి, యుదయాదిత్య సార్వభౌమునికడకుం దెప్పించి సమర్పించి జగదేవుఁడు పాదాభి

వందన మొనరించి నిలిచెను. కొడుకు నాలింగన మొనర్చుకొని యుదయాదిత్యుఁ డెంతయు నాతని పరాక్రమమునకు సంతసించి యాశీర్వదించెను. రణరంగమునఁ దన ప్రాణములను రెండు సారులు కాపాడి జయమును గూర్చినవారిని సన్మానింపవలయు నని జగదేవుఁ డెంత ప్రయత్నించినను వారు కానరాక పోయిరి. అందున కెంతయు నాతఁడు విచారించుచుండెను. మఱునాఁ డాకవచధారులలో నొక వ్యక్తి వీరమతియే యని యామె చెలికత్తెవలనఁ దెలియవచ్చెను; కాని రెండవవ్యక్తి యెవరో వీరమతికిని దెలియదఁట. ఇంక నెవరి కేమి తెలియును? జగదేవుని పరాక్రమమును గన్నవారఁ గాంచి గంభీరసింహుం డతనిం జేరఁబిలిచి తన తనయను బరిణయమాడు మని బోధించెను; కాని తా నేకపత్నీవ్రతస్థుఁడ నని జగదేవుఁడు చెప్పుటచే నతఁడు రణధవళునికే తనకూఁతు నొసంగ వలసినవాఁ డయ్యెను. సపరివారముగ జయంతచంద్రుని విడిచి పుచ్చి యా నగరమ్మునఁ గొన్ని దినమ్ము లుండి సీతాబాయికిని రణధవళునికిని వివాహము గావించి యుదయాదిత్య సార్వభౌముండు మహానందమొందెను; అందఱితోఁ గలిసి ధారా నగరమునకరిగెను.

---

## ఏకాదశోల్లాసము

# పుల్లవిఱుపుమాటలు

హయము నతిత్వరిత గతిని బరువెత్తించుకొని యొక రౌతు కాననాంతరమునుండి వచ్చుచున్నవాఁడు. ఇను

గంటలు కొట్టువేళ యయినది. ఆతఁ డేలకో చిన్నవోయిన తెఱంగున నున్నవాఁడు. ముఖము కళాహీన మయి యున్నది. గుఱ్ఱమును బరువెత్తించుచున్నాఁడు; కాని యాతఁ డది పోయిన మార్గముననే విడుచు చున్నవాఁడు. ఏమి యాలోచించుచున్నవాఁడో తెలియదు; కాని యిట్టుల హుటాహుటిగ నన్నపానముల నిచ్ఛగింపక చెమటచే నొప్పుఁదోఁగినను గణింపక పోవుచుండుటచే నాతని మనస్సునకు నొప్పి తగిలిన దని స్పష్ట మగుచుండెను. ఎద్దియే నొక పట్టుదలఁ బూని యిటు లొంటరిగ వచ్చుచుండె నని హావభావజ్ఞు లూహింపవచ్చును. ఇంద్రియములకు వశుఁడయిన వాని నవి యెట్టులు స్వేచ్ఛగాఁ దీసికొనిపోవుచుండునో. యా హయంబును నా రౌతు నా విధముగానే కొంపోవు చుండెను; కాని యది రాజమార్గమును దప్పింపలేదు. ఆ మార్గమున నది యా వఱకు నడిచి యున్నట్టులు పొడకట్టు చున్నది. జవసత్త్వములలో నిసుమంతయుఁ గొఱఁత యను నది యెఱుంగని యా యశ్వరత్న మా రౌతు నొక యుద్యానమునకుఁ దీసికొనిపోయి వాఁకిట నిలిచెను. పుష్ప సుగంధములతోఁ జల్లని సమీర పోత మలసి వచ్చిన యా బాటసారికి స్వాగత మిచ్చి లోని కాహ్వానించెను. కొంచెము విశ్రాంతి దీర్చుకొన వలయు నని యాతని కొక యూహ జనించెను. అశ్వము నవరోహించి స్వేదార్ద్రమగు ముఖ కమలమును దుడుచుకొని యాతఁ డా తోఁటలోనికి మెల్ల మెల్ల నరుగు చుండెను. ఆతని వెను వెంట నా తురంగ రాజమును దోఁటలోని కరుగు చుండెను. తోఁట కాఁపా రౌతును జూచి యాతని తేజముచే ధర్షింపఁ బడెనో, లేక

మఱి యేమనుకొనెనో కాని నాలి మ్రొక్క ప్రక్కకుఁ వాలఁగి పోయెను. ఏమి యాలోచించుచుండెనో కాని యా ఘాటసారి, తోఁట శృంగారమును జూడలేదు; కాఁపు వానిం జూడలేదు, తల వంచుకొనియే యొక రసాలము చెంత కేఁగి, యచట చలువరాతిన్నెపైఁ గూర్చుండి యున్న వని కొంచెము ప్రక్క కొరిగెను. ఆ యువుఁడు ప్రక్క చేరవైచుటయే తడవుగఁ బ్రపంచమును మఱచి నిద్రకు లోనయ్యెను. చల్లని పిల్లగాలు లాతని మొడలి కనిర్వాచ్యానందమును గలిగించెను. పలు రకంబు లగు పతత్త్రి సంతానము లాతనికి జోలలు పాడుచుండెను. ఆతఁడు హాయిగా నిదురించుచుండెను; సంజ వేళఁ బండుకొనఁ గూడ దను మాటయు మఱచెను.

ఆ తోఁటకు నడుమను మంచి సౌధ మొకటి కలదు. గుఱ్ఱపు షికారు తిరిగి వచ్చి యిరువురు విశ్రాంతికై యా సౌధమునకు వచ్చియుండిరి. ఆ ప్రాసాదమునకు మూఁడంతరువులు కలవు. ఆ వచ్చిన వారు మూఁడవ భూమిక కేఁగి యా మీఁదను జల్లగాలి కిటు నటుఁ బచారు చేయుచుండిరి. నాఁడు శరత్పూర్ణిమ. నలు దిక్కులనుండి సుగంధములగు చల్లని సమీర పోతమ్ములు పగటి వేఁడిమిని జుట్టి, మట్టు పెట్టి, మాయము గావించినవి. ఒకచో సంపెఁగ పూవులు. ఇంకొకచో గులాబి పూవులు. ఇంకొకచోఁ జమేలీ పూవులు. ఇంకొక యెడ జాజి పూవులు. కొండొక యెడ మొగిలి పూవులు. మఱొక్క యెడ నాగలింగము పూవులు నున్నగు నవి యుద్యానమునం దెల్లెడల సుగంధమును వెదజల్లుచున్నవి. శకుంత సంతానము లెంతయు

సంతసమ్మున సంజ గీతమ్ములను పాడుచున్నవి. దిన మంతయు లోక యాత్ర చేసి యలసి మెల మెల్లన నస్తాచల శౌఢోపరిభాగమ్మున కరుగుచున్న సూర్యభగవానుని ముది కిరణములు తరు లతా సంతానముల పచ్చని యాకుల మీఁదను జిత్ర చిత్రము లగు కుసుమముల మీఁదను బ్రసరించి ప్రకృతికి మంచి శోభ నొసంగుచున్నవి. అట్టి యానందకర మగు ప్రకృతిని జూడ నిచ్చగించినచో నెట్టి దుఃఖియును దన దుఃఖమును మఱచి యుండక తీరదు. షికారు తిరుగుచున్న మన వీరులును దత్సమయ శోభ కానందించియు నెద్ది యేనిం దలంచుకొని కొంచె మాలోచనకు లోనయిరి. ఎవరి మనస్సులో వారే యేదియో యోచించుకొనుచుండిరి.

ఆహా! నిజముగ నిద్దురవంటి యవస్థ యింకొకటి లేదు గదా! వికలతఁ జెందిన జీవ ప్రకృతుల బుద్ధిని నిర్మలముగాఁ జేయుట కింతకంటెఁ బరమౌషధ మిం కెద్ది గలదు? ఎట్టి వ్యవహారపుఁ జిక్కు లున్నను నెట్టి కష్టములకు మనస్సులోనైనను నిద్దుర పట్టినచో నవి యెల్ల నిమిషములో మాయ మగును. అనంత సుఖప్రద మైనదే. కాని యది జీవుల మాయువున మూఁడవ వంతు తన యధీనమున నుంచుకొని యంతరింపఁ జేయుచున్నది.

మన గుఱ్ఱపు రౌ తచ్చటఁ బండికొని యుండెను గదా! అతఁ డొడలు మఱచి నిదురించుచుండెను. సూర్యభగవానుం డస్తాచలము మాటున కరిగెను. సంజ మీఱెను. అంతలో నై దాఱుగురు గుఱ్ఱపు సవారు లుద్యాన వనముం బ్రవేశించి గుఱ్ఱముల నుండి దిగిరి. రసాల పాదపము క్రింది

...న్నికై శయనించి మేను మఱచి యున్న మా రాజకొమరు
నిపై నలుగురు కాళ్లు చేతులు బంధించిరి. తెలివి వచ్చి
[illegible] మనుచుండఁగనే వినిపించు కొనక నలుగురు
మోపుగ నాతని మోసికొని పోవుచుండిరి. తక్కిన యిరు
[illegible] మన తురంగములను గొనికొని పోవుచుండిరి.
మొదటనే పోటుకాపువాఁడు పసిగట్టికొని పోయి యప్పటికి
పైనున్న యొకవ్యక్తికి కేమియో రహస్యముగఁ దెలిపి
చెప్పెను. ఆ వ్యక్తియు నులికిపడి "మిత్రవరా! రమ్ము:
ఇంక మన మిచ్చట నుండఁగూడదు" అని బయలువెడ
లుచుఁ బోటుకాపువానితో నేదియో మెల్లగాఁ జెప్పెను.
వాఁడును "చిత్తము" అని మెట్లు దిగి యతి త్వరితగతిం
బరుగెత్తి రసాలముకడకు వచ్చెను. నిదురించుచున్న
మాతనిఁ గట్టి మోసికొని పోవుచున్న యా తుంటరులను
గాంచి వెనుకకు మరలి పరుగెత్తికొని వచ్చి యప్పుడే తుర
గారూఢులై వచ్చుచున్నవారితో నీ సంగతిని జెప్పెను.
"నీవు నీ పనిమీఁదఁ బొమ్ము" అని కాపరిం బంపి తురంగ
ముల నతి శీఘ్రముగఁ బరుగెత్తించుచు వచ్చి వా రా దృశ్య
మును దిలకించి తుంటరుల నదలించి నిలువరించిరి. అప్పు
డా నలువురును గట్లతో నున్న రాజపుత్రుని డించి కత్తులు
దూసి యా వీర ద్వయము నెదిరించిరి. వీరలు సామాన్యులు
కారు. నిముసములో నా నలువురిలో నిద్దరను భూమికి
బలి యిచ్చిరి. ఇంతలో గుఱ్ఱములను గొలుకొని వచ్చుచున్న
వా రిద్దఱును జేరి తుంటరులు నలువురై మరల నా వీర
ద్వయముతోఁ దలపడిరి. నిముసములో మన వీరు లా తుంట
రులలో మఱి యిద్దఱను నఱకఁగా వారి పరాక్రమమును

జూచి భయపడి తుచ్ఛు లగు నా నరహంతకులు బ్రతుకు జీవుఁడాయని గుఱ్ఱముల నుఱాయించి, పలాయితు లయిరి.

తరువాత వా రిరువురును రాజపుత్రుని కడకు వచ్చి చూచి యచ్చెరు వంది యాతని కట్టులను విప్పివేసిరి. అతఁడు సిగ్గునఁ దలవంచుకొని 'నా ప్రాణదాత లగు మి మ్మెవరా లు లాడి సత్కరింపవలయునో కే నెఱుంగకున్నాఁ డను. చేతులు జోడించి మనఃపూర్వకముగా నమస్కరించుటకంటె నేఁ జేయఁగల ప్రత్యుపకార మేమి గలదు?' అని వినయముతో హస్తముల జోడించెను. "స్వామీ! ఈ జనము మీ పాద సేవ యొనరించి జీవింప వలసిన దగుటచే మీరు చేతులు జోడింపఁ దగదు. తా మనుగ్రహించి మన గృహమ్మున కరుదెంచు. మీ రిట్లొంటరిగా వచ్చుట కేమి హేతువో తెలియ నేరకున్నాను. ఈ దుష్టు లెవ్వరు? ఈ నీచులు మి మ్మెట్టులు కట్టఁ గలిగిరి? ఇట్లు కట్టుటకుం గారణ మేమి?" అని యమృత ధార లొలుకునట్లు మిక్కిలి యడఁకువతో నడుగుచున్నవా రెవరో యతఁడు గుఱుతింప నేఱక "మీ మాటలు నా కర్థము కాలేదు. మీ రెవ్వరు? ఇది యే యూరు? నా కేమియుఁ బ్రాపంచిక జ్ఞాన మిప్పుడు లేదు. కావున దయ యుంచి యీసమాచారమును చెప్పుఁడు" అని రాజపుత్రుఁ డనెను. "ఇది మీ యత్త వారి యూరు, టుకటోడా. ఈ జనము మీ పరిజనము" అని మొదటి వ్యక్తి యన రెండవ వ్యక్తి "ఆర్యా! ఇంక దాఁప నేల? ఈ వేషములతోనున్న మే మబలలము ఈమె మీ చరణ దాస్యమున ధన్యురా లయిన వీరమతీదేవి; మీ ప్రేయసి. నే నామె చెలిని" అని పలికెను. జగదేవుఁ

ఆశ్చర్య మగ్న మానసుం డయ్యెను. తన ప్రియురాలిని కౌఁగిలించుకొని, "నాఁడు యుద్ధములోను, నేఁడీచోటను నా ప్రాణములు కాపాడితివి. అయ్యారే! నీవు నా జీవితేశ్వరి వగుటచే నని నే నెంతయును గర్వించుచుంటిని. సవతి తల్లి కఠిన వాక్యములచే నొచ్చి యిలు బయలు వెడలితిని. నా యశ్వమును విచ్చలవిడిగ విడువ నది యీ యెడారికిం గొని వచ్చెను. మనసు నొచ్చి యుండుటచేతను. హృదయమునుండి యన్నపానములమాటఁ దలంపక హాహాకారిగాఁ బయనమయి వచ్చుటచేతను నలసి కలఁతఁ జెంది యీ రసాల వేదికపైఁ బరుండి నిద్రించితిని. వీరు మా సవతి తల్లి ప్రేరణచే నన్నుఁ జంప వలయు నని వెన్నంటి వచ్చుచున్న వారు కావలయును. నిద్రించుచున్న నాపైఁ బలువు రొక్కుమ్మడిగఁ బడి కట్టి కొంపోవుటచే నే నేమియుఁ జేయ లేక పోయితిని. 'దిక్కు లేని వారలకు దేవుఁడే దిక్కు' అను నట్లు లా వేళకు మీ రిచ్చటికి వచ్చుట తటస్థించినది" అని జగదేవుఁడు తన యుదంతము నెఱింగించి తన యశ్వమును బిలిచెను. అదియును నాతని మాట విని పరువెత్తి వచ్చెను. చంద్రోదయ మయ్యెను. వారు మువ్వురును హయమ్ముల నధిరోహించి పుర మార్గమ్మున వచ్చుచుండిరి. "ప్రేయసీ! నాఁడు నీతోఁ గూడ యుద్ధములో నా ప్రాణములను గాపాడిన వీరుఁ డెవరో తెలిసెనా? ఆయన నిరంతరమును నా హృదయమునసే నివసించుచున్నవాఁడు సుమీ!" అని యతఁ డన "లేదు; ఆయన సంగతి యేమియును దెలియ లేదు" అని వీరమతి బదులు చెప్పెను. అందఱును గోట కరిగిరి.

---

## ద్వాదశోల్లాసము

## శరపరంపర

ఆ రాత్రి విరహ పరానందముతో వీర దంపతులగు వీరమతీ జగదేవులు హాయిగ విహరించిరి. తెల్లవారు జామున లేచి యింతకు ముందే లేచి తనకుఁ బరిచర్యఁ జేయ సన్నాహపడు వీరమతిని బిలిచి "బాలికా! నేనీ దినమున బయలుదేఱి దేశాంతరమున కేగవలయు నని యుంటిని. మరల మనము కలిసికొనుటకుఁ గొన్ని దినములు పట్టును. నీవు మాఱు పలుకక నా ప్రయాణమున కనుమతింప వలయును" అని జగదేవుం డనెను.

వీర: స్వామీ! ఏ మాలాగున సెలవిచ్చుచున్నారలు? ఇన్ని దినములు మీ పాదసేవ దొరకక నే నెంత దురపిల్లితినో పరమేశ్వరునికే యెఱుక. నా నోములు ఫలించి మీ సేవసేయు భాగ్యము లభించె నని నే నుప్పొంగుచుంటిని. తా మిట్టులు పలుక నే నేమి సేయుదును? వచ్చిన దాక యడుగు, రాని దాక యడుగు, ప్రయాణపు టలజడి యైనం దీఱ లేదు. అదియును గాక యిప్పుడు దేశాంతరమున కేగవలసిన యవసర మేమి వచ్చెను? ఒకవేళ నిజముగ వెళ్ల వలయు నన్న రెండు మూఁడు దినము లయిన నిచ్చట నుండి శ్రమ తీర్చుకొని నన్నుఁ గూడ వెంటఁ బెట్టుకొని మీ యిష్టము వచ్చిన చోటికిఁ బయనము

కావచ్చును. ఏమన్న విడిచి నే నొక్కచో నిలు నొక నిముస మైన నింక నిలువ లేను.

జగ: ప్రియమిత్రా! నీ మనో నిశ్చయము నే నెఱుంగుదును; కాని నే నిప్పుడు మఱి యొక దేశమున కరుగక తీఱదు. ప్రస్తుతము నా వెంటవచ్చితి వేని యన్నియో నిడుములు పడవలసి వచ్చును.

వీర: నే నెక్కువ చనవు తీసికొనుచున్నందులకు మన్నింపుఁడు. ఇప్పుడు మీకు దేశాంతరమున కేల పోవలయునో చెప్పెదరా?

జగ: మా తండ్రిగారి రాజ్యమున నే నొక నిముసమైన నిలుచుటకు వీలులేని యవస్థ సంభవించినది.

వీర: అది యేదియో నే వినవచ్చునా?

జగ: విన నా కేమి? ఎఱుఁగుదువు గదా మా సవతి తల్లి వాఘేలా దేవిని? ఆమె పట్టంపు దేవి యయి యుండఁగ మా తండ్రిగారు మా యంబను బరిణయ మైరి. అప్పటి నుండియుఁ బట్టంపు రాణి మా తల్లి మీఁద నసూయఁ గలిగి యుండి నే నుదయించినంత నామె మఱి భరింపలేక జోస్యులకుఁ దగిన ద్రవ్య మిచ్చి నా జాతకము ననర్థవంతముగఁ దయారు చేయించి వెంటనే యీ సతీ సుతులను విడువ కుండినఁ గుల నాశన మగు నని రాజు ప్రోలఁ జెప్పించెను. తండ్రిగారు నామె మాటలను జోస్యుల మాటలను విశ్వసించి కన్నులు వీడని కసికందు నగు నన్నును, మా యంబను, మా మాతామహు

నింటికిఁ బంపించివేసిరి. అప్పటినుండి పది వత్సరములవఱకు మా తాతగారి యూరిలో నుంటిమి. తరువాత ధారా నగరమునకు వచ్చి యొరు లెఱుంగకుండ దినములు గడపితిమి. మఱి కొన్నాళ్లకు నేను బరిశ్రమ పరీక్షలో మొదటి బహుమానము గైకొంటిని. మా రహస్యమును బెద్ద రాణి గ్రహించి రాజు నాకుఁ బద విచ్చినను, నన్నుఁ గోటకు రానీయకుండఁ జేసినది. తరువాత గౌడ దేశపు యుద్ధమున నన్నుఁ గన్నులారఁ జూచిన మా తండ్రిగా రామె మాటలను బాటిసేయక మాకుఁ దగిన వసతులనుఁ గూర్చిరి. అప్పటి నుండియు నేను రాజ సభ కేగుచు మా యన్న తోపాటు రాజ కార్యములను జూచుచున్నాఁడను. మా యన్నను గాదని నేను రాజ్యమాక్రమించు కొందు నని యామె తలంచుచున్నదఁట. మొన్నటి మధ్యాహ్నము మహలునకు రావలసిన దని మా నాన్నగారు కబు రంప నేఁ బోయితిని. భార్యా భర్త లిరువురు మాటలాడు కొను చుండిరి. నే నీవలనే నిలిచి యాలించితిని.

"చిన్నవాఁ డన్నింటను మేలు బంతి యగుచున్న వాఁడు. శౌర్య ధైర్య సాహస పరాక్ర మౌదార్యములు సార్వభౌమునందు వలె ననవద్యము లయి వాని యందు వెలయుచున్నది. నీవు వాని సంగతి నంతగా విచారింప కుంటివి" అని నాన్న గా రనిరి.

"ఏమి కలిగియున్న నేమి ప్రయోజనము! వానిజాతకము మంచిది కాదు. ఆయుర్దాయము కుఱుచ యని కూడ

వింటివి. కాదను కొందు. వాఁడు నా తనయు నాశ్రయించు కొని యెంత తినవలయునే కదా! ఇంతకును బ్రేమ యెచ్చట నెంతయో నుండిన నచ్చట నెట్టి దుర్గుణము లున్నను సుగుణ ములు గానే కానవచ్చును. వాని తల్లి సౌభాగ్య దేవత. వాని కెట్టులు సిరి చేరును? పెద్ద మంత్రి గారికిని వారియం దమిత మగు బ్రేమ యఁట. నా కెందుల కీ ప్రశంస" అని మా సవతి తల్లిగారు సెలవిచ్చిరి. "నేను నా యన్నను సేవించినఁ గాని బ్రతుకఁ జాలనటఁ! కానిమ్ము: చూచెదఁ గాక. దైవము మా పాల లేఁడా?" అని యాలోచించి మా యమ్మగారితో మాత్రము నా ప్రయాణము గుఱించి చెప్పి యీ తీరున బయలు దేఱితిని. మొదట నమ్మగారు వల దనిరి; కాని యభిమానము బాధించుటచే నామెకు నంగీకరింపక తీఱినది కాదు. నీవు నిప్పు డంగీకరింపక తీఱదు.

వీర: సరియే! ఇచ్చట మీ రుండుట కేమి యాక్షేపణము? మా తండ్రిగారు నా కొసంగిన జాగీరు మనకుఁ జాలదా? ఊరక మీ రేల శ్రమపడ వలయును?

జగ: నీ వనినట్టులు నే నిందు నిలిచితినేని జగదేవుని ప్రయోజకత్వ మింతియే యను వాదు మాత్రము రాకుండునా? నేను సొంతముగ నార్జించుకొనియే జీవింపవలయు నని నిశ్చయించు కొంటిని.

వీర: సరే: అలా గునయిన నన్ను మీ వెంటఁ దీసికొని పోవుట కే మాటంకము?

జగ: నే నరుగ నున్నది పర దేశము.

వీర: పండితునకుఁ బర దేశ మెందుఁ గలదు?

జగ: తోలు కొల్ల నెంతవాఁడును బెద్ద యుద్యోగమును సంపాదింపఁ జాలఁడు గదా!

వీర: పెద్ద యుద్యోగ మెందులకు?

జగ: నీ వెంత కన్నఁ గవి సుకుమారిణివి. నిన్నుఁ గష్ట పెట్టుట నా కిష్టము లేదు.

వీర: మీరు సార్వభౌముని కొమరులు. మీరు కష్టపడ వచ్చును గాని నేను బడ రాదా? అదియును గాక మీ చెంత నున్నప్పుడు నా కేదియు కష్ట మనిపింపదు. మిమ్ము విడిచి యుండుటే కష్టము.

జగ: నిజమే. కాని మన మిరువురమును లోకజ్ఞాన మెఱుంగని వారము; నిండు యౌవనంబున నున్నారము; లోకము కంటకావృతము; తప్పక ప్రమాదము వచ్చును: శ్రీరాముఁ డెన్ని చెప్పినను వినక. వెను వెంట నరుదెంచిన సీతా మహాదేవి పడిన కడగండ్లను దలంపుము. అట్టి మహనీయుల కే చిక్కులు తప్పినవి కావు. మన మెంత వారము? కావున నీ వింకఁ గొన్నాళ్లిచ్చటనే యుండుము.

వీర: మన మంత కసు గాయలము కాము. లోకము పోలి మన కేల? మనము జాగ్రత్తగా నున్నప్పుడు ప్రమాద మెట్టులు వచ్చును? రామునితో సీత యడవుల కరుగకున్న వారి చరిత్ర మిట్టి పవిత్రతమను ఖ్యాతి వచ్చియుండునా? వారు మహనీయు లను మాట నిజమే. కావుననే వారిని మన మను

సహింప వలయును. కష్టములకు జంకి మీరా రాజ పద్మ సేవ మాని యిచ్చోటనే నుండుదురా?

జగ: కొన్ని దినములు మాత్రమే మెట్టింటిలో నెమ్మదిగా యుండుము.

వీర: మీరు నన్ను విడిచి యరిగిన యుత్తర క్షణముననే, నా ప్రాణములును నన్ను విడిచి పోవుట నిజము. తరువాత నీ చిత్తము. నే నేమని మనవిచేయుదును? (అని కన్నుల నీరు నించెను.)

జగ: సరి లే. నీ వింతగా విచారింప నక్కఱ లేదు. నీ యిష్టము చొప్పున నొక దినము మాత్ర మిచ్చట నుండి మఱునాడు మన సిద్ధమును గలసికొని పోవుదము. అన్నిటికిని దైవము మీదనే భారము వేసి బయలు దేఱుదము. మన యదృష్ట మెట్టులు ఫలించునో చూచుకొందము.

అని యీ విధమున మాటలాడుకొని కాలకృత్యములు దీర్చుకొని యా దంపతు లా దిన మచ్చోట నాగిరి. అచ్చటనే యుండవలసిన దని రాజసింహుడును వాని భార్య శ్యామలాంబయును వీరసింహుండును వారి కెంతయో బోధించిరి. వారి పూనిక నెఱింగి ప్రయాణమునకు సమ్మతించిరి. వీరమతి తన యాభరణములను సౌకుమార్యమును నందే విడిచి చెలికత్తెల కెంతయో బోధించి వారి యనుమతి పొంది, విల్లు నమ్ములును నుత్తమ ఖడ్గమును మాత్రము ధరించి యశ్వము నధిరోహించి జగదేవుని వెంట వీరవిలాసినియై వెడలెను.

అశ్వారోహి యై శస్త్రాస్త్రధారి యై మహావీరుం డగు జగదేవుం డా కీర్తిని వీరాధిదేవత యగు తన యిల్లాలు వెంట రాఁ దెల్లవాఱుజామున నత్తవారి యూరు బయలు వెడలి విపిన మార్గమ్మునఁ జనుచుండెను. అతఁడు అణహిత పురమునకై పోవుచుండెను. కుకటేకోడానుండి యణహిత పురమున కరుగుటకు రెండు తెరువులు గలవు. అం దొకటి భయంకర మగు విపినములోనుండి పోవును. ఆ దారి నైదు దినములలో నణహిత పురము చేర నగును. ఆ విపినమునఁ గొన్ని సంవత్సరముల నుండియు రెండు పెద్ద పులులు కాపురంబుండి బాటసారులను నోట వేసి కొనుచుండుటచేత నా యడవి దారి నెవ్వరును బోవ వెఱతురు. ఆ యడవి యిరువది మైళ్లున్నది. రెండవ మార్గము పదునేను దినములకుఁ గాని యణహిత పురమును జేర్పఁ జాలదు. ఆ రెండు దారుల మొగకు మన వీర దంపతులు వచ్చునప్పటికి నాలు గైదు గడియల ప్రొద్దెక్కెను. ఆ సమీపమున నున్న పల్లెటూరి పసువుల కాపుపిల్లల "నిం దేదారి యణహిత పురమున కేగు?" నని జగదేవుం డడిగెను. మీఁద వివరించిన ప్రకారముగా నా గోపాల బాలకులు బదులు చెప్పిరి. "చెలీ! ఏ దారిని మన మేగు వారము?" అని జగదేవుం డన "దేనికిని బురోగాములు మీరు: మి మ్మనుసరించి వచ్చుట కేమియును సందియము లేదు" అని వీరమతి యనెను. "మనము క్షత్త్రియులము గావున క్రూర శార్దూలములను జెండాడి దగ్గఱగా నున్న యీ మార్గమును నిష్కంటకముగఁ జేసి యాతాయాత జనమ్మునకు మేలు కూర్పవలయు నని నాతలంపు. నీ వేమందు" వని భర్తయన "చెలి

మొక శార్దూలము నన్నాహారముగఁ జంప వచ్చెను.
దాపున నీ యుపాయమే బాగుగా నున్నది'' అని భార్య
బమునకు చెప్పెను. తరువాతఁ బసుల కాపరు లచ్చెరువంది
గొల్లు మన నా రాజదంపతు లా భయంకరారణ్యమునఁ
బ్రవేశించిరి.

నాలు గైదేండ్లనుండియు దారి కట్టుపడి యుండుటచే
వారి గమనమున కచ్చ టచ్చట నాలస్య మగుచుండెను.
ఇట్లు పదునాలుగు పదునైదు మైళ్లదూర మేగు నంతలో
భయంకర మగు నొక నినదము వినవచ్చెను. మన బాటసా
రులు గుఱ్ఱములతోఁగూడ నులికి పడిరి. దక్షిణంపు దిక్కు
నుండి మృత్యు దేవతయో యను నట్టులు దంష్ట్రాకరాళ
మగు నోరు తెఱచుకొని, యాఁడు పులి బొబ్బరించుచు వారి
పైఁబడ వచ్చుచుండెను. అది కని వీరమతి తన తురంగ
మును దాని కభిముఖముగఁ ద్రిప్పి, వెనుకకు నాలు గడు
గులు తగ్గించి నడపించి, వింట నమ్ములు సంధించి యొకటి
వెనుక నొకటిగ నాలుగమ్ములు గుఱిచూచి యా పులినోట
రెంటను, నురమ్మున రెండును నాటించెను. రివ్వున వచ్చి
తగిలిన యా బాణముల తాఁకును భరింపలేక కోపముతో
నా బెబ్బులి బొబ్బరించుచు నెగిరి వచ్చుచుండెను. వీరమతి
యది గాంచి గుఱ్ఱమును వెనుకకుఁ దగ్గించుచు మఱి రెండు
బాణములను బ్రక్కలో నాటించెను. పట్టు వడిన యా
యాఁడు పులి మహా కోపముతో నెగిరి వచ్చుచుండ నామె
సమయమును గుర్తించి ధనువు నుజ్జగించి బల్లెమునందుకొని
దాని యురమ్మున నాటించెను. పైఁబడవచ్చు వేగమ్మున
నా బల్లెమా పులి యురమ్మున దూసిపోయెను. వీరమతియు

రెండవచేతితోఁ బలవత్తరమైన యర్ధచంద్రాకృతి గలసాధనము నా పులి మెడకుఁ దగిలించి దానిఁ బడవైచెను. క్రిందఁ బడియు గాండ్రించుచు [illegible] మరల లేవఁ బ్రయత్నించుచుండ జగదేవుఁడు క్రూర నారాచములు పుంఖానుపుంఖమ్ములుగఁ బ్రయోగించి దాని మద మణఁచెను. వీరమతియు విల్లు చేఁబట్టుకొని మరల నావ్యాఘ్రముపై బాణవర్షము గురియించెను. దానితో పులిఁ నేలఁ గూలెను. విలవిలఁ దన్నుకొని ప్రాణములను విడిచెను. అది సుమారు రెండుమూడు గజములపొడవు గలిగియుండెను. వెంట బాణమును సంధించి యతిజాగరూకుఁడయి యున్న జగదేవుఁ డా వ్యాఘ్రమును జంపిన వీరమతిని శ్లాఘించెను. ఇరువురును గుఱ్ఱములను నడపించుచు నలు దెసలఁ బరికించుచు మెల్లనఁ బోవుచుండిరి. ఇంతలో "అయ్యా! రక్షింపుఁడు. రక్షింపుఁడు. ఈ పులి నన్ను జంప నుంకించుచున్నది" అను నార్తనాదము విన వచ్చెను. అది యేమని వారు నలు వంకలఁ గలయఁ బరికించి యచ్చటి కనతి దూరమ్మున నుండు నొక చెట్టుపయిని గూరుచున్న భయకంపిత గాత్రు నొకనిం గాంచి యచ్చటికిఁ దమ గుఱ్ఱములను నడపించిరి. చెట్టుక్రింద నశ్వమును జంపి తినుచున్న క్రూర శార్దూలమును, చెట్టుపైనుండి గడగడ లాడు నొక రౌతును వారికిఁ గానవచ్చిరి. "అయ్యా! రక్షింపుము; రక్షింపుము, ఈ వఱ కొకపులి నా చెలికాని, వాని గుఱ్ఱమును జంపినది. ఈ పులి నా గుఱ్ఱమును జంపినది; నన్నుఁ జంప నున్నది. దీనిం గడతేర్చి నాకుఁ బ్రాణదాన మొసంగుము" అని యా చెట్టుపై నున్నవాఁడు మొఱపెట్టె "నీ కభయము నొసంగితిని. కొంచెము సేపట్టు లచ్చటనే

యుందును" అని నిర్ణాగమైన శిక్షయు నిచ్చె. నేనీ యుందు గొల్లమొంబు లా జగదేవుఁడు తన ప్రక్కనే నున్న దివి యుల్లు పులిని గొట్టుఁ గొట్టి పిలిచి మెను నైనంత దొంగ బాణములు నాలియెడ మాపిపోవు నట్లుగ గొట్టెను. క్రేంకా రముతో బెబ్బులి గొబ్బున నెగిరి జగదేవుని పైఁ బడవచ్చు చుండెను. తత్క్షణ మెచ్చటినుండియో దివ్యమగు ధ్వనితో నొకటి వెనుక నొకటిగ వచ్చి యనేకము బాణములు క్రూర శార్దూలమ్మునకుఁ బ్రక్కలో గాటముగా నాటెను. ఆ నాటు నాటిన నీయుడ యా పుండరీకము జగదేవునిపైఁ బడెను. అతఁడు గుఱ్ఱమునుండి లంఘించినను ఘాతుకము లగు దాని వాడిగోళ్లు తలను చెంపకుఁ దగిలినవి. ఆ కోపముతోఁ దనకు నొంకిన గుఱ్ఱమును మాత్ర మా పంచనఖము పంచత్వ మొందించెను. వీరమతి కోపావేశ పరవశ యై తురంగ ముతో నాపులిపైఁ బడి యతినిశిత మగు తనఖడ్గరాజముతో దాని తలకు గుఱిపెట్టి కొట్టెను. ఆ వ్రేటు పడు సమయమున నది తల యచ్చోటినుండి తీసివేయుటచే గుఱ్ఱమునకే యా వ్రేటు తగిలెను. ఘాతుకత్వము రూప మొంది వచ్చినట్లు భయము గొలుపు న వ్యాఘ్రము తురంగమును విడిచి వీర మతివైపు తిరిగెను. ఇంతలో మరల నెచ్చటి నుండియో వచ్చి వేగులను బెల్లగించు వాఁడి నారాచము లొకటి వెనుక నింకొకటిగ నా పులిపై బడుచుండెను. సర్వాంగములును దద్బాణ పరంపరచేఁ దుత్తునియలు గాఁగఁ బెద్దపెట్టున బొబ్బ రించుచు న బ్బెబ్బులి గొబ్బునఁ బైకెగిరి నేలంబడి నెత్తురు గ్రక్కుకొని ప్రాణమ్ములను విడిచెను. అది ప్రాణములను విడుచు సమయమును గని పెట్టి యా బాణము లెచ్చటినుండి

వచ్చుచున్నవో, మా కీతఁడు దమ ప్రాణములను గాపాడి మహా ఘాతుక మృగమును విలయ మొందించిన మహాపద్బాంధవు లెవ్వరో, గనుఁగొనవలయు నని వీరమతి యనుకొనెను; కాని పులిగోరిగీరులచే గాయముల నొంది మూర్ఛిల్లియున్న జగదేవుని విడిచి పోవుట కిష్టము లేక "మహాత్ములారా! మా ప్రాణములను గాపాడిన మీ దర్శన మిచ్చి మమ్ము ధన్యులను జేయుఁడు" అని గట్టిగఁ బలికి పతి సన్నిధి కేగెను. ఆమె యాడిన మాటల కా ఘోరారణ్యము ప్రతిధ్వనించుట తప్పఁ బ్రత్యుత్తర మేదియు వినవచ్చుట గాని మహాపద్బాంధవులు గానవచ్చుట గాని జరుగలేదు. ఆమె గుఱ్ఱము దిగి ప్రాణనాథుని చెంతకుఁ బోయెను. అతని దేహము చెంపనుండి మూఁడు ధారలుగ రక్తము ప్రవహించుచుండె నామె తన చీరచెంగు చించి రక్తమును తుడిచి గాయముల కా వస్త్రఖండ మంటించి పట్టుకొని యుండెను. అతఁడును తెలివి రాఁ గన్నువిచ్చి వీరమతిం జూచి "పులి యేమయ్యె" నని యడిగెను. "అది చచ్చెను" అని వీరమతి పలుక నతఁ డతిప్రేమచే నామెను గౌఁగిలించుకొని "ఇది మూఁడవ సారి నీవు నన్ను బ్రతికించుటకు. నీ నామధేయ మన్వర్థ మయినది" అని జగదేవుఁడు పలికెను. "లేదు. లేదు. ఈ సారి మనల నిద్దఱను బ్రతికించిన మహానుభావులు గలరు. మీరు పులిచే దెబ్బతిని పడి మూర్ఛిల్లితిరి. అది గుఱ్ఱమును జంపుచుండెను. అంత నే నాపులి తల నఱుకఁ గత్తి వేటు వేసితిని. అంతలో నది తప్పి గుఱ్ఱపు తలకే తగిలి వ్రయ్య లొనర్చెను. వెను దిరిగి పులి నాపైఁ బడ నుంకించుడు నెచ్చటి నుండియో బయలు వెడలి పరం

పరులుగాఁ [illegible]మ్ములా చాకల నొకము [illegible] మంతయుఁ జంపి దాని మాంసాహార మొనరించినవి. ఇ [illegible] బాణ పరంపరతో నాకున్న నే నీదినమ్మునఁ బ్రాణము లకుఁ బాసిన దానవే. ఆ మహాత్ము లెవ్వరో యూహింప [illegible]. వా రిల్లు మఱుగు పడుట కేమి కారణమో తెలి యదు" అని వీరమతీదేవి పలికెను. అంతట జగదేవుఁడు లేచి వీరమతితోఁ గూడ నా సమీప ప్రదేశములయందు వెదకెను. ఎవ్వరుఁ గాన్పింపలేదు. అచ్చట గుఱ్ఱము నడచిన జాడలు మాత్ర మగుపించెను; కాని వారి చూపు మేర కెవ్వరును గన్పట్టకున్నంత, "ప్రాణేశ్వరీ! నాఁడు నన్ను యుద్ధమునఁ గాపాడిన వ్యక్తులే యిప్పుడును మనలఁ గాపాడి యుందురు. వా రెవరో దేవతలు గాని మనుష్య మాత్రులు గారు. మనము వారి కేమి ప్రత్యుపకారము గావింపఁ గలము? రెండు జాముల ప్రొద్దు మీఱెను. నా కాఁకలి దప్పు లెక్కువ యై శోష పొడముచున్నది. కావున నీ గుఱ్ఱము మీఁదనే మన మిరువురమును బోవుదము. ఈ సమీపమున నెద్దియైన గ్రామము గల దేమో చూతము రమ్ము" అని జగదేవుఁడు పలికెను. ఆ దంపతు లేక వాహనారూఢులై బయలుదేఱి పది యడుగులు వచ్చి నంతలోఁ జెట్టుపై కెక్కి ప్రాణములను గాపాడుకొనిన గుఱ్ఱపు రౌతు వారిం జూచి భయము విడిచి చెట్టు దిగి వచ్చి వారికి మ్రొక్కి తల వంచుకొనెను. జగదేవుఁడు వానిం జూచి "ఏమిరా! నీవా! ఈ దారి నేల వచ్చితివిరా?" అని యడిగెను. మొన్నటి సాయంత్రము తోఁటలో నిదు రించుచుండ మిమ్ముఁ గట్టిన వారిలో నొకఁడు గదా వీడు!

తర్వాతఁ నలువురు మాచే నిహతులైరి. తక్కిన యోద్ధ లును తురంగములతోఁ గూడఁ బలాయితు లయిరి. వారిలో నొక్కరుఁడు వీఁడు'' అని వీరమతి పలికెను. వాఁడును జగదేవుని పాదములపైఁ బడి నమస్కరించి ''స్వామీ! మా నేరమి లేమిని మన్నింప వలయును. పెద్ద రాణీగారి ప్రోద్బోధనచే మిమ్ము హింసింప బయలు వెడలితిమి. ఆ నాఁడే నల్వురు చచ్చిరి గదా! ఇంతకు రెండు గంటల క్రిందట నీ దారిని నేనును నా పాలేరును వచ్చుచుండ హఠాత్తుగా నొక పులి వచ్చి వానిని వాని గుఱ్ఱముతోఁ గూడఁ జంపి నది. ఈ పులి నాపైఁ బడ నుంకింప నే నీ చెట్టెక్కితిని. గుఱ్ఱము నది చంపెను. ఇంతలో మీరు దూరమున నగు పింపఁగాఁ గేక పెట్టితిని. మీరు వచ్చి నన్ను గాపాడితిరి. మీ ధర్మమున బ్రతికితిని. ఈ దగ్గఱ రెండు మూఁడు మైళ్లలో నొక యూ రున్నది. నా తప్పు క్షమించి నన్ను దయతో మీతోఁ దీసికొని పొండు'' అని వాఁడు వేడు కొనెను. ''సరిలే; భయము లేదు ర'' మ్మని వాని కభయ మిచ్చి వాఁడు దారి చూప వా రెట్టులో నాఁటి కా దగ్గఱ యూరుఁ జేరుకొనిరి. ఆ నాఁ డచ్చట నుండి మఱునాఁడు బయలు వెడలిరి. మూఁడు మకాములు దాఁటిరి.

---

# 2. ఏకపత్నీవ్రతము

వీరమతియు జగదేవుడును విశాలవట మను గ్రామమును చేరుకొనిరి. అందొక పల్లె చావడి గలదు. అణహింత్ర పురమునకై దాఱు క్రోసుల దూరములో నా గ్రామముండుటచే బాటసారులు నగరమునకు వచ్చునప్పుడు గాని, నగరము నుండి దక్షిణమునకుం బోవునప్పుడు గాని యీ గ్రామమున మజిలీ చేయుచుందురు. ఆ చావడిని గలసియే కొన్ని యిండ్లున్నవి. ఆ గేహముల యందు వండుకొని భుజించి యీ చావడిలో మార్గస్థులు నివసింతురు. అచ్చట నిరువురు బ్రాహ్మణు లున్నారు. వండుకొన నేరని వారికా బ్రాహ్మణులు భోజనము పెట్టుదురు. దీని కంతటికి నొక యధికారి యున్నాడు. ఈ సత్రమును జావడిని గట్టించి యందుల కగు వెచ్చము నొసంగుచున్నవారు అణహింత పుర రాజగు సిద్ధరాజుగారు.

వీరమతీ జగదేవులా చావడిలో బసచేసిరి. ఆ చావడి యజమాని వచ్చి వారికి కావలసిన సదుపాయముల నొనర్చెను. వారికి నన్నపానమ్ము లా బ్రాహ్మణులచే నిప్పించెను. వారెంతయు నలసియున్న వారగుటచే మూడు గంటల వేళకు భుజించి హాయిగ నిదురించిరి. ఆ మఱునాడచ్చటి నుండి బయలుదేఱి సిద్ధరాజ నగరమున కేగవలయు ననుకొనిరి; కాని వీరమతీ దేవికి కొంచెము

జ్వరము తగిలినట్టు లుండుటచే మఱు దినము వచ్చుటనే యుండవలసిన వారయిరి. మఱునాఁటి సాయంకాలము వఱకచ్చోటనే సుఖముగా కాలము గడపిరి. వీరమతియుఁ బ్రయాణపు బలజడి దీఱ నెమ్మది గొంనెను. అఱు గంటలు గొట్టు వేళ యయినది. సూర్యుఁడు గ్రుంకు మెట్టల మాటున కరుగుచున్నాఁడు. చల్ల గాలికై చావడి నుండి యివ తలికి వచ్చి వీరమతీ జగదేవు లేమియో మాటలాడుచుఁ గూరు చుండి యుండిరి. ఇట్లు లుండఁగా నొక గుఱ్ఱపు రౌతా చావడి కడ కరుగుదెంచి "అయ్యా! జగదేవసింగు బహా ద్దూరు వారిచ్చట నున్న వారా?" అని యడుగ "ఏమి విశేషము?" అని జగదేవుఁ డడిగెను. వాఁడు గుఱ్ఱము నుండి దిగి యాయనకు జోహారొనరించి "ఈ లేఖ చదువు కొనిన నంతయు విశదము కాగలదు" అని తన పగిడీ నుండి తీసి యొక తాటి యాకు నొసంగెను. అం దీ విధముగా నుండెను. "స్వామీ! ఇచ్చటి కనతి దూరమ్మున వేయఁబడి యుండు నా పట కుటీరమున కొక్కసారి దయచేసి దర్శన మిప్పింప మిక్కిలి వేఁడుకొనుచున్నాను. ఇట్లు మీ మిత్రము"

విజయసింగు.

అది చదువుకొని "ఏమోయీ! ఎంత దూరములో నున్నది మీ పట కుటీరము?" అని జగదేవుఁడు గౌతు నడుగ నతఁడు "స్వామి! ఆ కనఁబడు తోఁట కవతలనే యున్నది. మనకు రెండు మూఁడు నిముసముల ప్రయాణము" అని జవా బిచ్చెను. "వీరమతీ! ఏ మందువు?" అని యతఁ డడుగ 'చని వేగముగా రండు' అని యామె ప్రత్యుత్తర మిచ్చెను. అంత నతఁడు తన యుడుపులను

ధరించి తలకును ముఖమునకును గలిపి గట్టిగఁ గట్టుకట్టుకొని ఖడ్గము ధరించి యశ్వము నెక్కి "భద్రము సుమీ! ఇప్పుడే వచ్చెదను. లోపలి కేగుము" అని చెప్పి యా రాత్రి తురంగ మెక్కి ముందు దాటి చూపు వచ్చెఁ దా తోఁట దాటి వారి శిబిరముల కరిగెను. చుట్టును బది పన్నెండు గుడారములు చుట్టుకొనియుండె మధ్య నొక పట్టుగుడారము వెలయుచుండెను. జగదేవుఁడు తోఁట దాటి నంతనే యెదురుగఁ వాలి నడకను వచ్చు నొక రాకుమారునిం గాంచెను. ఆ వచ్చు రాకొమరునిం గాంచి నంతనే ముందు దిగుచుండిన తౌరంగికుం డశ్వమును దిగి చేతులు జోడించి మ్రొక్కి ప్రక్కకొదిగి నిలిచెను. జగదేవుఁడు నతనిం జూచి తురంగమును దిగెను. ఆ రాజపుత్రుఁడు జగదేవునికి నమస్కరించి చేయి చేయిం బెనవేసి తన పట్టుగుడారములోనికిఁ గొనిపోయి యొక యుత్తమాసనమ్మునఁ గూర్చుండఁజేసి తాను నొక యాసనమ్మున కూర్చుండెను. వారిరువురికి నీ విధముగ సంభాషణము జరిగెను.

విజయ: ఆర్యా! తమకు శ్రమ యిచ్చినందులకు మన్నింప వేఁడుకొనుచున్నాను. ఈ వ్యక్తిని మిత్రముగా భావించి, వేడికోలును సన్మానించి, తా మిందు దయచేసినందుల కెంతయుఁ గృతజ్ఞత గలిగియుండెదను.

జగ: మీ రెవ్వరో నే నెఱుంగను. మే మిం దున్న సంగతి మీ కెట్లులు తెలిసెను? నన్ను రప్పించుట కేమి కారణము? నాతో మాటలాడఁ దగిన యంశ మేమి కలదు? దయ యుంచి సెల వీయఁ దగును

విజయ: నాపేరు విజయసింహుఁ డందురు. మిముఁబోటి మహనీయు లెందఱున్నను నల్లరకుఁ దెల్లమగుచునే యుండును. మీతో మైత్రి గావింప వలయు నను కుతూహలముతో మీకు శ్రమ యొసంగితిని. నేఁ జెప్పెడి రెండు మాటలకును సావధానముగ నాలో చించి జవాబీయ వలయు నని కోరుచున్నాను.

జగ: నే నేపాటివాఁడను. నా మైత్రి యంతటి విలువకల దని నేఁ దలంపలేదు. ఇట్టు లనన్య బుద్ధితో మీరు నా మైత్రి నభిలషించినందుల కెంతయుఁ గృతజ్ఞుఁ డను. మనఃపూర్వకముగ మీ మైత్రి నభిలషించు చున్న వాఁడను; మీ రడుగ దలఁచిన యంశమును సంశయింపక తెలియఁ జేయుఁడు.

విజయ: మఱేమియును లేదు. మీరు జగదేక వీరు లని లోకములో నద్వితీయ మగు ఖ్యాతి కలదు. మీ ఖ్యాతిని విని యొక రాకన్నియ మీపయి మేలుపడి యున్నది. మిమ్ముఁ దప్ప నన్యుని గన్నెత్తి యయినఁ జూడ నని వ్రతము పట్టి యున్నది. తా వ్యాబాలికా మణిని జెట్టపట్ట వలయు నని వేఁడుకొనుచున్నాను. తమ సెల వయినచో నామె నిప్పుడే పిలిపించెదను. దాఁప నేల? ఆమె నా సోదరియే. మూఁడు మూర్తుల నన్నే పోలి యుండును.

జగ: మిత్రమా! క్షమింపవలయును. మీరు నా యెడలఁ జూపిన గౌరవమునకు విధేయుఁడను. నే నేకపత్నీ వ్రతస్థుఁడను.

విజ: మీ వ్రతమునకు భంగము కలుగదు. ఆమెయు వీరమతీదేవియు నొక్క శరీర మొక్క ప్రాణముగ మెలంగుదురు. మీ రామెను జేపట్టకున్న నవశ్య వ్రతమ్మున నా చెల్లెలు మేను వీడ సంసిద్ధ యయి యున్నది. ఆమె ప్రాణములను నిల్పి పుణ్యము గట్టుకొనవలెను.

జగ: నే నేమి సేయుదును? మీరు నాపైఁ జూపిన ప్రేమ కాజన్మము దాస్యము గావింప నియ్యకొందును. ఆమె నెట్టు లయిన నట్టి యుద్యమమునుండి మరలింపఁ వేఁడుచున్నాను.

విజ: ఆమె పూనికను మాన్ప నెరికిని శక్యము కాదు. మా తల్లిదండ్రు లామెమనంబును ద్రిప్పఁజాలక నా వెంట నిట్టులు పంపిరి. మీ రంగీకరింపనినాఁ డామెకు మరణమే శరణము.

జగ: నేను బరవనితను గన్నెత్తి యైనఁ జూడను. నన్నిట్టు లడిగిన నే మనఁగలవాఁడను. వివాహము కాకముం దామెయిష్టము నాకుఁ దెలిసి యుండినచో నామెనే పెండ్లాడియుందును. గతించినదానికి విచారించుట ప్రాజ్ఞుల మతము కాదు. కావున మీ రెట్టులయిన నామెకు నా యుదంతమును బోధించి మనస్సు ద్రిప్పివేయుఁడు.

అని జగదేవుఁడు పలుక నా రాకొమరుని కనుగొలుకులనుండి జలజల నశ్రువులు రాలెను. అది చూచి జగదేవుఁ డచ్చెరువొంది చూచుచుండెను. కాచ గోళమున నిండు చంద్రుని ధిక్కరించుచు దీపము వెలుగుచుండెను.

కొంత వడి కా బాలకుని మొగముఁ జూడలేక జగదేవుఁడు కన్నులు మూసికొని యోచించుచుండెను. మరల నతఁడు కన్నులు విప్పనరి కెదుటఁ గాషాయాంబరధారిణి యగు నొకయబల కన్నుల నీరు గార్చుచుఁ జెక్కిటఁ జేయిఁ జేర్చుకొని యున్న దని వేడి నిట్టూర్పులు పుచ్చుచున్నట్టు గానవచ్చెను. జగదేవునియొడలు జల్లు మనియెను. అతఁడు తన కన్నులను దానే నమ్మలేక పోయెను; మరలఁ గన్నుమూసెను; కొంత వడికిఁ గన్నులు విప్పెను. ఆ యోగినియే యెట్టయెదుటఁ గన్పట్టెను. ఇది యేదో యింద్రజాల మనుకొని యతఁడామె మొగమును బరికించి చూచెను. మొదటఁ దన్నాహ్వానించిన రాకొమరుని మొగమ్మునకా మొగమ్మునకేమియు భేదము గాన్పింపదయ్యె. ఏది యెట్టులయిన నెదుట నున్నవ్యక్తి యంగన యగుటచేఁ దానక్కడ నుండఁ గూడదని తలంచి యతఁడు దిగ్గన లేచెను. "ఒక్క మాట వినఁగోరెద. ఈ యభాగ్యురాలు మనమ్మున మిమ్మే భర్తగా వరించియున్నది. ఈ రూపమును జూచితిరి గదా! ఈచిత్తరువును మదినుంచుకొనుఁడు. పరమేశ్వరుం డీమెకోర్కి తీర్పనినాఁ డీరూపముతో నిట్టులే తపించి మరణించి మఱుజన్మమునఁ దప్పక మీదాసియై యుండఁగలదు" అని యోగిని పలికెను. "నా వ్రతమును బరీక్షింపఁ బరమేశ్వరుఁ డిట్టి పన్నాగమును బన్నినాఁ డనుకొనియెద. లేకున్న నిట్టి వింత యెచ్చోనైనం గలదా! మీ రెవ్వరో దేవతలలో నన్యతము లని విశ్వసించి చేతులు జోడించి యిచ్చోటినుండి వెడలుచున్నాఁడను" అని జగదేవుఁడు పలికి గుడారమునుండి నిర్గమించెను. ఆ బాలయోగిని, వాని

హోమప్రదేశ ఱెప్పవేయక చూచుచు నతఁడు నిర్గమించినంతఁ గొంత తడ వట్టులే చూచుచుండి తెలివి తెచ్చుకొని లేచి ముక్కుపై వ్రేలిడుకొని తెరమఱుగున కరిగెను.

---

## చతుర్దశోల్లాసము

# వీరమతి

ఘూర్జర దేశాంతర్గత మగు అణహిల పురమునకు మన దృష్టి త్రిప్పవలయును. చదువరులారా! అణహిల పురము, ఆ నాఁటి నగరములలో వన్నె కెక్కియుండెను. రాజమార్గములు విపులములు, సత్తరువులు, చావడులు, గుళ్లు, గోపురములు నా నగరమున మితి మీఱి యున్నవి. సకల వస్తు సమృద్ధిచే నది సంపన్నిలయమై యున్నది. ఆ పురమును బాలించువాఁడు సిద్ధరాజు. అతఁడు శౌర్యధైర్య పరాక్రమములందు పేరెన్నిక గన్నవాఁడు. సుమా రొక సంవత్సరమునుండియు నతఁ డేలొకో విచార సాగరమ్మున మునిఁగి పరితపించుచు రాజ్యపాలనము మంత్రిపై నుంచి నిరంతరమును బరమేశ్వరుని ధ్యానించుచుఁ గాలము గడపుచుండెను. అతఁడు వీధి కొక కోవెల వంతున నొక నూఱు కోవెల లానగరమ్మునఁ గట్టించెను. అన్ని కోవెలలకు నుత్తమ మయినదియు, మిగుల ప్రసిద్ధి కెక్కినదియు సహస్ర లింగ మను కోవెల. దాని యెదుట సహస్ర లింగ మను పేరు గల సరోవర మొకటి కలదు. ఆ కోనేఱు, నాలుగు ప్రక్కల నొక్క కొల గలిగి చలువ ఱాతి మెట్లతోను

నచ్చంపు తేటనీటితోను జక్కని తామర పూవులతోను గరంబలరారుచుండెను. ఆ కోలను నుత్తర దిక్కున రాచబాటను దాటి యీశ్వరాలయ మున్నది. తూర్పు దెసను పెద్ద సత్ర మొకటి కలదు. తక్కిన దిక్కులను మంచి రాచబాట లున్నవి. ఆ సత్రమువాకిట నారికేళ వృక్షమ్ములు వరుసగా నున్నవి. ఆ కోనేటికి నలు వలంకులను వరుసగఁ గొబ్బరి చెట్టులు పెరిగి యా సరస్సున కెంతయు సొగసుం గూర్చుచున్నవి. ఆ నాలుగు రాచ బాటలలో దక్షిణ పశ్చిమ దిక్కులయం దుండు నున్నతము లగు నాగరికుల సౌధరాజము లా కమలాకరమ్మునఁ బ్రతిఫలింప, నందలి జలమ్ములు నిర్మలము లగుటచేఁ బాతాళ లోక మగుపించుచున్న దని చూచువారు భ్రమఁ జెందుదురు. కోవెల గోపురమ్ములయందును సత్ర సౌధవీధియందును నున్నత సౌధరాజమ్ములయందును నుజ్వల మగు కాంతితో వెలుంగుచుండు దీపములు రాత్రులయందా మేడలతోఁ గూడ నక్షత్రమ్ములం గలిసి యందుఁ బ్రతిఫలించునపుడు చూడ సింగారముగ జలాధిదేవతయు నగరాధిదేవతయు నవరత్నభూషణమ్ముల పస తెల్లెడ నల్లుకొనం గలిసికొని కౌఁగిలించుకొన్నట్లు గానవచ్చును. ఆ స్థలమునందలి దృశ్యము మిక్కిలి చక్కనై యుండెను.

సాయంత్రము నాలుగు గంటలు కొట్టువేళ యయినది. ఎండవేఁడిమి కొంచెము తగ్గుచున్నది. అట్టి సమయమున సుమారు పదునాఱేండ్ల జవ్వని యోర్తు సత్రపు టరుగుపైఁ గూర్చుండి యుండెను. జీనుతో నొకగుఱ్ఱ మచ్చటిచెట్టునకుఁ గట్టఁబడియుండెను. అది మిక్కిలి యలసియుండుటచే

దాని ప్రక్క వెలుగుచుండెను. ఆ యువతీరత్నము మొగ మరుణారవిందము ననుకరింప నాజ మగు చక్కఁదనము నొక్కింత కోలుపోయెను. ఆమె కాభరణము లంతగా లేవు. ఎవరిరాకనో నిరీక్షించుచున్న యామె చూపులు చూపఱ నువ్విళు లూరించుచున్నవి. సాధారణముగ నా వేళ కా కోనేటిదరికి మగవారు రారు కాఁబోలు. నాఁడు వారే యచ్చ టచ్చటఁ దిరుగుచున్నవారు. కొందఱు స్త్రీ కడవలను దలపై నిడుకొని కోనేటినుండి యింటికిఁ బోవుచు నచ్చటఁ గూరుచున్న యీ పడుచు నెంతయు వేడుకగాఁ జూచుచున్నవారు. ఇంతలో నొక యువతి సందిట నొక గిండి యను బట్టి యుదకమునకై యీ మార్గమున వేగుచు నాఁడంగులు గుమిగూడి యేమి చూచుచున్నారో యని యచ్చోటునకు వచ్చి, కన్ను లున్నందులకుఁ గలుగఁగల ఫలము గలిగె ననుకొని కొంత తడ వా పడుచును ఱెప్ప వాల్పక చూచు చు నిలుచుండెను. మూఁగియున్నవా రొక్కొక్కరుగ, నామె యరుగు దగ్గఱకు వచ్చి "అమ్మా యీ! నిన్ను జూచినంత నా కన్నులు చల్లఁబడినవి. నీ పే రేమమ్మా?" అని యడిగెను.

బాలిక: నా పేరు వీరమతి యందురు. అమ్మా? మీ రెవరు?

స్త్రీ: అమ్మా! ఈ పుర మేలు సిద్ధరాజుగారి శుద్ధాంత పరి చారికను. విశాలాక్షీదేవిగారి చెలికత్తెను. నన్ను రోహిణి యందురు. కాని; అమ్మా! మన దేయూరు? నీ వంతఃపురమున నెండకన్నెఱుఁగక యుండవలసిన దానవుగా నున్నావే. ఇటు లొంటిమై నుండఁ గారణ

మేమిఁ? మా యంతఃపురాంగనలు మీ కాలిగోటి
కైనఁ బోలరు సుమీ తల్లి!

వీర: ఏమో తల్లి! నాభర్తగారును నేను నీ యూరు వచ్చి
తిమి. వా హారిలోనికి బసచూచుటకయి పోయి
యీ వఱకును రాలేదు. వారిరాకకే యెదురు
చూచుచున్న దానను.

స్త్రీ: అమ్మా! నీ మాటలు ముద్దుల మాటలు. తల్లీ!
నీ యత్తవారి యూ రేది? నీ వే వంశమున జనించితివి?

వీర: ధారా నగరము మా యత్తవారి యూరు. నేను
క్షత్త్రియ కన్యను.

రోహి: తల్లీ! ధారా నగర రాజాంతఃపుర కాంతవలెఁ గాన
వచ్చుచుంటివి! మీ మామగారి నామధేయమును
జెప్పఁగలవా?

వీర: అమ్మా! ఉదయాదిత్య సార్వభౌములు మా మామ
గారు.

రోహి: వాఘులాదేవి గారా మీ యత్తగారు?

వీర: కాదు. ఆమె పెద్దత్తగారు. మా యత్తగారు
శ్రీ మహాలక్ష్మి దేవులు.

రోహి: అలాగునఁ టమ్మా! జగదేవసింగు గారా మీ
భర్తగారు! మీ కన్న వా రెవరమ్మా?

వీర: టుకటోడా రాజ్యము నేలు రాజసింహుఁడు మా
తండ్రి. శ్యామలాంబ మా తల్లి. యువరాజు వీర
సింహుఁడు మా యన్న.

రోహి: అమ్మా! మీ పేరు లన్నియు మే మను దినము నను
కొనుచునే యుందుము. మా రాణిగా రుదయాదిత్య

సార్వభౌముని చెలియలు. రణధవళ కుమారుఁడును జగదేవ కుమారుఁడును మా రాణీగారి మేనల్లురు. తల్లీ! మీ రిట్లు పరదేసుల వలె వచ్చి యుచ్చుటఁ గూర్చుంటి రేమి? మీ కీ బంధుత్వము తెలియదా? ఉదయాదిత్య సార్వభౌము లిర్వురు పుత్త్రిలను సమాన మగు ప్రేమతోఁ జూచు చున్నా రని వింటిమే. మీ రిట్లు రాఁ గత మేమి?

వీర: నా కీ బంధుత్వములు దెలియవు. నా భర్తగారికిఁ దెలియు నేమో? తెలిసి యుండియు నిట్టు లొనర్చుటకుఁ గారణ మే మయి యుండునో? కావున నీ వీ సమాచారము నంతః పురమున నెఱింగింప వలదు. మగవారి యిష్టము ననుసరించియే కదా మనము ప్రవర్తింప వలయును!

రోహి: ఔ నమ్మా! నా కేమి కావలయును? నే సెలవు తీసికొని యెదను.

అని రోహిణి కోనేటి కేగి నీరు నింపుకొని గిండిని జంక నిడికొని రాజమార్గమున నిర్గమించి చనెను. ఆమె చనిన పది నేను నిముసములలో నా సరోవర తీరమ్మున నొక పల్లకితో నిరువది ముప్పది మంది నౌకరు లెంతయుఁ బటాటోపముగా వచ్చుచుండిరి. వీరమతి యా సందడి యే మని యచ్చెరు వంది చూడ సాగెను. ఆ పల్లకి యామె యున్న యెడకే వచ్చెను. బోయీలు పల్లకిని దింపిరి. తలుపులు తీయ, మించు మించు ముప్పది యేండ్ల యీడు గల యొక కాంతామణి సర్వాభరణ భూషిత యై యా మేనా నుండి వెలువడి వచ్చెను. ఆమె ధరించిన దుస్తు లమూల్యములు.

ఆమెను జూచి నంత నామె రాజపత్ని యని వీరమతి యనుకొనెను. సర సర నామె వీరమతి చెంత కరిగి "అమ్మా! వీరమతీ? ఎన్నాళ్లకు నిన్నుఁ జూడ గలిగితిని! నా తల్లీ! రమ్ము! నన్ను గౌఁగిలించు కొనుము" అని యామెను జేరఁ దీసి కౌఁగిలించుకొని ముద్దాడి, కురులు తిన్నగా సవరించి ప్రక్కను గూర్చుండఁ బెట్టుకొని, వెన్ను నిమురుచుఁ బ్రేమ యుట్టి పడునట్లీ రీతిని జెప్ప సాగెను. "అమ్మా! నీవు నన్నెఱుఁగవు. మీ మామ గా రుదయాదిత్యుఁడు మా యన్న. రణధవళుఁడును జగదేవుఁడును నా మేనల్లుండ్రు. నీకుఁ దెలియక పోయిన జగదేవునకుఁ గూడఁ దెలియక పోయెనా? వాఁ డిప్పుడు వీధి వెంబడి వచ్చుచుండ మీ బాబుగారు చూచి పోల్చి పట్టి పిలిపించి సంగతి తెలిసికొని యెంతయో విచారించిరి. వెంటనే నిన్ను దీసికొని రావలయు నని నాకుఁ గబు రంపిరి. మీ రెట్లు పరదేసుల వలె సత్రము వద్ద దిగుట ధర్మముగా నున్నదా? నేను జనిపోయితి ననుకొంటిరి కాఁబోలును! నా పిల్ల నొకటియు నీ వొకటియునా? మీ రీ లాగు జేసిన నా మన సెట్లుండునో యాలోచించు కొనుము. నా భర్త గారికి జబ్బుగా నుండుటచేత నీ పెండ్లికి రాలేక పోయితిని. తల్లీ! సమాచార మంతయును దెలిసినది. మీ రెందులకును విచారింప నక్కఱ లేదు. నా కొక్క కూఁతు రుండెడిది. ఆమె యే మైనదో నేఁటికిని దెలియ లేదు. కొడుకులు లేనే లేరు. నీవే నా కూఁతురవు, జగదేవుఁడే నా కొడు కనుకొని కన్నులలోఁ బెట్టికొందును. ఆలస్యము చేయక వేగముగఁ బల్లకి నెక్కి రమ్ము. గుఱ్ఱమును మన నౌకరులు తీసికొని

వత్తురు'' అని కన్నుల నీరు పెట్టుకొని గడ్డము పట్టుకొని బ్రతిమాల వీరమతి యామె ప్రేమ కెంతయు సంతసించి ''అమ్మా! ఆయన మీ సమాచార మొక మాటయినను నాతోఁ జెప్పలేదు. మా చిన్నతనమునకు క్షమింపవలయును'' అని వేడుకొనెను. ''దాని కేమి లెమ్ము. మీరు నా బిడ్డలు. మా జగదేవుఁడు వట్టి వెఱ్ఱి వాఁడు. మేనత్త కడఁ గూడ వానికి మొగమోటమిదే. లెమ్ము. నీ కొఱకు నతఁడెదురు చూచు చుండును'' అని చెప్పెను. ఆమె మాటల కలరి వీరమతి లేచి వచ్చి పల్లకిలోఁ గూర్చుండెను. ఆమెయు నా పల్లకిలోఁ గూర్చుండి ''తిన్నగ మన మహాలునకే పల్లకి తీసికొని పొండు. ఆ గుఱ్ఱమును గొందఱు తీసికొని రండు'' అని యా ప్రౌఢ యాజ్ఞాపింప బోయీలు, పల్లకి నెత్తి, పెద్ద కేకలు పెట్టుచుఁ బరువెత్త నాగిరి. భటులు గుఱ్ఱమును వెను వెంటనే తెచ్చుచుండిరి. నిముసములో నామె మహాలు లోని కా పల్లకి యరిగెను, ఎండలో పని కత్తె లడుగులకు మడుఁగు లొత్తుచు వీరమతిని మహాలు లోనికిఁ దీసికొని పోయిరి. పల్లకి దిగినంతనే చేటులు వసంతమును బళ్లెరమునఁ బోసి తెచ్చి దృష్టి దోష పరిహారణార్థము మొగమ్ము నెదుటఁ ద్రిప్పి భూమి మీఁదఁ బాఱఁ బోసిరి; కర్పూరపు హారతులు పట్టి నివాళు లొసంగిరి. అంతఃపుర మర్యాదల కేమియు లోటు కలుగలేదు.

వీరమతిని బరిచారికలు మేడ మీఁదికిఁ దీసికొని పోయి, పరిమళ భరిత మగు నొక మహాలులో నామెను విడియించిరి. కొన్ని నిముసములు పోయి నంతనే పరిచారికలు పది మంది వచ్చి వీరమతిని జలక మాడ రమ్మని

పిలిచిరి. ఆమె వలదను చున్నను సంపెంగ తైలముసఁ దల యంటిరి; నిమిషములో నలు గిడిరి; సుగంధోదకమున జలక మార్చిరి; తడి మొత్తిరి; ధూప మిడి కేశ పాశమును జక్కెడ లించిరి; పువ్వులువలు కట్టనిచ్చిరి. ఆమె యుని యంటక తన దగ్గఱ నున్న మాట లోపిదే మొక సరిగ వలువఁ గట్టుకొని కంచుకమును దొడుగుకొనెను. వారు నగలను దెచ్చి యలంకరింపఁ బోయిరి; కాని యామె నిరాకరించెను. భర్తను విడిచి సుమారు నాలు గైదు గంట లయినది. సాయంత్ర మయి చిఱు చీఁకటులు గ్రమ్ముచుండెను. ఆమె మనంబెలోకో చేయి పెట్టి కలఁచి నట్టులు మిక్కిలి కలఁతఁ జెందుచుండెను. కారణము తెలియక యామె విచారమునకు లోనయ్యెను. ఏడు గంట లయ్యెను. "అమ్మా! భోజనమునకు రమ్ము. మీ బాబుగారి కందాలో జగదేవుఁడు భుజించి యుండును" అని యామె దోడ్తెచ్చిన ప్రౌఢాంగన వచింప వీరమతి యామె వైఖరిని గాంచి సంశయించి "నా భర్త ముఖ మగుపింపక నేను భోజనము చేయను" అని బదులు చెప్పెను. అప్పు డప్ప్రౌఢ "రోహిణీ! మీ బాబుగారి మేడ కరిగి చిరంజీవిని వేగముగఁ బిలుచుకొని రమ్ము. అతఁడు వచ్చినఁ గాని సౌభాగ్యవతి భుజింపదఁట. ఈ సంగతియును జెప్పి వేగము రా" అని బిగ్గరగ వచించెను. "చిత్తము. ఇదె వచ్చెద" నని రోహిణీకాంత పోయి కొంతసేపటికిఁ దిరిగి వచ్చి "అమ్మా! బాబుగారితోఁ గలిసి యాయన భోజనము చేయుచున్నారఁట. ఆమె భుజింపవచ్చు ననియుఁ దొమ్మిది గంటలకుఁ దాము వచ్చెద మనియు మేనల్లుఁడుగారు సెలవిచ్చినారు.

తరువాతఁ దహ చిత్రము'' అని మనవి చేసెను. ''అమ్మా! తెమ్ము. తెమ్ము. నీ వెంత యాఁకలితో నుంటివో నేఁ ముగా తెమ్ము. మా యమ్మవు కావా? జగదేవుఁడు వచ్చు నరికిఁ జాల రాత్రి యగును. మన మింకుపద్రవమును గలిపి ఘటించితము రమ్ము'' అని యామె యజమానురాలు బ్రతిమాలెను; కాని కార్యము లేకపోయెను. ''నా కేమియు నాఁకలి లేదు. ఆయన వచ్చిన పిమ్మటనే నేను భుజింతును. మీరా నారగింపుఁడు'' అని వీరమతి జవాబు చెప్పెను. ఆయన యెంతకును రాకుండుటచే నామె కంత కంతకును మనస్సున సందియము బలపడి యలజడి పెట్టసాగెను. వారందఱు నేవియో వినోదకరము లగు మాటలు చెప్పుచుండిరి; కాని యామె వినిపించుకొనలేదు. అది నాచమహాలు వలె నుండక పోవుటచే తాను మోసపోయితి నేమో యని యామె యనుమానింప, నౌ నని యంతరాత్మ సాక్ష్యము చెప్పుచుండెను. ఇట్టు లొక గంట గడచెను. వీరమతి కాయాసము హెచ్చయ్యెను. ఆమె గదిలోని కరిగి తలుపు మూసికొని ''ఇది యేమి మాయరా! దైవమా!'' అని యోజించుచు నేలనే పవ్వళించి యుండెను. ఆమె మనస్సు పరి పరి విధముల పరుగులు వాఱుచుండెను. ఏ మనుటకును నేమి చేయుటకును దోఁపకుండెను. చీమ చిటుక్కుమన్న నులికి పడుచు నలుదిక్కులు చూచుచుండెను.

ఇట్టి సమయమునఁ దటాలున నా గది గోడ పగులు వాఱెను. పట పట మను ధ్వని వినవచ్చెను. గోడలోనికి రెండు భాగములుగ నటు నిటు దలుపులు వోవ నొక ద్వారము బయ లయ్యెను. ఆమె గుండియ లవియ

నాగెను. వెంటనే యొక యవన పురుషుం డా గదిలోనికి వచ్చెను. వాఁడు వచ్చిన వెంటనే గోడ తలుపులు కలిసి కొనెను. ఆ వన్నెకాని హొయలు వర్ణింప నలవి కాకుం డెను. వాని యాకారమును జూచి నంతనే యామె మూర్ఛకు లోనయ్యెను. మకమలు మీఁద బంగరు చమికీ పని చేయఁబడి ధగ ధగ లాడు నమూల్యము లగు దుస్తులను దొడుగుకొని వాఁడు. వింత వింతగ నడుగు లిడుచుఁ జూచుచు హంసతూలిక పాన్పును జేరి యందుఁ గూర్చుండెను. వాని యాకారమును జూడ వాఁ డున్మత్తుఁ డనుకొనక తప్పదు. వస్త్రాభరణాము లమూల్యములే కాని వాని చూపులును ముఖ వికాసమును నొయ్యారమును జేష్టలును మిక్కిలి నింద్య ములు. "ప్యారీజాన్ ఏల నేల పండుకొంటివి! లెమ్ము! లెమ్ము! నే నీనాఁడు స్వర్గ సుఖ మనుభవింప నుంటిని. నా జన్మము సార్థక మయ్యెను" అని యింక నేమేమియో యొడ లెఱుంగక తూలిపడుచు వాఁడు మాటలాడుచుండెను. వీరమతి యింతలో మూర్ఛ దెలిసి యొడలు గడ గడ లాడ లేచి యొక మూల నొదిగి నిలిచి యుండెను. కాల యముని యెదుట నిలుచు మనుష్య ప్రకృతి ననుసరించి యున్న యామె మనం బెట్టు లుండునో యూహించుకొన వలసినదే. ప్రపంచమున నెంతటి మోస మయిన నున్న దను సంగతి కామె కదియే మొదటి నిదర్శనము. "సర్వేశ్వరా! ఈ రాక్షసుని బారినుండి నన్నెట్లు తప్పించెదవో నీదే భారము" అని యామె మనంబున ననుకొనుచుండెను. ఆమె భయ మును దిలకించి "ప్రేయసీ! నా కడ భయము నొంద ననవ సరము. నా ప్రాణముల కంటె నిన్నెక్కుడుగఁ బ్రేమించె

డను, నీ నెఱపు మాని చిఱునవ్వు మోముతో నొక్కసారి
నీ కటాక్షమును నాపై రానిమ్ము. అమృతము లొలుకు
నట్టి యొక్క పలుకు పలుకుము. నన్ను నీ దాసునిగ నెంచు
కొనుము. నా యైశ్వర్యమున కీనాటి నుండియు నీవే యధి
కారిణి వని తలంపుము. నన్ను గటాక్షింపుము'' అని యా
కామాంధుండు మదిరా పాన వశమ్మున నొడలు తెలియక
తోఁచి వచ్చిన మచ్చిన ముచ్చట లాడఁ దొడంగెను.
కొంత వడి కామె యొక్కింత ధైర్యము తెచ్చుకొని మంచి
మాటలతోఁ దన మనోనిశ్చయము నెఱింగించి వాని చెడు
తలంపును దొలఁగింపఁ దలంచి, ''అన్నా! మీ రెవ్వరో
నే నెఱుంగను. ఈ వీ డెద్దియో నే నెఱుంగను. ఈ
యింటి యజమానురాలు నన్ను మోసపుచ్చి నా పతిం
జూపి న న్నిచ్చటికిం దోడ్తెచ్చెను. మీ రనిన రీతి నే
సామాన్య కాంతను గాను. పరకాంతను. పతివ్రతను.
న న్నిట్టి మాట లాడుట తమ బోఁటి యుచితజ్ఞులకుం బాడి
యగునే? నే మోసపోయి వచ్చిన సంగతియు, నేఁ బతివ్రత
నను వంశమును దమకుఁ దెలిసియున్న నీ రీతిఁ బ్రసంగింపరు.
నన్ను మీ తోడఁబుట్టువుగాఁ దలంచి తమ రెవరో, యీ
స్థల మెయ్యదియో, నన్నీ రీతి రప్పించుటకుఁ గారణ మేమో
సెలవిచ్చి దయ యుంచి నా పతి సన్నిధిని నన్నుఁ జేర్పుఁడు.
మీకుఁ జేతు లొగ్గి వందనములు చేయుచున్నదానను''
అని వీరమతి వినయవతి యై పలికెను. ఆ రాగాంధుఁ డి
ట్లనియె. ''బాలా! నా పేరు లాలాజీ. నా తండ్రి యీ నగ
రమునకుఁ గొత్వాలు; మఱియు సేనాధిపతి. ఈ సిద్ధరాజు
రాజ్యరమాలలామ మా తండ్రిగారి బాహాబలము నాధా

రము చేసికొని యున్నది. నే నేమిచేసిన నీ యూరకున
యేమి యని యడుగువారు లేరు. ఈ మహాలు నాదే. దీని
యజమానురాలు నా యుంపుడుకత్తె యగు జామోత్రి యను
వెల వెలంది. రాచ నగరున గల దాస దాసీజన మింతయుఁ
బూటకాపులై యుందురు. ఈ జామోత్రి, ప్రతి దినము నొక
క్రొత్త యందకత్తియను దెచ్చి నాకర్పించుచు వారుక.
నా మనంబున నొక చిత్తరువును వ్రాసికొని, దానిని వర్ణించి
యట్టి యందకత్తెను దెమ్మని రెండు వేల మొహరు లీ
జామోత్రి కిచ్చితిని. కొన్ని నెలలనుండియు వెదకుచు ని
నాఁటికి నేఁ దలంచిన వన్నెలాడిని దల దన్నిన యన్నుల
మిన్నను నిన్ను దెచ్చి నన్ను ధన్యుని జేసినది. నీవు నామాన్య
వైనను బరకీయ వైనను నేను స్వీయగానే పరిగ్రహించె
దను. నీవు నన్నను గ్రహించితి వేని యీ వృత్తి నేఁటి
నుండియు విడుచుకొని నీకూటమియే పరమార్థముగా నెంచి
సుఖం బుండెదను. కామికి నీవు చెప్పిన చొప్పు కడుఁ గడు
విరుద్ధ ధర్మము. ఇచ్చటికి వచ్చిన నిన్ను దప్పించుట కీ ప్రపం
చమున నెవ్వరికిని శక్యము గాదు.

వీర: తండ్రీ! ఏల యూరక యతిభూమిం గతుఁడ వయ్యె
దవు? ఏ వృత్తియందున్నను నరుఁడు యుక్తాయుక్త
ములను విచారించి మెలంగ వలయును. మాంసము
తినిన దుమ్ములు మెడఁ గట్టుకొని తిరుగ వలయునా?
నీ యైశ్వర్యమును గాని, నీ యధికారమును గాని, నీ
జీవితమును గాని భంగ మొందనీయక మెలఁగుట
వివేకి వగు నీ కుచితమే కదా! నేను బతివ్రతను

గావున నన్ను మన్నించి విడుచుట పెక శ్రేయ
స్కరము.

బాలాజీ: శాబాస్! వారు నేను. పతివ్రతవా నీవు! పతివ్రతలు
పురాణ భాషా ప్రపంచమున నున్నారే కాని మనుష్య
ప్రపంచమున నెం దున్నవారు? కేవల మది నామ
మాత్రమే కాని వ్యక్తి మాత్రము కాదు. ఎందులకు
నన్ను బెలుపుచ్చ నెంచెదవు? నీ నగలాడితనమును
గట్టి పెట్టి దారికి రమ్ము. నే నెన్నియో మిట్టివి
తిలకించి యున్నాడను.

శీల: తండ్రీ! అలాగున ననరాదు. ఈ ప్రపంచమున లేని
వస్తువు భాషా ప్రపంచమున నెట్లు లుండును? పరికించి
చూచిన నెట్టివారును నిం దున్నవా రని తెలిసికొన
వచ్చును. నన్నిట్టి తులువమాట లాడి నొప్పించుట
నీవంటి యుచితజ్ఞునకుఁ దగదు. నీకుఁ దోఁబుట్టువులు
లేరా? వా రీ మనుష్య ప్రపంచములోనివారు కారా?
వారిలో నే నొక తె ననుకొనుము. లేకుండిన నేనే
నీతోఁబుట్టువు ననుకొమ్ము. నా హృదయ మెంత
యలజడి పడుచున్నదో పరమేశ్వరునకే యెఱుక.
చేతులు మోడ్చి నిన్ను వేఁడుకొందును. అన్నా!
కరుణించి నన్ను విడిచిపెట్టుము.

బాలా: నీవు హిందూసుందరివి. నేను యవనుఁడను. నీవు
నాకుఁ దోఁబుట్టు వెట్లు కాఁగలవు? ఎట్లును నీవు నా
చేతిలోఁ జిక్కితివి. ఇంకఁ గొంత తడ విచ్చినాఁడను.
నీ బుద్ధి మరలించుకొని నన్ను సంతోష పెట్టుము. తరు
వాత నీ యిష్టము వచ్చినచోటికి నిన్నంపెదను.

వీర: సోదరా! నామాట వినుము. మతములనను దేవుఁడనను నామములచే భేదములు గాని, నియమములు గుణములు నొక్కతీరు గలవే. నేను నీచేతిలోఁ జిక్కినంతలో నీకుఁ దక్కుదు ననుకోకు. అంతటి గౌరవమును గాపాడువాఁడు దేవుఁ డొకఁడు కలఁడనుమాట మఱచిపోరాదు. దుష్ట శిక్షణము వాని కర్తవ్యము. నీవు దుష్టుఁడవు కాకుము. నేను పతివ్రతనుగాన ప్రాణములు విడిచెదను; కాని యన్యథా ప్రవర్తింప నొల్లను. నన్నిట్టి యిక్కట్టు పెట్టుట నీకుఁ బాడి కాదు. పరదారలను గోరుటయే మహాపాతక మనఁ బతివ్రతమాట చెప్పెడిదేమి? ఎట్టి బలవంతుఁ డయినను నిష్టము లేని పరకాంతలను బట్టినట్టి దుష్టుఁడు తప్పక నశించును. కావున నా మాట పాటిచేసి నీ బుద్ధి మరల్చుకొని నన్ను నా పతితోఁ గూర్పుము. నీకు మేలు కలుగును.

లాలా: "నీ మాటల కర్థమే లేదు. ఇంత ధనము వెచ్చించి యింత ప్రయాసపడి యిట్టి వగలాఁడిని సంపాదించియు దానిం బొందక విడుచువాఁడు వెదురుగాక వెఱవరి యగునే? నీవయి వలచి వచ్చినచో సౌఖ్య మనంత మని యెంచుచుంటిని; కాని నిన్ను స్వాధీనము చేసికొనలేక కాదు. నీ వయి నవ్వునవ్వుచు వచ్చి నాకోర్కి తీర్తువా? లేక నేను జేయిచేసికొన వలయునా?" అని (చేయి చాఁచును).

వీర: (కొంచెము కోపముతో) అన్నా! నీకు వినాశకాల

మానస్సు మారినట్లు లున్నది. నే నెంతచెప్పినను నీ బుద్ధి వెడతలనుండి తిరుగకున్నది. నేను క్షత్రియ కాంత నని మఱచెదవా?

బాలా: (పకపక నవ్వి) చాలునే కులటా! నీ టక్కులును బెదరింపులును గట్టిపెట్టుము. నాయొద్ద............ అను నధోక్తిలో "కులటా" అను సంబోధనము చెవుల సోకి నంతనె వీరావేశ పరవశ యయి యాక్షత్త్రియ పుత్త్రికామణి జడాలున గుప్త చ్ఛురికను దూసిపట్టి మహాశక్తి మహిషాసురుని వధించినట్లు లా నీచునికంఠ మం దాఛురికతో బలముగాఁ బొడిచి హృదయము నుండి నాభివఱకుఁ జీల్చి వధించెను. నోటిమాట నోట నుండ న ద్దురాత్ముఁడు కర్మకుఁ దగినఫలము వెంటనే యనుభవించెను. 'అత్యుత్కటైః పుణ్యాపాపై రిహైవ ఫల ముచ్యతే' అను నార్యోక్తి యబద్ధ మగునా? వాని నట్లు చీల్చి క్రిందఁ ద్రోసి, యా కోప వేగమున నుగ్రరూపిణి యై వీరమతి, యా ఛురికతో మొండెమును దుండమును వేఱగునట్లును, శరీరము ఖండఖండము లగునట్లును నఱికి వాని వస్త్రములతో వాని యవయవములఁ గట్టి మీఁదనున్న చిన్న ద్వారముగుండ రాజవీధిని బడునట్లు పడవైచెను. ఆ రౌద్రావేశములో నామె జుట్టు వీడిపోయెను; కన్నుల నిప్పు లొలుకుచుండెను. పైట కొంగు నడుమునకుఁ జుట్టుకొని ఖడ్గమును సరిచేసి చేతను ధరించి పటపట పండ్లు గొఱుకుచు భయంకరమూర్తి యై వీరమతి, మహిషాసుర మర్దని

యగు మహాకాళి ననుకరించి యుండెను. శాత్రవ
రసము పూర్ణముగ స్త్రీరూపము నొందినట్లు శోభిల్లు
చుండెను. దుష్టరాక్షస హృదయంబు తనివి సనక
యెదురు చూచుచుండెను.

వహవా! తల్లీ! నీవు నిజముగు రాజపుత్త్రికవు! వీర
స్త్రీలయెడల నబల యనునామమున కతిబల యనునర్థము
కల దని ప్రత్యక్షము కావించితివి. నీవు ధన్యవు! నిన్ను
గన్న తల్లిదండ్రులును ధన్యులు! జగజ్జనని భారతమాతయు
నీవలన ధన్య యయ్యెను.

---

పంచదశోల్లాసము

# యోగి - ముసలిది

వారాణసీ నగరము పుణ్యక్షేత్రములలో నుత్తమ
మయినది. అన్నపూర్ణా సనాథుం డయి విశ్వనాథుండు
విహరించుట కిది యానందవనము. దీనికి మహాశ్మశాన మని
మఱియొక పేరు గలదు. ఈ మహాశ్మశానమున నెవ్వఁడు
మేనుదొఱఁగినను విశ్వనాథుఁడు వానికిఁ దారకమంత్రము
నుపదేశించి తనసాహాయ్యము నొసంగి రక్షించునఁట. భువన
పావని యగు గంగామహాదేవి, నదీరూపమున నుత్తర
వాహిని యై, పరమేశ్వరుని సేవించుచుఁ, దనయం దొక్క
సారియైనఁ గ్రుంకులిడినచో మహాపాతకి నైనను మహా
మహునిగఁ గావించి, యీశ్వర ప్రసాదార్హునిగా నొనరించు
నఁట. అఱువది నాలుగు ఘట్టముల నొరయుచు నశీ వరుణాల

మధ్య ననంత తేజోమయం బయి వెలయుచున్న మహామాత గంగాభవాని నొక్కసారి మనస్సునఁ దలఁచినను, నొక్కసారి 'గంగే మంగళతరంగిణి!' అని స్మరించినను నొక్కసారి కన్నుల కఱవు దీఱఁ గాంచినను దాపత్రయ పీడలు తొలంగి మనుష్య ప్రకృతి కృతకృత్య మగును. ఉషఃకాలమున లేచి నిత్యకృత్యములం దీర్చుకొని, యరుణోదయమున తైర్థికుల మధుర మధురము లగు నీశ్వరప్రార్థనలను జెవులార వినుచు, ననంతశక్తియు నిర్మలజలపూరితయుఁ బరమపావనియునగు భాగీరథీ నదిలో స్నాన మాచరించి, యరుణకిరణ ప్రభాభాసమానం బగు బాల భాస్వంతు నుపాసించి, విభూతి రుద్రాక్షమ్ములను ధరించి భక్త గణములతోఁ బ్రత్యక్ష కైలాస విలాస మందిర మ్మగు నిందుశేఖరుని మందిరమున కేగి నిందువేడుక ధుండిని గొలిచి ''హరహరమహాదేవ గంగాధర'' అను పవిత్రనామము నుచ్చైస్స్వరమున జపించుచుఁ బరమేశ్వరు నభిషేకించి పూజించి, యన్నపూర్ణాదేవి నారాధించి, యది మొదలు జరుగు నిత్యోత్సవముల నాలోకించుచు మహానందమున లీన మగుచుండువారికి సంసార జంజాటముల బాధలు తలంపువాఱవు. మరల సాయాహ్నమున నదే విధానముగ విశ్వేశు సన్నిధికి వచ్చి యచ్చట జరుగు సప్తర్షి పూజాదికములను గాంచిన, జన్మమెత్తినఫలము నొందవచ్చును.

ఈ వారాణసీ నగర మైదుక్రోసుల దూరము వైశాల్యము కలది. ఇందలి మేడ లాకసము నంటుచుండును. ఆ మేడల యందలిదీపములు, నక్షత్రములును రాతిరివేళ నొక్క రూపము నొందుటచేఁ జూచువారి కేవి దీపములో; యేవి

నక్షత్రములో యొకటిగ గాకుండును. ఈ క్షేత్రమ్మునఁ
బెద్ద రాచబాట లంతగా లేవు. గల్లీ లపరిమితములు. పట్టణ
మంతయు జాహ్నవీ తీరమునఁ గట్టఁబడి యుండుటచేతను,
నదికి సమీపమున నుండుటకే యెల్లరును గోరుటచేతను
బట్టణము క్రమక్రమముగ విరివి యగుటకంటె మేడలపాడు
వెక్కువయ్యెను. ఉత్సవాదులలో నీగల్లీలలో నిసుక వేసిన
రాలకుండ భక్తజనమ్ముల సమ్మర్ద మెక్కువగ నుండును.

నేఁడు ఫాల్గుణకృష్ణైకాదశి. ఉదయముననే స్నాన
మొనరించి, విభూతిరుద్రాక్షులను ధరించి, బిల్వపత్రములను
సుగంధపుష్పములను గంగాజలమ్ములను బట్టుకొని యీశ్వరు
నారాధింప నెల్ల రరుగుచున్నవారు. ఇట్టి యానందమయ
మగు నుదయమ్మున సుమారైదారు గడియల ప్రొద్దెక్కిన
తరువాతఁ బాడుపడి యున్న యొక మేడ గుమ్మముకడఁ గూరు
చుండి యొక ముసలి రోదనము చేయుచుండెను. ఈ
మేడ నదీ ఘట్టములకుఁ గొంతదూరముగా నుండుటచేత నీ
ముసలిదానిగో డాలకించువా రంతగా నా వీధి నెవ్వరును
లేకుండిరి. పాడువడి యున్నను నామేడ కొన్నిసంవత్సర
ములక్రిందట మంచి స్థితియం దుండి ధనాఢ్యులకుఁగాని,
యున్నతోద్యోగులకుఁ గాని వాసస్థలమై యుండె నని విశాలో
న్నత్యములచే సూచించుచుండెను. ఆమె యెవ్వతెయో
యెందుల కట్లు గుమ్మములోఁ గూర్చుండి కంటికి నేలకు
నేక ధారగా నేడ్చుచున్నదో తెలియదు. ఆ వీధివెంబడిఁ
గొందఱు వచ్చుచుఁ బోవుచు నున్నారు; కాని యామె
నోదార్చువా రెవ్వరును గానరారు. వయస్సుమళ్లిన కొందఱు

స్త్రీలును బురుషులును నామెరోదనము నాలకించి పి
వెంబడిం బోవుచు "అహా హా! ఈ ముసలికి నెంతగతి పట్టినది?
పాపము! ఈ యవ్వ యెంత కృతజ్ఞురాలు" అని కొంచెము
తడవు విచారించి పోవుచున్నారు. కొందఱు పల్లెటి పిల్లకాయ
లా వృద్ధురాలిం గని, నవ్వుచుం బరిహసించుచుండ పెద్దం
బోవుపెద్దలు "ఆ దీనురాలిజోలి మీకేలరా? పొండు
పొండు" అని గదిమి కూకలువేసి పోవుచున్నారు. ఇట్టి
సందర్భమునం బన్నిద్దఱు బోయీ లొక చక్కని పల్లకిని
మోసికొని యా వీధిని వచ్చుచుండిరి. ఆ పల్లకికి నలువలం
కుల నాయుధపాణు లగురాజభటు లతిజాగరూకతతో
నడచుచున్నవారు. ఆ మేడవాకిటికిం బల్లకి వచ్చెను.
లోపలినుండి యొకవ్యక్తి 'కొంచె మాఁగుఁడు' అని
ప్రక్కను నడుచు వాని కాజ్ఞాపింప నతఁడు బోయీల కాజ్ఞ
నెఱింగించెను. పల్లకి యాగెను. "ఆ వృద్ధురా లెవ్వతె? ఏల
యేడ్చుచున్నది? కనుఁగొనుము" అని యొకని కంచలి
వ్యక్తి యాజ్ఞాపింప నతఁడు గుమ్మమెక్కి "అవ్వా! నీ
వెవ్వతెవు? ఈ మేడకడఁ గూరుచుండి యేల యేడ్చెదవు?"
అని యడిగెను. ఆమె, కన్నులు తుడుచుకొని దృష్టి
కవరోధమును గలిగించు వెలుతురున కడ్డముగ నుదుటిపైని
గరతలమును గొడుగుబట్టి తన్నడుగువాఁడు క్రొత్తవాఁడని
తెలిసికొని దుఃఖోద్రేకముచే మాటరాక రెండవచేతి
వ్రేళ్లతో "నా నుదుటివ్రాఁత" యని సన్నచేసి మరలం
గన్నీరుపెట్టుకొనెను. ఇది యంతయును బల్లకి కిటికీ సందుల
నుండి కాంచుచున్న వ్యక్తి "గోపాల! నీ వామె యుదంత
మును సమగ్రముగఁ దెలిసికొనుము. నే మీశ్వరుని

దర్శించి యింతలో వచ్చెదము'' అని చెప్పెను. వాఁడు. ''చిత్తము'' అనెను. పల్లకి సాగిపోయెను. గోపాలుఁ డెంత యడిగినను నోదార్చినను బ్రతిమాలినను ముసలిది మాత్రము తన యుదంత మిసుమంతయు నతనికిం జెప్పలేదు. ఇంతలోనె పల్లకి తిరిగివచ్చెను. ''ఏమయ్యెను'' అని లోనివ్యక్తి యడిగెను. ''ఏమియుఁ జెప్పకున్నది'' అని గోపాలుఁడు బదులుచెప్పెను. ''సరియే. మా యాజ్ఞ యయిన దని మంచి మాటలతో నామె నెట్లయిన మన బసకుఁ దీసికొని రమ్ము. లేకున్న మఱి మువ్వురను తోడు చేసికొని యామెను గట్టి తీసికొని రమ్ము'' అని మరల నా వ్యక్తి యానతిచ్చెను. ''చిత్తము'' అని మువ్వురు రాజ భటులను దనతో నుంచుఁ డని గోపాలుఁడు చెప్పెను. పల్లకి వెడలిపోయెను. అవ్వ యీ సమాచార మంతయును జూచి, వారి యుద్దేశమును దెలిసికొని రోదనమును జాలించి వారి వెంట మెల్లమెల్లన గట్టి యూఁతగొని నడచుచు వారి బసకు వచ్చెను. ఆమెను భటులు మీఁది మేడలోనికిఁ దీసికొని పోయిరి. అచ్చట నొక కృష్ణాజినముపై నొక బాలయోగి కూర్చుండియుండెను. ఆ యోగిదగ్గఱకే యవ్వను దీసి కొనిపోయి కొంచెము దూరములోఁ గూర్చుండఁబెట్టి పరిచా రకులు క్రింది యంతరవున కరిగిరి. అప్పు డా బాలయోగికిని ముసలి యవ్వకు నీ క్రిందివిధమున సంభాషణ జరిగెను.

యోగి: అవ్వా! నే నడుగుమాటలకు దాఁపక నీవు బదులు చెప్పుచుండ వలయును. నీ విచారమును బోఁజేయ నేను నిశ్చయించుకొంటిని.

అవ్వ: అయ్యా! మీ రెవ్వరు? ఈ యూరి కేలవచ్చితిరి? నా

విచారమును బోఁజేయ మీ రేల నిశ్చయించు కొంటిరి? దయచేసి యీ మాటలకుఁ బ్రత్యుత్తరము నొసంగుఁడు. నా యుదంతమును దరువాత సమగ్రముగ మనవిచేసి కొనియెదను.

యోగి: అవ్వ! నాపేరు సదానందయోగి, విశ్వనాథుని సేవించుటకై యీ యూరికి వచ్చితిని. దీన జనమునకుఁ జేతనైనంతవఱకు నుపకారము గావించుటయే నా ముఖ్య వ్రతము; కావున దీనురాల వగు నీ విచారమును బోఁ జేసెద నంటిని. నీ వృత్తాంతము చెప్పుము.

అవ్వ: మహానుభావా! మిమ్ము జూచినంతనె నా మనోవ్యాధి కొంత చల్లారెను. మీ మాటలు వినినంతలో నది నిశ్శేష మయ్యెను. దీనజన పరిపాలకుం డగు విశ్వనాథుఁడే మీ రూపమున వచ్చె నను నమ్మకము నా కొదవినది. కావున నా యుదంత మెఱింగించెద వినుండు. "ఈ మహా నగరమును బరిపాలించువాఁడు జయంతచంద్రుఁ డను రాజు. వీరి వంశీయుం డయిన పరిపూర్ణచంద్రుఁడు వీరిమంత్రి. ఆ మంత్రిగారి భార్యను శిశుతతనమ్మున నుండియుఁ బెంచిన దానను నేను. నన్నామె తల్లివలెఁ బ్రేమించి పోషించుచుండెడిది. నా యభాగ్యవశమ్మున నామె తన ముప్పది రెండవ వత్సరమునఁ బరలోకమున కేఁగెను. నా కామెయెడలఁ గల వాత్సల్యముచే వెన్వెంట నేనును జావ వలసినదాననే కాని ప్రాణము వోవునప్పుడా నా బిడ్డ, కన్నులనీరు గ్రమ్మ

గద్గద స్వరముతోఁ దనబిడ్డల నిరువురను జూపి 'యీ పసికూనల నెట్లు పెంచెదవో తల్లీ! నీదే భార' మని చెప్పి యొప్పించెను. (అని చెప్పి యాయవ్వ కన్నుల నీరు పెట్టుకొనెను.)

యోగి: అవ్వా! హృదయమును పదిలపఱుచుకొమ్ము. సాంతముగ వృత్తాంత మెఱింగింపుము.

అవ్వ: తండ్రీ! అది యేమి ప్రేమానుబంధమో కాని యామెను దలంచుకొన్నప్పుడు నా హృదయము నీరగుచుండును. ఆ బిడ్డ లిరువురిలోఁ బెద్దవాఁడై దేండ్లవాఁడు. చిఱుతబిడ్డ రెండేండ్లబాలిక. చిన్నప్పటి నుండియు వారిని నేనే పెంచుచుండుటచేత మాతృ వియోగ మా పిల్లల నంతగా బాధింప దయ్యెను. వారి యాటపాటలలో మునింగియున్న నేనును నా బిడ్డ వియోగమును మఱచితిని. కొన్నియేండ్లు గడచెను. పరిపూర్ణచంద్రుఁడు, నలువది వత్సరముల యీడున నుండియు భార్యయందలి మోహముచేత మఱి వివాహము చేసికొనక బ్రహ్మచారిగానుండి రాజ్యతంత్రములను ధర్మయుక్తముగ నడుపుటయందును, బరమేశ్వరుని ధ్యానించుకొనుటయందును గాలమును గడపుచు ముద్దుబిడ్డలను జూచుకొని సంతసించువాఁడు.

ఇట్టి సమయమున మంత్రిగారి చెల్లెలును మఱఁదియు నొకనెలలో వ్యాధిగ్రస్తులయి చనిపోయిరి. వారికి నిరువురు బిడ్డలు గలరు. పదునేను వత్సరములవాఁడు కొమాఁరుఁడు. పండ్రెండేండ్లది యాఁడుపడుచు. వారికి సంరక్షకు

లెవ్వరును లేకుండుటచేతఁ బరిపూర్ణచంద్రుఁడు వారిం దోడ్తెచ్చి సమాన వయస్కులగు తన బిడ్డలతో సమానముగఁ జూచుచుఁ బోషించుచుండెను. మగపిల్ల లిరువు రొక్క యీడువారు. ఆఁడు పిల్ల లిద్దఱు నొక్కవయసు వారు. రూపమునఁ జదువున నామున గుణమున నొకరి నొకరు మీఱి యున్న వారిం గాంచినఁ గన్నుల పండువుగా నుండెడిది. వారి కన్యోన్య మనురాగము ఉదయించి యొకటిరెండు సంవత్సరములలో బలపడెను. మంత్రియు వారి యనురాగములం గాంచి యెంతయు సంతోషించి వారి వారికిఁ బరిణయము గావింపవలయు నని యెంచి యుండెను. ఆ నలువురును వృద్ధబాల నగు నా యం డెంతయో ప్రేమగల వారయి యుండిరి.

ఇట్టు లుండఁగా నొకనాఁటిరాతి రేమిబుద్ధి పుట్టెనో కాని, పదునాలేండ్ల యీడున నున్న బాలకు లిరువురును నెరికిం జెప్పక చెరి యొకగుఱ్ఱము నెక్కి వలసిన ధనముం గైకొని యెచ్చటికో వెడలిపోయిరి. వారశ్వారూఢులై పోవుచున్నట్టులు మఱునాఁడు తెలిసినది కాని, యెంత వెదకించినను వారుమాత్ర మగుపింప రైరి. పరిపూర్ణచంద్రుఁడు వారి విరహముచే నానాఁటికి క్షీణచంద్రుం డగుచుండెను. ఆ బాలికల యవస్థలు చెప్పనలవి కావు. ఇట్టు లొకనాలుగేండ్లు గతించినవి. ఒకనాఁడు బాలిక లిరువురును బూలతోఁట కరిగి వాడుకచొప్పున సాయంత్రమున కింటికి వచ్చువారా నాఁడు రారైరి. మంత్రి యూరంతయును వెతకించెను; గాని వారిజాడ యేమియును దెలియదయ్యె. మఱునాఁడు విశ్వాసి యగు నొకరాజభటుఁడు వచ్చి మంత్రిగారి

చెవిలో నేమియో మెల్లగా చెప్పెను. ఆ మాటలు విని
నంతనే మండిపడి మంత్రి యొడలు దెలియక ‘‘రాజున కింత
పొగరా! వీని కండకావర మణంగించెదను జూడుము’’ అని
పెద్దపెట్టున కేకపెట్టెను. అప్పుడే రాజాజ్ఞ యగుచున్నదని
మంత్రిని బిలుచుటకై యొకభటుండు వచ్చియుండెను. వాఁడీ
వృత్తాంతమును గ్రహించి వెంటనే వెడలిపోయెను. వాఁడు
వెడలిన యొక గంటలో విచ్చుకత్తులతో రాజభటులు
పరివేష్టింప నశ్వారూఢుండై రాజు వచ్చి హఠాత్తుగ
సపరివారముగ లోనం బ్రవేశించి, విచారసాగరమ్మున
మునింగి యొడ లెఱుంగక యున్న మంత్రిపైఁ బడి కొట్టి
పెడరెక్కలు విఱిచికట్టించి బలవంతముగ నీడ్పించి తీసికొని
పోయి కారాగారమునఁ బడవైచెను. నా తండ్రీ! ఇంక
నే నేమి మనవి సేయ గలను? నేఁటికి నాతఁడా కారాగా
రమ్ముననే యున్నాఁడు. మంత్రితో రహస్యము చెప్పిన
రాజభటుండు నన్ను గనికరించి తనయింటఁ బెట్టుకొని
పోషించుచున్నాఁడు. రా జొనరించిన దుష్కృత్యమునకై
యూరివా రెల్ల రసంతృప్తిగ నుండిరి, కాని మా మంత్రి
గారి తమ్ముఁడు అరిభీకరుఁ డనువాఁడుమాత్ర మప్పుడు
పొంగిపోయెను. వెంటనే వానికి సర్వసైన్యాధిపత్యము
వచ్చెను. కడచిన సంవత్సరము మారాజుగారు గౌడ
దేశముమీఁద దండెత్తిపోయి పరాజయమొందిన యుద్ధ
ములో నద్దురాత్ముఁడు చచ్చెను. అప్పటినుండియు జయంతి
చంద్రుఁ డహంకారముతో యుద్ధసైన్యములను గూర్చు
చున్నాఁడు. దుర్మార్గుఁ డగు నీ రాజునకే చేటును మూఁడ
నున్నది. స్వామీ మఱి యేమి చెప్పఁగలను? నే నిందాక

కన్పించి చూపుచుండినదే మా మంత్రిగారి భవనము. రెం డేండ్ల క్రిందటి యీ యేకాదశీ దినముననే మంత్రి ని కర్కోటక రాజు కారాగారబద్ధుని గావించినాఁడు. ఆ మాట తలంచుకొని యీ నాఁ డిట్లు ఏడ్చుచున్నాను. బాబా!

కేమియు నక్కఱలేదు గాని నా నలువురు బిడ్డలు బ్రతికి యున్నచో నొక్కసారి చూచి యీ నా ముండ ప్రాణము లను విడిచిపెట్టవలయు నని యుంటిని. మీరు పుణ్యా త్ములు. మీ దర్శనము లభించెను. నా విచారమును తొలఁ గింప ప్రతిజ్ఞ గైకొని యున్నవారు గదా! మంత్రిగారిని కారా గారమునుండి విడిపించుట యొకటి, నేను పెంచిన బిడ్డలను నాకు చూపించుట యొకటియు, తమ ప్రతిజ్ఞను బూరించు కొను పనులు. తరువాతఁ దమచిత్తము" అని యా యవ్వ దీనవదనయై కన్నుల నీరు నిండ సాష్టాంగముగ నబ్బాల యోగీంద్రుని పాదములపైఁబడి మ్రొక్కెను; ఆ పాదములను కన్నుల కద్దుకొనియెను; ఎప్పటికిని లేవకుండెను. యోగినికి నేత్రము లశ్రుపూరితము లయ్యెను. అతఁడు "గోపాల" అని పిలిచెను. 'చిత్తము' అని గోపాలుఁడు రాఁగా వానిం జేరఁబిలిచి చెవిలో నేమియో మెల్లగ వచించెను. 'చిత్తము' అని వాఁ డరిగెను. అవ్వను లేవనెత్తి "అవ్వా! నీ కోరికలు రెండును బూర్తి యగును. నిన్ను బోషించుచున్న రాజ భటుఁ డిప్పుడు కొలువున నున్నాఁడా? వానిని నా దగ్గఱకు తీసికొని రాఁగలవా?" అని యోగి యడుగ "ఇప్పుడు కాదు. సాయంత్ర మాతఁ డింటికి వచ్చును. తొమ్మిది గంటలకు భోజనము చేసి మరల కారాగారమును గాచుట కేగును. కావున నేడు గంటలకే మాపు తమ దరిసెనము

నకు వానిం గొట్టెచ్చెదను" అని యవ్వ బదులుచెప్పెను. బాలయోగి సంతోషించి "అమ్మా! నీ భక్తి విశ్వాసము లెంతేయుం గొనియాడఁదగినవి. కావున నింక రెండు మూఁడు దినములలో నీ కోర్కె కొంతవఱకు సిద్ధింపఁ గలదు. ఈ మూఁడు దినములలోఁ దక్కిన భాగమును బూర్తి యగుటకు సందియము లేదు. ప్రొద్దు పోయినంతనే యా రాజభటుని దీసికొని రమ్ము" అని చెప్పుచుండ, గోపాలుఁడు తటాలున వచ్చి మ్రొక్కి తలవంచి నిలుచుండెను. యోగియు "అప్పట్టు లవ్వా! నీ బిడ్డలలో నాఁడు బిడ్డల పేరు లేవియో నీకుఁ దెలియునా?" అన "స్వామీ! తెలియ కేమి? మా మంత్రిగారి కూఁతురు హేమాంగి, మేనగోడలు కనకాంగి." అని యవ్వ బదులుచెప్పెను. "అటులా! సరియే. అవ్వా! నీవు కన్నులు మూసికొని విశ్వనాథునకు, నన్నపూర్ణకును మ్రొక్కి నీ బిడ్డలను బిలువుము. మాతము వారు నీయెదుట నుందు రేమో" అని యోగిరాట్టనియెను. ఆ విధముగానే యవ్వ నిమీలితనేత్రయై, కరమ్ములు జోడించి విశ్వనాథునకు మ్రొక్కి "హేమాంగీ! కనకాంగీ!" అని పిలిచెను. అవ్వ కన్నులు విప్పుసరి కెదుట నిరువురు జవ్వనులు నిలుచుండిరి. వారిం జూచి యవ్వ తన కన్నులను నమ్మలేక పోయెను; మరలఁ గన్నుల మూసికొని తెఱచి చూచెను. వారే పొడఁగట్టిరి. "అమ్మలారా! మీకు నిజముగ నా బిడ్డలే యైనచో నన్నొక్కసారి కౌఁగిలించుకొనుం" డని యవ్వ పలుక "అమ్మా! కాడి! మమ్ము మఱచితివా?" అని యా పడుచు లామెం గౌఁగిలించుకొనిరి. ఆమె యానంద సాగరము దేలెను. యోగి నవ్వెను.

షోడశోల్లాసము

# పాతివ్రత్య ప్రభావము

తెల్లవాఱు జామున అణహిలపురవీథిం జనుదెంచు నొక రాజభటునకు లాలాక్షి శరీరపుఁ దునుకలు గల మూట కనఁబడెను. రక్తముచేఁ దడిసియున్న యా మూట యొక పెద్ద మాంసపు ముద్దవలె నుండెను. ఆ మూట జామోతీ గృహద్వారముకడ నుండుటచే వాఁడు బెగ్గడిలి పరుగు పరుగున నరిగి తన యజమానున కా సంగతి యెఱుంగఁ జేసెను. ఠాణాయందుఁ గల కొందఱు రాజభటులతో నా యధికారి జామోతీ గృహమ్మున కరుదెంచెను. ఆ మూటను విప్పి చూచెను. అందులో ముండిత మగు లాలాక్షి శిరమ్మును గాంచి వాఁడు విభ్రాంతుఁ డయ్యెను. అది పట్టించుకొని యతఁడు కొత్వాలునింటికిం జని యాతని లేపి సమాచార మెఱింగించెను. కొత్వాలు క్రోధ శోక దందహ్యమానుఁడయి జామోతి యింటికి సపరివారుం డయి వచ్చెను. అప్పటికి దెల్లవాఱెను. ఆ కలకలమును విని జామోతి పరిచారిక లామెను మేలుకొలిపిరి. ఒకదాసి నంపి యా వృత్తాంతము నెఱింగి యామె నిశ్చేష్టిత యయ్యెను. లోనికి వచ్చి ప్రళయకాల రుద్రుని వలె మండిపడు కొత్వాలుకాళ్లపైఁ బడి యామె జరిగిన సమాచార మాద్యంత మాతని కెఱింగించెను. కొత్వా లా గదిచెంత కరిగి తలుపు తట్టెను. ఎవ్వరును బలుకలేదు. గోడలోని కవాటముం దెఱచు పద్ధతి

వారి కెవరికిని దెలియకపోయెను. ఎంత పిలిచినను వీరమతి తలుపు తీయలేదు. కొత్వాలు వీథిలోనికి వచ్చి నిచ్చెనలు రెండు పెనవేయించి కట్టించి, "మీఁది చిన్న ద్వారము గుండ లోనికిఁ దిగి యా కులటను ముక్కముక్కలుగ నఱికి నాకుఁ జూపుఁ" డని భటుల కాజ్ఞాపించెను. ఒక భటుఁ డాతని యాజ్ఞ నౌదల ధరించి ఖడ్గమును బట్టుకొని నిచ్చెనపై నుండి మీఁది ద్వారముచెంత కరిగెను. ద్వారముగుండ తలదూర్చి వాఁడు చూడఁబోవునంతలో రౌద్రరూపిణి యగు వీరమతి వాని తల నఱికెను. మొండెము వీథిలోఁ బడి యెను. కొత్వాలునకు క్రోధ మినుమడించెను; "ఒకరి వెనుక నొకరుగ నిశ్రేణీ మార్గమున లోని కరుగవలయు" నని భటుల కాజ్ఞ యిచ్చెను. ఒకఁడును బోవ సమకట్టకున్నం తలో మండిపడి యతఁ డొక భటుని ఖడ్గముతో నఱికి, "మిగిలినవారైనఁ బోయెదరా లేదా? లేకున్న వీని గతియే మీకును బట్టు" నని కన్నుల నిప్పులు రాల నఱచెను. వాని రూపమును జూచి భయపడి భటులు, యొకనివెనుక నొకఁ డుగ నిచ్చెన నెక్కసాగిరి. మొదటివాని తల గదిలోఁ జొచ్చు నంతలో మొండెము క్రిందఁ బడియెను. భటులును వెను దీయక చొఱఁబడఁ బ్రయత్నించిరి. అందఱి మొండెము లును వీథిలోఁ బడుచుండెను. ఇట్లు పదిమంది భటులు వీరమతి ఖడ్గమున కెర యయిరి. ఊరెల్ల నీ యుదంత మం తలో నల్లుకొనెను. ప్రజలు గుంపులు గుంపులుగాఁ గూడు చుండిరి. రాజుగారికిఁ గూడ తెలిసెను. భయ మంది య తఁడు పాదచారియై యచ్చటికి వచ్చెను. భటులను వారిం చెను. సంగతి నంతయును దెలిసికొని తానే నిచ్చెన నెక్క

ద్వార సమీపమునకు వచ్చి, అమ్మా! "నే నీపుర మేలువాఁడను. నాపేరు సిద్ధుఁడు. నీకేమియును భయము లేదు. లోపలి తలుపు తీయుము. నీ పాతివ్రత్యమునకును వీరత్వమునకును నచ్చెరు వందితిని. నీ వాదిశక్తివలెఁ గోఁచుచుంటివి. నా తెలివి లేమిని క్షమించి తలుపు తీసి నీ యుదంతము నెఱింగింపుము" అని వినయ విధేయుఁడై పలికెను. "నా భర్తగారే యూరనే యున్నారు. ఆయన ముఖము నాకగుపించు నేని నేను దలుపు తీసెదను. అంతవఱకు నే నీ తలుపు తీయను. బలవంతముగఁ జెఱచువారి కిప్పుడు నాచే నిహతులయినవారి గతియే పట్టు నని తలంచుకొనుఁడు. నా పతిని వెదకింపుఁడు" అని వీరమతి ప్రత్యుత్తర మిచ్చెను. ఆ మాటలు విని సరియే యని రాజుగారు దిగివచ్చిరి.

ఒక యువతిరత్నమును బలవంతపఱచిన కొత్వాలు గోడు కామెచే నిహతుఁ డయ్యె ననియు, నామెను జంపఁ బ్రయత్నించు పదువురు రాజభటు లామెచేఁ జంపఁబడిరనియు గ్రామములో నంతట వినవచ్చుటచే రాత్రి యంతయు నాహారము నిద్రయు నెఱుంగక తిరుగుచున్న జగదేవుఁ డది విని యామెయే తనపత్ని యయి యుండునని తలంచి యావేళ కచ్చటికి వచ్చెను. ఈ దృశ్య మంతయును జూచి "రాజా! ఆమె పే రేమియో తెలియునా!" అని యతఁ డడిగెను. "తండ్రీ! నీ వెవ్వఁడవు? ఆమె నీ పత్ని యగునేని నీవీ నిచ్చెన నెక్కి యామెతో మాటలాడుము" అని సిద్ధరాజన "సరే మంచిది" అని జగదేవుఁడు ద్వారమువఱకు నిచ్చెన నెక్కి 'వీరమతీ!' అని పిలిచెను. ఆ కంఠధ్వని నానవాలు పట్టి "స్వామీ! మీ ముఖము నొక్కసారి చూపుఁ" డని

యామె కోరెను. అతఁడును దద్ద్వారమార్గమునుండి వీర మతిం జూచెను. ఆమెయు నతనిం జూచెను; ఖడ్గమును గ్రిందఁ బాఱవైచి యేడ్చెను. భయము లేదని చెప్పి నిచ్చెన దిగి "రాజా! వీరి చండబును బో నాజ్ఞాపింపుఁడు; మన మిరువురమును లోని కరుగుదము రం" డని జగదేవుం డన, "అలాగే" యని రాజు, చూడవచ్చినవారిని రాజభటులను గొత్వాలును బో నాజ్ఞాపించి జగదేవునితో నామె యుండు గదిచెంత కరిగెను. జగదేవుండు తలుపు తట్టి పిలువ నామె తలుపు దీసి తటాలున నతని పాదములమీఁద వ్రాలెను. రాజా భార్యాభర్తల నోదార్చి బుజ్జగించి యా యూరి కొత్వాలు పని యాతని కిచ్చితి నని చెప్పి పల్లకులను దెప్పించి వారిని దన మహాలునకుఁ దీసికొని పోయెను. ఆ వీరదంప తుల నుచితగతిని సత్కరించెను. వారి యుదంత మాద్యం తమును విని యచ్చెరువంది "నాఁటకు నీవు కొత్వాలుపనిని జూచుచుండుదువు; కాని యీ రాజ్యమంతయు నీవే యేలు చుండుదువు గాక. నాకుఁ బుత్రసంతానము లేదు. ఒక పుత్రిక మాత్రము గలదు గాని యామెయు గతించినటులే యయినది. మీ రిరువురే నా సంతాన మనుకొనియెదను" అని యా సిద్ధరాజు వారి నా రీతినే చూచుచుండెను.

కొత్వాలు స్వతంత్రించి చేసినదుండగము లొకొక్కటి తెలియవచ్చుటచే నతని గారాగృహబద్ధుని గావించి రాజు, జగదేవుని కా పని యిచ్చెను. జామోతిని జన్మమున్నంతవఱకుఁ గారాగారమ్మున నుండునట్లు శాసించెను. క్రొత్తగ నొక యున్నత సౌధమును నిర్మింపఁజేసి యందు వీరమతీ జగదేవుల నుండుఁ డని కోరెను. వారును సమ్మ

తించిరి. మహారాజ్ఞియగు విశాలాక్షీ దేవియుఁ దన మేనల్లుఁడగు జగదేవుని పత్ని భార్య యగు వీరమతిని మిక్కిలి ప్రేమించి మొదట విచారించి, పిదప సంతోషించి, తనపుత్త్రికామణిం దలఁచి కంటఁదడిపెట్టెను. ఆ వీరదంపతులు నామె నోదార్చిరి. ఆమె వారిని దన సంతానమువలెఁ జూచుకొని తనమనోవ్యాధి నొక్కింత మఱవఁగల్గెను. వారు నా యూర సుఖముగఁ గాలక్షేపము సేయుచుండిరి. ఇట్లు కొన్నాళ్లు గతింపఁగ నంతర్వత్ని యగు వీరమతి యొక మగ శిశు వుదయించెను. సకలైశ్వర్యములు గలిగి సుఖముగ సతీ సుతులతో జగదేవుఁ డచ్చట నుండి న్యాయ్యముగ రాజకార్యములను నడిపించుచుండెను. అతని పరిపాలనకుఁ బ్రజ లెంతయు సంతోషించుచుండిరి. లంచములు తంత్రములు మోసములు లేకపోవుటచేత రావలసిన రాఁబడి కంటె ద్విగుణముగ ధనము వచ్చుటచేతఁ దద్రాజ్యము సర్వసంపత్సమృద్ధి నొంది యీతిబాధలు లేక వెలయుచుండెను. వీరాగ్రేసరుం డగుటచే జగదేవునిపై దండెత్తివచ్చిన రాజులు పలాయితు లగుటయు, శరణని లొంగి సామంతులుగ నుండుటయుఁ దటస్థింప నా సార్వభౌము నెదురించువాఁ డెవ్వండును లేఁడయ్యెను. రాజ్యము నిస్సపత్న మయ్యెను. జగదేవునికీర్తి దిక్చక్రముల నాక్రమించెను. రెండేండ్లు గతించినంత వీరమతి యొక యాఁడుబిడ్డ పుట్టెను. ఆ యిరువురి బిడ్డల ముద్దులలో మునింగి వా రానందమ్మున మెలంగుచు దానధర్మములు తగురీతి నొనరించుచు నలువురిలో నౌరా యనుపించుకొని సద్గుణవంతుల కుపమాన వ్యక్తులయి సుఖించుండిరి.

## సప్తదశోల్లాసము

# "బుధువా మంగళము"

నేఁడు ఫాల్గుణకృష్ణ త్రయోదశి. రాత్రి రొకజాము కడచెను. చీకటి దిక్చక్రముల నావరించి రాజ్యమేలు చుండెను. శ్రీ కాశీక్షేత్రమున గంగాతీరమున నేఁ డెంతయు సందడిగా నుండెను. గంగానదిపై దశాశ్వమేధ ఘట్టమునఁ బడవ లమితముగ దివ్యజ్యోతులచే నలంకరింపఁబడి చక్కని స్త్రీపురుషజనమ్ముచే నిండియుండెను. పెద్దపడవ లొడ్డున నుండు కట్టుకొయ్యలకుఁ గట్టబడియుండెను. అది మొదలు గంగ కావలి తీరము వఱకు నొకదానితో నొకటి బంధింపఁ బడి యలంకృతము లగు చిఱుపడవ లలరారుచుండెను. జనుల కోలాహలమునకు మేర లేకుండెను. భాగీరథీనది చల్లగఁ బ్రవహించుచుండెను. వడి యింతయును లేదు. మంచు కురియుచుండెను. ప్రవాహ మధ్యమున నొక పెద్ద పడవయు, దానికి జుట్టును బదిపంద్రెండు చిన్న పడవలును గట్టఁబడి యుండెను. ఆ తీరున సుమారు పదునైదు పెద్ద పడవలు వరుసగ, నచ్చరలను దలఁదన్ను గాయనీ మణుల తోడను, దత్సహాయులగు సారంగ మృదంగ వాద్య విశారదులతోడను, వెలుగొందుచుండెను. ఒకొక్క గుంపునకు నాలు గైదు మేళములవంతున నియమింపఁబడి పాటకత్తెలు వచ్చియుండిరి. ఆ గానాభినయములను దిలకింప వచ్చిన నాగరిక లోకము సావధానముగ నుండెను. శంపా శలాక వంటి యొక వెలబోటి సభ యెదుటికి వచ్చెను. మృదంగ

సారంగముల సుతులు మేళవించి ప్రవీణులు మీటసాగిరి. ఆ యాటకత్తె కన్నులరమూసి గొంతెత్తి శ్రుతి గలిపి హిందీ రాగమున నొక సంగతి వేసి యపురూప మగు చక్కటి నొక్కకళను జూపెను. వినువారు 'హా! హాయి! హాయి! బలే! బలే!'' అని తమచొక్కుం బాటు నెఱింగించిరి ఆ పాటకత్తె యొక టుమిరీ విసరి పాడి వారినందఱ నానంద గంగా ప్రవాహమునం దేల్చెను; తరువాత నించుక యభిన యించి మధురమధురముగ నమృత మొలుకునట్టు లొక గజలు పాడెను. ఎల్లరును గరతాళములతోం దమ యానం దమును వెలిపుచ్చిరి. ఇట్టు లొక గంటసే పైనంత నా మేళము చని మఱి యొక మేళము వచ్చెను. అందలి యాట వెలంది వచ్చి రంగమున నిలిచెను. చిక్కనం బాలుగారు నామె శరీర సౌష్ఠవము వర్ణింపం దరముకాదు. మొదటి వగలాండికంటె నీవన్నెలాండి చెన్నుమీఱియున్న దనుకొని చూపఱులు వింజమూకిడిన కరణి నిశ్శబ్దముగం దద్దాన సుధారసముం గ్రోల నిరీక్షించుచుండిరి. సారంగ శ్రుతిని గంతము మేళవించి ''హాయిరే సంయా!'' అను నొక గజలెత్తి మధ్యమము నతిక్రమించి తారకమును నింపి గలగల మని యచ్చటినుండి మధ్యమము వఱకు నారోహణావరోహ ణముల నతి త్వరిత గతిం గావించి కొంత దనుకం గమ్మచ్చు తీగవలె రాగమును లాగి లాగి యమృతవర్షమును గురియిం చెను. ఎల్లరొడళ్లు మఱచిరి. ఈ తీరునం బెద్ద పడవ కొక్కతె వంతున నాటకత్తెలు వచ్చి సభ్యుల నానంద పర వశులం గావించుచుండిరి.

ఇట్టి సమయమున గంగానదిలో దక్షిణమునుండి

యుత్తరమునకుఁ బ్రవాహము ననుసరించి దివ్యజ్యోతులతో నలరారుచు వినోదము గాఁ బొలుపొందు నొక పడవ యీ యుత్సవము దరికి వచ్చుచుండెను. ఆ పడవ నల్లంత దూరమునఁ జూచి తత్ప్రతీక్షకు లగు పురుషులు కొందఱు లేచి నిలువంబడి "మహారాజుగారు దయచేయించుచున్న వారు; త్రోవ నొసఁగుఁడు; దారియిండు" అని చెప్పుచుఁ జిఱు పడవలపై నెక్కి యెదురుకొన నేఁగిరి. ఈ యుత్సవమునకుఁ గొంత దవ్వున మహారాజుగారి పడవ నిలుపఁబడెను. ఒడ్డున నుండు కట్టుకొయ్యలకు దానిగొలుసులు తగిలించిరి. ఒకప్రక్క తెరలెత్తిరి. ఆ యుత్సవమునందుఁ గల మహాజనులు సార్వభౌముని మన్నన నొందువారు తమ తమ పడవలతో నెదురుకొని స్వాగత మొసంగి వారిని పుష్పమాలాలంకృతులను గావించి పరివేష్టించి కొలుచుచుండిరి. పుష్పకారూఢుండై మందాకినీ విహారపరతంత్రుఁడై వచ్చు త్రిదశాధీశుని ధిక్కరించు వైభవమున మహారాజుగారు ప్రకాశించుచుండిరి. మందహాస చంద్రికల వెదచల్లుచుఁ దన ప్రక్కల నున్న కోటీశ్వరులతో నా రాజచంద్రుఁడు నిష్టగోష్ఠి సలుపుచుండ నా యుత్సవమునఁ గల మేళములలో నుత్తమ మయిన మేళము రాజుగారి యెదుటికి హాజరు చేయఁబడెను. మేళకత్తె మున్నగువారు లేచి హస్తములు మోడ్చి తౌర్యత్రిక విశారదత్వమును గన్పఱుప సాగిరి. దేవవేశ్యలను దలఁ దన్ను నా గాయనీమణి తన గానమాధుర్యముచే నా కాశీనగరాధీశునిం జొక్కించెను. మహారాజుగారును దదనుచరులు నిచ్చట నీ రీతిగ నుత్సవమ్మున గాన పరతంత్రులై యొడళ్లు మఱచియుండిరి. ప్రస్తుత మీ భామహేంద్రు

నిచ్చట నానందమున మునుంగ నునిచి మనము వారికోట కరుగవలసియున్నది.

అప్పటికి రాత్రి రెండుయామములు మీఱియుండెను. గంగాప్రవాహము దరిని దప్పఁ దక్కిన నగర మంతయును సుషుప్త్యవస్థ ననుభవించుచుండెను. సాధారణముగా శ్రీ కాశీనగరమునఁ బ్రతిదినమును సాయంత్ర మగువఱకు నాగరి కు లందఱును భంగు నిషాలో నైక్యమయి యుందురు. ఉత్సవ దినములలో నింక నెట్లు లుందురో చెప్పనక్కఱయే లేదు. ఈ యుత్సవము "బుఢువామంగల్" అను నామము గలది. ఇందు గానమే ప్రధానము. గాన శ్రవణానందమును మదిరాపా నానందము మనుజులను జొక్కించుటలో నొకదాని కొకటి తీసిపోవు. వీనికి పరిణామావస్థయందే వ్యత్యా సము గలదు. ఈ వ్యత్యాసములతోఁ బని యేమి? ఉత్సవ నిరీక్షాపేక్షచే నెల్లరును భంగుత్రాగి మేనులు మఱచి గంగా తీరమున కరిగి గాన పరవశులయి యుండిరని ఫలితార్థము. కోటకావలివారును రాజుగారరిగినంత నొక్కొక్కరుగా గంగా తీరమున కేగిరి. పహరా జవానులు గూడఁ జల్ల చల్లగ జాఱిరి. పహరా కొకవృద్ధుని వంతున నిలిపిరి. వారును రెండు యామములరాత్రి మీఱుటచేఁ గునుకు పాట్లు పడు చుండిరి.

ఇట్టి సమయమున నిరువురు జవానులాయుధపాణులై సింహద్వారమునుండి యొకొక్కపహరా దగ్గఱకును బోయి జాగ్రత్త యని దెలిపి కారాగారముచెంతకుఁ బోయిరి. అందుమాత్ర మిరువురు జవాను లుండిరి. వా రేలొకో నిర్నిద్రులై దీపముల వెలుఁగున తళతళ మని మెఱయు నా

యుద్ధముల ధరించి యిటునటు తిరుగుచున్నవారు. జైలు పహరా పదిగజముల దూరమున్న దనఁగా లోని కేగుచున్న యిరువురు జవానులలో నొకఁడు నిలిచిపోయెను. పహరావాఁడు "కౌన్ హై" అని గట్టిగ నడిగెను. ... ... ... ... "కిశోరమహారాజ్" అని వచ్చుచున్నవాని నోటినుండి మాట వెడలినంత నతఁడు మాటలాడక యూరకుండెను. వెళ్లుచున్నవాఁడును బారా వానితోఁ గలసికొని యేమో మాట లాడెను; తరువాత "విశ్వనాథకో జాయ్" అని కేక వేసెను. దూరమున నిలుచుండి యున్న రెండవ జవానుగూడ వచ్చి వారిని గలిసికొనెను. కొంచెముసేపు మాట లాడిన తరువాత నొక్క పహరావాని మాత్ర మచ్చట నునిచి, తక్కిన మువ్వురు బయలుదేఱిరి. అచ్చటికి సమీపముననే యాయుధాగారమొకటి యున్నది. దాని యరుగుమీఁద నొక బల్లమంచముపై నొకఁడు శయనించి యుండెను. వానికడకే మువ్వురు నేగిరి. వారిలోఁ బహరాజవానే తనచేతి ఖడ్గముతో నక్కడఁ బండుకొనియున్న వానితల నఱికివైచెను. తుండెమును మొండెమును దక్కిన వా రిరువురును గదలకుండఁ గొన్ని నిముసములు పట్టుకొనియుండిరి. నఱికినవాఁడే పిమ్మట మొండెము మొలత్రాటికిఁ గట్టఁబడియున్న తాళపుఁజెవుల గుత్తిని మెల్లన విప్పి తీసికొని బయటికివచ్చెను. వానింగాంచి తక్కినవా రిరువురును దెగిన శిరస్సును, గబంధమును నొక మూలకు చేర్చి మొదటివానిం గలిసికొనిరి. మెల్లమెల్లఁగ నడుగు లిడుచు వారు కారాగారము కడకు వచ్చి దానితలుపు దెఱచిరి. తాళము తీసిన పహరావాఁడు ద్వా

రముకడనే నిలిచియుండెను. వచ్చినవారిలో నొకఁడు, గది లోని కేగి యందొక శయ్యపై నిద్రించుచున్న ముసలి వానిదగ్గఱఁ జేరి, తట్టి లేపి యాతని చెవిలో మెల్లగా "హేమ యును గనకమును వచ్చియున్నారు. మిమ్ము వారికడకుఁ దీసికొనిపోవ వచ్చినాను. మీరు సద్దుచేయక మా వెంట రండు. కోటదాటిన పిమ్మట వృత్తాంత మంతయును మీ కెఱింగించెదను" అని వచించెను. ఆ ముసలివాని సంతోషమునకుఁ బారము లేదు. "తండ్రీ! మీ రెవ్వరు?" అని యతఁడు వాని పాదములపై వ్రాలెను. మీ రిప్పు డేమియు ననరాదు. అవతలకు మన మరిగిన తరువాత సావ ధానముగా నంతయును మనవిచేసికొందును" అని పలికి జవా నతనిచేయి పట్టుకొని లేవనెత్తి బయటికిఁ దెచ్చెను. తనతోఁగలిసి వచ్చువాని కాయన నొప్పఁజెప్పి 'వీరిని మన బసకు మెల్లనఁ దీసికొనిపొమ్ము. భద్రము సుమీ" అని వాఁడు వారిని సాగనంపెను. తక్కినవారిని దోడ్కొని నీవును వేగముగా వచ్చెదవుగదా! అని యెచ్చరించి యతఁడు ముసలివానిం దోడ్కొని ఖడ్గము నొఱనుండి తీసి చేత ధరి యించి యతిజాగరూకుఁడై నలువలంకులం బరికించుచు సాగి యొక్కొక్కద్వారమును దాఁటుచు "ఎవరు వారు" అని యడిగినవారి కెల్ల "కిశోరలాల్, శ్యామసుందరసింగ్"అని బదులుచెప్పుచు నిలువక సాగిపోవుచుండెను. ఆ రెండు పేరులా ద్వారపాలకుల యధికారుల పేరులు. ఆ యధి కారులు గంగాతీరమున కరిగి యెంతసేపటినుండియో వినోద ములను జిత్తగించుచున్నారు. నిషాలో మునిఁగి మై మఱచియున్న యీ వరాకులును "జీ సర్కార్." అని

చేతులుమోడ్చి యొదిగి యుండిరి. తరువాత మనవారు రాజ మార్గమునకు వచ్చి, సందులం దిరిగి యదృశ్యు లయిరి.

ఇచ్చట రెండవ వాఁడును బహరా వారితోఁ గలిసి మఱియొక గదికిఁ బోయి తలుపుఁ దీసి యందు నిద్రించు చున్న వానిం బయటికిఁ దీసికొని వచ్చెను; మఱి యొక గది లోని కరిగి మఱి యొకని నా విధముగానే తీసికొని వచ్చెను. కారాగృహము నుండి వచ్చిన వారి కిదంతయు నింద్రజాల ముగా నుండెను; కాని మాఱు మాటాడ రాదని వారు చెప్పుటచేతను, వారు తమ ప్రియకాంతల పేరులు పేర్కొ నుటచేతను, నా జన్మావధిలోఁ దమ కీ కారాగార వాసము తప్ప దనుకొని యున్న తమ్ము విడిపించుటచేతను వారి యందు విశ్వాస ముదయించి వారు నోరెత్తక యూర కుండిరి. ద్వారపాలకులు ధరించు రెండు దుస్తుల నొకఁడు తెచ్చి వారికిఁ దొడుగ నిచ్చెను. రెండు ఖడ్గము లా యిరు వురి హస్తముల నలంకరింపఁ జేసెను. ఖడ్గములు ధరించి నంత వారి యొడలు పులకరించెను. "మీరు మా వెంట రండు. మీ ప్రియ వస్తువులను దప్పక చూడఁ గలరు" అని వారికి బోధించి కారాగారాధికారి దుస్తులను దాను ధరించి, తక్కిన నల్వురను వెంట రా నా ప్రధాన పురుషుఁడు ధైర్య నిధియై సర సర రెండు ద్వారములను దాఁటెను. మూఁడవ పహరావాఁడు లేచి 'ఎవరు వారు' అని యడుగ 'భగవాన్ దాస్'. సర్కారు వారి యాజ్ఞ యయినది, గంగాజీ కరుగ వలెను. నిద్రపోక జాగ్రత్తగా నుండుము" అని హెచ్చరించి యా ద్వారము నాతఁడు వారితోఁ గలసి దాఁటి పోయెను. మఱి రెండు ద్వారముల కడఁ దత్కాల

కులు నిద్రా పరవశు లయి యుండ నే యాటంకమును లేకయే యా ద్వారముల దాఁటి పోయిరి. సింహద్వారము చెంతకు వచ్చిరి. అచ్చటి ముసలివాఁడు మూఁడవ యామము వఱకుఁ దన పనిఁ జేసి నాల్గవ యామము వానికిఁ బహారా నొప్పచెప్పి పండుకొనియెను. అప్పుడు ద్వార పాలనమునకు వచ్చిన వాఁడు పడుచు వాఁడు. వాఁడును జిలుము గొట్టములో గంజాయి వేసి నిప్పు పెట్టి కాల్చుచుఁ బీల్చుచు నలుకుడు విని "ఎవరు వారు" అని గట్టిగా నడిగెను. జవాబు లేదు, "ఎవరు వారు" అని మరల నడిగెను. దానికిని జవాబు లేదు. వారును సమీపించు చుండిరి. ఒఱ నుండి కత్తి దూసి దారి కడ్డముగా నిలిచి "ఎవరు వారు? మాటలాడ కున్నా రేమి? బదులు చెప్పెదరా? లేక బుద్ధి చెప్పవలయునా?" అని వాఁడు గద్దించి పలికెను. 'భగ వాన్ దాస్' అని బదులు వచ్చెను. వాఁ డా మైదు గురిని బరికించి చూచి యం దెవ్వఁడును భగవాన్ దాసు లేఁ డని తెలిసికొని వారిని దొంగ లని భావించి సమీపమున కేగి ముప్పురిని బో ల్తి పట్టెను. తక్కిన యిరువురును గ్రొత్త వారు; మిక్కిలి శుష్కించి యున్నారు. తాను బోల్తి పట్టిన ముప్పురిలో నొకఁడు వాని దుస్తులను గాక వాని యజ మానుని దుస్తులను దొడిగికొని యుండుటఁ గాంచెను. ఇది యేదో మోసము జరిగె నని వాఁడు నిశ్చయించి కత్తి జళి పించి నీవు నిజముఁ జెప్పెదవా? నిన్ను ఖండింప వలయునా?' అని దుస్తు మార్చుకొన్న వాని నడిగి చేయిఁ బట్టుకొని నిలువఁ బెట్టెను. "లక్ష్మణ సింగూ! వీని వాలకము బాగుగా లేదు. ఈ పని మీరు చూచుకొనుఁడు" అని

పలుక నతఁడు తక్కిన మువ్వురిని దోఁడ్కొని సాగిపోవుచుండెను. 'ఎటు పోవుచున్నారు? నిలువుఁడు' అని యూపడుచు జవా నా ప్రక్కకుఁ దిరిగి యడుగు నంతలోఁ బాపమాతని తల తెగి క్రిందఁ బడెను. ఇట్లు వానిం జంపి కొట్టుకొనుచున్న వాని శరీరము నొక మూల దూరముగాఁ బాఱవైచి యా భటుఁడు త్వరిత గతిని బోయి ముం దేగుచున్న వారిం గలిసికొనెను. ఎన్ని సారు లెవరు వారని యడిగినను బదులు గానక కోటనుండి వచ్చువారిపైఁ గినిసి సింహద్వార పాలకుఁడు గద్దించి యదలించి పలికిన పలుకులు విన రాగాఁ బహారా వార లందఱు నులికిపడి లేచి యది యేమి యా గల్లత్తని సింహ ద్వారమునఁ గూడిరి. అక్కడ నెవ్వరును లేరు. రక్తపుఁ జినుకు లచ్చ టచ్చటఁ బడి యుండెను. వారు బిగు లూడిరి. తక్కిన ద్వారముల వారు నగర రక్షకులును వచ్చి చేరిరి. ఎవ్వరును హంతకులు గాన రాలేదు. కోటలో నేమి పోయెనో, యేమి మోస మాయెనో యెవ్వరికిని దెలియదు. అందఱును గూడి లోని కేగిరి. ఎచ్చట నున్న వస్తువు లచ్చటనే యున్నవి. జైలు కడ కరుగ నచ్చటి పాలకు లేరును గానరారైరి. కారాగారపు గదుల తలుపులు తెఱచి యున్నవి. లోపలికిఁ బోయి చూడ నందుండు ఖైదీలు లేరు. కారాగృహాధిపతి కడ కరుగ నతఁడు నఱుకఁ బడి చచ్చి పడియుండెను. వానిం జంపి ఖైదీలను దోఁడ్కొని కారాగారము కా పున్న జవానులు పాఱిపోయి రని నిశ్చయింపఁ బడెను. ఒక గంటలో మహారాజుగారి కీ సంగతి తెలిసెను. అతఁ డాశ్చర్యము నొంది పరివారముతోఁ గోటకు వచ్చెను. పరీక్షించి చూడఁ

గారాగార వాసు లయి యున్న పూర్వపు మంత్రియు, నతని కుమారుఁడును, నతని మేనల్లుఁడును నందు లేక పోయిరి. రాజుగారు మిక్కిలి దిగు లొందిరి. ఆతఁ డేమియును దోఁపక నిప్పులు త్రొక్కిన కోఁతి వలె గంతు లిడుచు ద్వార పాలకులను బుర రక్షకులను దిట్టుచుఁ గొట్టుచు ఖైదీలను వెదకుటకై తగిన రాజ భటులను నియమించి మహాలున కరిగెను. తెల్లవాఱెను.

---

### అష్టాదశోల్లాసము

## విధిబలీయము

అణహింత నగరమున దోపిడి దొంగల భయ మమితముగా నుండెను. నగరవాసు లందఱు నట్టుడికిన ట్లుడుకుచు నిట్టి వింత చరిత్రము గల దొంగల నెన్నఁడును గని విని యెఱుంగ మని భయ విహ్వాలు లగుచుండిరి. కొందఱి యిండ్ల ధనము కొల్లపోవుటయుఁ, గొందఱి యిండ్ల స్త్రీలును బురుషులును గొల్లపోవుటయు నగుచుండెను. హత్యలు మాత్ర మెచ్చటను జరగలేదు. సిద్ధరాజును దగిన ప్రయత్నములు చేసెను. రక్షక సంఘము వారును దగిన ప్రయాసము పడుచుండిరి. పది దినముల కొక దొంగ మాత్రము జగదేవునకు దొరకెను. ఆ నాఁడు రాజుగారి కోటలోఁ గొంత ధనము కొల్లపోయెను. దానం జేసి రాజుగారు తమ యంతఃపుర రక్షణమునకు జగదేవునే రాత్రి పహరా కాచుచుండు మని యాజ్ఞాపించిరి. జగదేవుని యాలు బిడ్డలు

నంతఃపురమునందే వసించు చుండిరి. జగదేవుఁడు రాజ భక్తియందేమఱక రాత్రి నాలుగు జాములును నిర్నిద్ర జాగరూకతతో నంతఃపురమును గాపాడుచుండెను. ఖడ్గపాణియై ద్వారము కడ నిలిచి యెప్పుడు 'జగదేవా' అని రాజుగారు పిలిచినను 'చిత్తము. జాగరూకతతో నున్నాఁడను. భయము లేదు' అనియే యతని కడనుండి మాఱు పలుకు వినవచ్చు చుండెను. ఇట్లు కొన్ని రాత్రులు గతించెను.

ఒకనాఁటిరాత్రి, రెండు జాములఁ వేళఁ జిమ్మచీఁకటిగా నుండగా రాజుగారి మహాలునకు వెనుకప్రక్కనుండి యొక యార్త నాదము వినవచ్చెను. అందలి మృదు స్వరమునుబట్టి యా రోదనముచేయు వ్యక్తి యబల యని తెలియుచుండెను. రాజుగారు మేల్కొనిరి. జగదేవా అని పిలువ నతఁడు 'చిత్తము మహాప్రభూ! వినుచున్నాఁడను' అని జవా బిచ్చెను. 'ఆమె యెవ్వతెయో యెందుల కిట్టు లర్ధరాత్రమున నేడ్చుచున్నదో తెలిసికొని రమ్ము' అని రాజుగారాజ్ఞాపింప 'చిత్తము. ఇప్పుడే తెలిసికొని వచ్చెదను' అని జగదేవుఁడు మేడ దిగెను. కొన్ని నిముసము లయిన తరువాత రాజుగారును నిండ ముసుఁగు వేసికొని, యేమి జరుగునో చూడవలయు నని జగదేవుని వెనుకనే యా యార్త నాదము వినవచ్చుతావున కరిగి చాపుననే నిలిచియుండెను. జగదేవుఁ డా విధముగ నవ్వడినిబట్టి యా యంగనాసన్నిధిని జేరెను. వా రిరువురికి నిట్లు సంభాషణము జరిగెను.

స్త్రీ: ఎవ్వ రా వచ్చువారు? అచ్చటనే నిలువుఁడు.

జగ: 'నేను జగదేవుఁడను, (యని కొంతదూరములో

నిలిచి) ఇట్టు లీ నిశీథ సమయమున నొంటరిగ నీ విచ్చట నేడ్చుటకుఁ గతం బేమి?

స్త్రీ: ఆర్చువారును దీర్చువారు నున్నచో నా గోడు జెప్పు గొందును.

జగ: నేను నీ గోడు తప్పక తీర్పఁగలను. అది యేదియో వివరించి చెప్పుము.

స్త్రీ: చెప్పునట్లు చేయుట సులభము కాదు. కొంచె మాలోచించి మాట యిమ్ము.

జగ: ఆలోచింప నవసరము లేదు. ముమ్మాటికిని నీ గోడు తీర్చెదను. ఇదిగో కత్తి పట్టి ప్రమాణము చేయుచున్నాఁడను, సంశయింపక చెప్పుము.

స్త్రీ: నీ యేలిక యగు సిద్ధరాజు రాజ్యలక్ష్మిని నేను. ఆతఁడు మిగుల ధర్మాత్ముఁడు. చింతలచేఁ జిక్కి యుండుటచే నాతనికి మరణము సమీపించుచున్నది. నేఁటి కేడవ దినమున నాతఁడు పరలోక గతుం డగును. అట్టి పాలకుఁ డింక నాకు లభింపఁ డని యిట్టు లేడ్చుచున్న దానను.

జగ: రాజ్యలక్ష్మీ! రాజుగారు జీవించియుండుట కే దేని యుపాయ మున్నచో దయచేసి సెలవిమ్ము. మ మ్మెట్టులయిన నీ విపత్తునుండి రక్షింపుము.

స్త్రీ: ఉపాయము కలదు; గాని యెవ్వ రట్టి సాహసకార్య మొనరింపఁ గలవారు?

జగ: నేను దప్పక చేయుదు నని ప్రమాణము చేసియున్నా డను గదా!

స్త్రీ: ఎవ్వఁడైన నొక మహావీరుఁడు తనయాలుబిడ్డలతోఁ గూడ భవానీదేవికి బలి యయినచో సిద్ధరాజు తప్పక బ్రతుకఁగలఁడు.

జగదేవునిగుండె జల్లుమనియెను. ఒక్కింతసే పేమియు మాఱు పలుకనేరక యూరకుండెను.

స్త్రీ: చెప్పుటవలెఁ జేయుట సుకరము కాదని నే ముందే చెప్పలేదా! ఆ సత్యకాలము దాఁటిపోయినది. ఇది అసత్యకాలము, కలికాలము. ఇప్పు డెవ్వ రట్టివా రున్నవారు?

జగ: ఆలాగున ననవలదు. నేను దప్పక యాడినమాట చొప్పునఁ బ్రవర్తించెదను. నా యాలుబిడ్డలతో భవానీదేవికి బలియై నా యేలిక ప్రాణములను గాపాడెదను.

స్త్రీ: నీవు సత్యవ్రతుఁడవే యైన యెడల నా కార్య మీ రాత్రియే జరుగవలెను. తెల్లవాఱినచో రాజు జీవింపఁడు.

జగ: సరియే. ఆలాగున నయిన నే నిప్పుడే నా పనిని నెఱవేర్చు కొందును. నాకు సెల విమ్ము.

స్త్రీ: "పోయి రమ్ము. నీకు జయ మగుం గావుత" మని యామె గాఢాంధకారమున లీన మయ్యెను.

జగదేవుఁడును మహాధైర్యవంతుఁడై యచ్చటినుండి యంతఃపురమునకు మరలెను. ఈ సంగతిని వినుచున్న రాజుగారి గుండె విచ్చిపోయెను. జగదేవునకుఁ గాన రాకుండ నొకచో నొదిగి యుండెను. జగదేవుఁ డంతఃపుర

మునకుఁ బోయెను. తన భార్య నిద్రించు పడుకగది చేరెను. పదునాఱు కళలతోఁ దనరారు సంపూర్ణ శరత్పూర్ణిమా సుధాకరు ననుకరించుచు నిండు నిద్దురలో నున్న వీరమతీదేవి మోముఁ దప్పనిం గాంచెను. గంధర్వ బాలు ననుకరించుచుఁ దూఁగుటుయ్యెలలోఁ బండుకొని నిదురించుచున్న జగధవళుఁ డను తన కుమారు నతఁడు గాంచెను. వీరమతి ప్రక్కలో శయనించి ముద్దులు మూటఁ గట్టుచున్న తన కూఁతు నతఁడు చూచెను. "ఆహా! దైవమా! ఇట్టి నా యాలు బిడ్డల నెట్టులు చేఁ జేతులఁ జంపఁ గలుగుదును? చంప కూరకున్నఁ గృతఘ్నుఁడ నైన న న్నేలిన వానిం జంపుకొని రౌరవమునఁ గూలవలసినదే గదా! అసత్య దోషమును ప్రతిజ్ఞాభంగ దోషమును నన్నుఁ జుట్టికొనును గదా! ఏమి చేయవచ్చును" అని నిట్టూర్పు పుచ్చి కొంత తడ వాలోచించి, ధైర్యము తెచ్చుకొని నిద్రించుచున్న పిల్లలను ముద్దులాడి తనకుఁ బ్రాణపద మైన వీరమతి యొడలిపైఁ జేయి వయిచెను. అప్పటికి వీరమతి యొక కల గనుచుండెను. "జగదేవుఁడు చక్రవర్తి యయ్యెను. తెల్లని పట్టపు టేనుఁగు నెక్కి పతితో నామెయును బిల్లలును నూరేగుచుండిరి. ఒక యుద్యాన వనమున కా గంధసింధురము వారిం దీసికొని చనియెను. అచ్చటఁ దన రూపరేఖా విలాసములతోఁ దనరారు నొక కాంతామణి యగుపించెను. "నేనును దమ భార్యనే. మిమ్మే దైవముగా నమ్ముకొని యున్న దానను. ఇన్నాళ్లును మీ కొఱకే తపస్సు చేయుచుంటిని. నన్నేలుకొనుఁడు. భద్రగజము మీఁదికి నన్నును దీసికొనుఁడు. నా తప్పు క్షమియింపుఁడు.

నేఁ జేసిన దానికిఁ దగిన ప్రాయశ్చిత్త మయినది. వీరమోహినియు నేను నొక్క ప్రాణము రెండు శరీరములుగా మెలంగఁ గలము" అని చేయి నెత్తి యా కాంతామణి జగదేవుని వేఁడుకొనియెను. జగదేవుఁడు వీరమతీ ముఖకమలమును జూచెను. వీరమతి చిఱునవ్వు మోముతో 'దప్పక యంగీకరింపుడు' అని సంతోష పూర్వకముగఁ జెప్పుచుండెను." అట్టి స్వప్నమును గాంచుచున్న వీరమతి యొడలి పయి జగదేవుఁడు చేయి వయిచి నంతనే యా స్పర్శసుఖము వలన నామెకు మెలఁకువ వచ్చెను. ఎదుట దీనవదనుఁ డయి ప్రాణనాథుఁడు నిలిచి యుండ నామె కన్నులు విప్పి చూచెను. ఉలికి పడి లేచి నిలుచుండి "నాథా! ఈ నిశీథమున మీ రిట్లు దీనవదనులై వచ్చుట కేమి కారణము? అంతఃపురమున నెల్లరును గుశలముగా నున్నవారా" అని యడుగుచుఁ జేయి పట్టుకొని శయ్య పయిం గూర్చుండఁ జేసి పైట చెంగుతో నశ్రుజల పూరితములగు నాతని నేత్రములను దుడిచెను. నలు వలంకుల నామె పరికించెను. గంట లాగున దీపము వెలుగు చుండెను. బిడ్డ లిరువురును గాఢ సుషుప్తియం దున్నవారు. తక్కిన యంతఃపుర మంతయు నిశ్శబ్దముగా నుండెను. "ప్రియురాలా! ఏమి చెప్పుదును? నే మిగులఁ బాపాత్ముఁడను" అను నంత నాతని కంఠము రుద్ధ మయ్యెను. జొట జొట నశ్రు బిందువులు రాలుచుండెను. "నాథా! మిన్ను విఱిగి మీఁదఁ బడినను నిసు మంతయైన భయపడని మీ రేల నేఁ డిట్టి యవస్థకుఁ బాల్పడితిరి? ధైర్యము దెచ్చుకొని విచార కారణము నెఱింగింపుఁడు. ప్రాఙ్ఞు లాపత్కాలములందు శోకమునకుఁ దా

విత్తురా? ఉత్తమ క్షత్రియ వీరులు మీ రిట్లు శోకింపఁ జనదు. కారణ మేదో చెప్పుఁడు'' అని వీరమతి పలుక, ధైర్యము నొంది జరిగిన యుదంతము నంతయును బూస గ్రుచ్చి నట్టులు చెప్పి, ''నా చేతులతో నిన్నును నీ యబోధ సంతానమును నే నెట్లు చంపఁగలుగుదును?'' అని జగ దేవుఁడు పలుకు నంత నాతని ధైర్యము పటాపంచ లయ్యెను. ఎంత యాఁపినను నాఁగక దుఃఖము పొంగి పొరలి రా నాతఁ డేడ్చెను. వీరమతియు నాతఁడు వచియించిన యుదంతమును వినియు, నాతని వైఖరిం జూచియు దుఃఖమునకు లోనయి యేడువ సాగెను. ద్వారము వెలుపల నుండి యీ దృశ్య మును జూచుచున్న సిద్ధరాజు కన్నీరు మున్నీరుగా నేడ్చెను. తా నచ్చటఁ బ్రత్యక్షమై వారి దుఃఖము నణంపఁ దలంచెను, కాని మహాగుణములు లగు నా దంపతు లీ యంశము నెట్లు నెఱవేర్తురో చూడ నెంచి ధైర్యమును జిక్కఁ బట్టి చూచుచుండెను. ఎట్టకేలకు వీరమతి ధైర్యము తెచ్చు కొని ''ప్రాణనాథా! విధిని దాఁట నెవ్వరికి శక్య మగును? సతీ సంతానము లీ జన్మ మున్నంతవఱకే నరునకు బంధు వులు; ధర్మమో శాశ్వత బంధువు. రాజ సేవకుల మయిన మనకు రాజ రక్షణ మవశ్య కర్తవ్యము. మీ రక్కఱ మాలిన మోహమును బెంచుకొనక, మన ఋణాను బంధము తెగినదిగా నిశ్చయించుకొని, మనల నెన్నియో విధముల గౌరవించి పోషించిన మహారాజుగారి ప్రాణము నిలుప ధైర్యము నవలంబించి, వెంటనే యి క్కార్యమును నెఱ వేర్పుఁడు. మనము పోయిన మన కంటె నెక్కువ వారు సేవకులు దొరకుదురు. రాజుగారు పోయిన నట్టి ధర్మాత్ముం

డీ రాజ్యమునకు మఱి కొరకడు. కావుననే రాజ్యలక్ష్మి యంతగా సురపిల్లినది. ఇది దైవ నిర్దేశము. మీరు భయపడక మీ కర్తవ్యమును జేసివేయుఁడు'' అని బోధించెను. ఆమె పలుకుల నాలకించి జగదేవుఁడు ధైర్యము దెచ్చుకొని గుండె రాయి చేసికొని నిద్రించుచున్న పుత్త్రుని లేపెను. బాలుఁడైదేండ్ల యీడు వాఁడు. బాలిక మూఁడేండ్లది. తండ్రి జగద్ధవళుని, తల్లి శ్రీలక్ష్మీదేవి యను చిన్ని కన్నియను నెత్తుకొని యిల్లు వెడలిరి. రాజాశ్చర్యపడి వారి కంటె ముందుగ నడిచెను. నాఁడేమి మాయయో గాని ద్వార పాలకుల కందఱకు నెన్నఁడు లేని నిద్రయు వచ్చి సర్వసేనా మూర్ఛాగ్రాఁ బడవైచెను. మనవారు తిన్నగ భువనేశ్వరీ దేవి యాలయము లోనికిఁ బోయిరి. రాజుగారు వెలుపల నుండిరి. ఆ యాలయములో మినుకు మినుకు మనుచుఁ జిన్న దీపము వెలుగుచుండెను. భువనేశ్వరీ విగ్రహ మెంతయుఁ బొడువుగా నుండెను. ఆ దంపతులు నిద్రించుచున్న పిల్లల నిరువురినిఁ గ్రిందఁ బరుండఁ బెట్టిరి. జగదేవునికి మరల దుఃఖము పొంగి పొరలి వచ్చెను. అతఁడు పట్టలేక రోదనముఁ దొడంగెను. "స్వామీ! గుండె రాయి చేసికొనుఁడు. తొలుత నా కంఠము నఱికివేయుఁడు. మీ చేతఁ జచ్చుట కంటె నాకింకేమి కావలయును? ఆలస్యమొనరింపకుఁడు. తెల్లవాఱ వచ్చుచున్నది. ఉదయ మైనచో రాజుగారి ప్రాణములు పోవును. ఇంతలో నాయనకుఁ దెలిసి వచ్చినను నిందుల కంగీకరింపఁడు. మీ ప్రతిజ్ఞ నెఱవేఱక పోవును. కావున ధైర్యముతో మీ కర్తవ్యమును మీరు నెఱవేర్చుకొనుఁడు. మీరు వీరాగ్రేసరులరు. పరమార

కులాలంకారులరు. మీ రిట్టి నీచ మగు మోహమునఁ జిక్కు కొనుట తగదు. లెండు. ఖడ్గము నందుకొనుఁడు'' అని హెచ్చరించి వీరమతి ఖడ్గము నందుకొని యతని చేతి కిచ్చి తాను సంసిద్ధురా లయ్యెను.

జగదేవుండును నుస్సు రని వేఁడినిట్టూర్పు పుచ్చి ఖడ్గము నందుకొని సతీ సంతానములందలి మోహమును బటాపంచలుగాఁ బాఱఁదోలి ''ప్రియురాలా! సిద్ధముగా నుండుము. నిన్నును బిల్లలను బలి యిచ్చి తరువాత భువనేశ్వరికి నే బలియయ్యెదను'' ''దేవీ! నీ యాజ్ఞాప్రకారము నాప్రాణపదమగు వీరమతి నిదిగో నీకు బలి యిచ్చుచుంటిని. నాప్రభూత్తంసుని జిరంజీవిగ నాశీర్వదింపుము. నాకు సంతానముతోఁగూడ సద్గతి నొసంగుము'' అని యెలుగెత్తి పలికి కత్తి యెత్తెను. తలుపు చాటున వెలుపల నున్నరాజు తటాలున వచ్చి, యెత్తిన జగదేవుని దక్షిణహస్తమును బట్టుకొని ''జగదేవా! నీభార్య పాతివ్రత్యమునకును నీరాజభక్తికిని నే నెంతయు సంతసించితిని. నా విషయమై మీరు మీ సంతానముతో నంత మొంద నేల? నేనే భువనేశ్వరీ దేవికి బలి యయ్యెదను. నా రాజ్యమును హృదయపూర్వకముగా నీ కొసంగితిని. నీవు హాయిగఁ జిరంజీవివై యుండి, పతివ్రతా శిరోమణి యగు నీయిల్లాలితో సామ్రాజ్య సుఖంబు లనుభవింపుము. నేను జీవించియుండ మీ జీవములు పోవుటకు నే నంగీకరింపఁజాలను'' అని యాతని యుద్యమమును వారించెను. ఆయన రాకకా సతీపతు లచ్చెరువు నొందిరి. ''అయ్యా! నేను దేవీసన్నిధిని బ్రతినఁ బట్టితిని. నన్ను వారింపవలదు. ప్రాణము పోయినను సరే, ప్రపం

చము పోయినను సరే! సత్యము నతిక్రమింప నా మనం బొప్పదు. నా కార్యమున కడ్డము రావల దని మిమ్ము వేఁడికొందును. క్షమించి యనుజ్ఞ నొసంగుఁడు. ఇది మా రాజ్యలక్ష్మియాజ్ఞ గాని వేఱొండు గాదు" అని జగదేవుఁడు పలికెను. "ఏమయినను నా విషయమున మీరు మరణించుటకు నే నంగీకరింపను" అని సిద్ధరాజు పలికెను. ఇట్టు లిరువురును బట్టుపట్టియుండ నొకవాణి యిట్టులు వినవచ్చెను. "రాజా! నేఁడు నీవుగాని, కుటుంబముతోఁ జగదేవుఁడుగాని యంత మొందవలసినవిధి యయియున్నది; కాని దీనికి నొక ప్రతిక్రియ యున్నది. నీ వా విధమున నడచుకొందువేని, యెవ్వరు నే హానియుం బొరయక సుఖంబుండెదరు." ఆ పలుకులు విని యా మువ్వురు నాశ్చర్యమగ్నమానసు లయి భవానీదేవియే యట్లు వచించె నని నిశ్చయించిరి. "తల్లీ! అది యేదియో చెప్పితివేని చేతులు కట్టుకొని చేయుటకు సంసిద్ధుఁడనై యున్నాఁడను" అని రాజు పలుక, "నీకూఁతు నీ వీరాగ్రణి కొసఁగి వివాహము గావించి నీ రాజ్యమున కీయనను బట్టభద్రుని నొనరింపుము. ఆ లాగుననైన నెవ్వరికి నే బాధయును గలుగకుండ నేఁ జేసెదను" అని భవానీదేవి పలికెను. "తల్లీ! నాకూఁతు రేమయ్యెనో తెలియరాదయ్యె; నే నేమి సేయుదును. నే నెట్టు లామె నీ వీరున కీయ నేర్తును?" అని రాజన, "ఆమె కొన్ని దినంబులలో నగుపింపఁగలదు. తప్పక యీ మహానుభావున కిచ్చి పరిణయము గావింపుము" అని దేవి పలికెను. "తల్లీ! నా కింతకంటె నిం కేమి కావలయును? అట్టి భాగ్యము నాకు లభించునేని ధన్యతములలో నేనే యగ్రేసరుఁడను. తప్పక నీ యాజ్ఞా ప్రకారము నడుచు

కొందును'' అని రాజు పలుక, ''భువనేశ్వరీ! నేను వీరమతిం దక్కఁ దక్కినవారిం దల్లు లని తలంతునే. నా తలంపును వ్యర్థపఱిచెదవా?'' అని జగదేవుఁ డడిగెను. ''ఔను. నీవు సత్యవాక్పాలకుండ వనుమాట నిశ్చయ మేని యామెను జేకొనుము. ఆమెయుఁ దన పేరు వీరమతి యనియే మార్చు కొనినది. ఇంత యేల? ఇందలి రహస్యము నెఱింగించెదను వినుము. వీరమతియు నామెయు నా యంశమువల్లనే కలిగి నారు. నీ వీశ్వరాంశ సంభూతుండవు. రెండు శరీరము లను మాటయే కాని, యొక్కమనస్సును నొక్క ప్రాణమునుగాఁ గలిసి వా రిరువురు ని న్నానందింపఁ జేయుదురు. పరమేశ్వర సంకల్పమును ద దంశ సంజాతుండ వయిన నీవు ననుసరిం పక తప్పదు. కావున నా మాటచొప్పున నీ వామెను బరిగ్ర హింపుము. నీ కుటుంబమును గాపాడుకొనుము. నీ వింతకు ముందు రాజ్యలక్ష్మితోఁ బలికిన పలుకులు మఱవకుము. రాజుప్రాణములను గాపాడఁ బ్రతినఁ గైకొంటివిగదా! నీ వామెను బాణిగ్రహణ మొనరించుకొందువేని రాజును జిరం జీవి యగును. నీవును సర్వశుభముల నొందుదువు. ఆమెయు నీ మేనత్తకూఁతురే కదా! సంశయింపక యామెను జేపట్టవచ్చును. నీ కే దోషమును లేదని నేను ముమ్మాటి కిని జెప్పుచున్నాను'' అని భువనేశ్వరీదేవి పలికెను. సిద్ధ రాజు నానందమునకు మేర లేదు. జగదేవుని చేతులు పట్టు కొని ''తండ్రీ! మన మిడుపుర మీ జగదీశ్వరి యాజ్ఞానుసార ముగా మెలంగుట శ్రేయోదాయకము. నీ విద్దాని కొడం బడక తీఱదు. నా మాట నీ వీవఱకును మీఱలేదు. ఈ మాటగూడఁ జెల్లించుము'' అని యతఁ డతనిని బ్రతిమాలెను.

జగదేవుఁడు వీరమతిమోము నవలోకించెను. అంతే వీరమతి యా రాత్రి తనకు వచ్చిన స్వప్నము నెఱింగించి తన యంగీకారమును స్పష్టముగా సూచించెను. "రాజేంద్రా! జగదీశ్వరీ! మీ యిరువురి యాజ్ఞానుసారముగా నే నామెను బాణిగ్రహణ మొనరించుకొందును" అని జగదేవుండు బదులు చెప్పెను. రాజును సంతోషమును బట్టఁజాలక జగదేవు నాలింగనము చేసికొనెను. అందఱును భువనేశ్వరీ విగ్రహమునకు సాష్టాంగముగ మ్రొక్కిరి. పిమ్మట రాజుగారును, జగదేవుఁడును జిఱుత బిడ్డల నెత్తుకొనిరి. వీరమతి వెనుక నడచుచుండెను. దేవీ మందిరమును విడిచి వారు బయలుదేఱిరి; నగరిలోని కేగిరి. ద్వారపాలకు లందఱును లేచియుండిరి; వీరిం గాంచి తత్తరము నచ్చెరువు నందిరి. వా రెవ్వరి నేమియు ననక యంతఃపురమును బ్రవేశించిరి. మందమారుతములు వీవసాగెను. మంగళ వాద్యమ్ములు మ్రోగుచుండెను. అరుణోదయ మయ్యెను. జీవిప్రకృతి నిత్యకృత్య పరతంత్ర మయ్యెను. క్రమక్రమముగా నగరము యాతాయాత జనములతోఁ గలకల మనుచుండెను. సూర్యభగవానుం డుదయాచలాధివాసి యయి యెంతయు దర్శనీయుండయి ప్రకాశించుచుండెను. ప్రకృతి నానందము నారోగ్యము నిండెను.

---

## ఏకోనవింశత్యుల్లాసము

# కల్యాణ పరంపర

జగదీశ్వరి చెప్పినచొప్పునఁ బదిదినము లయినను దన ముద్దుపట్టి రాలేదని సిద్ధరాజు తహతహ నొందుచుండెను. సభాభవనము నలంకరించి యతఁడు కొలువుతీరి యుండెను. జగదేవుం డాతని దక్షిణభాగమున నున్నతాసనమున నాసీనుం డయియుండెను. సభవా రెల్లరును రాజుగా రేమి మాట లాడుదురో యని నిశ్శబ్దముగా నుండిరి. రాజుగా రాలోచనా సముద్రమున మునిఁగి యుండెను. అప్పుడు వేత్రహస్తుఁ డరుదెంచి "మహాప్రభూ! ఏలినవారి దర్శనమునకై ద్వారమువద్ద నెవరో వచ్చి వేచియున్నారు" అని చేతులు జోడించి పలికెను. సభాసదుల దృష్టులన్నియు నొక్కసారి వేత్రహస్తునిపైఁ బడ రాజు, "వారిని శీఘ్రముగాఁ దోడ్కొని రమ్ము" అనవుఁడు వాఁ డేగి యిరువురు పురుషులను బ్రవేశపెట్టెను. ఆ పురుషులు సాగిలిపడి భూధవునకు మ్రొక్కి లేచి యొక లేఖను జగదేవుని చేతి కందించిరి. అతఁ డాయుత్తర విలాసము రాజుగారి పేరున నుండుటచేత "ప్రభువువారి పేర పైవిలాస మున్నది" అని యన "నీవు చదువవచ్చును" అని రాజుగారు పలికిరి. జగదేవుఁ డాయుత్తరమును నెల్లరు వినునట్టులు గట్టిగా నిట్టులు చదువసాగెను.

"స్వస్తి శ్రీ మహారాజ రాజద్బిరుదాంకితులును,

అణహిలపుర రాజ్య రమాలలామాభిరాములును, సకల సద్గుణ గణవిరాజితులు నగు సిద్ధరాజ్మహేంద్రులకు, సదానందయోగి వ్రాయించిన యంశములు:—పరమార వంశో ద్భూత మహామణి యగు జగదేవ సింహుఁడు తమ సన్నిధి నున్నట్లు విని మే మానందించితిమి. ప్రస్తుతము ధారానగర మును ముట్టడింపఁ బ్రబల బల సన్నాహములతో వారణాసీ నగరాధినాథుం డగు జయంతచంద్రుం డుద్దండుండై బయలు వెడలుచున్నాఁడు. ఉదయాదిత్య సార్వభౌముఁడు వయసు మళ్లినవాఁడు. రణధవళుం డసహాయుండయి యేమటి యున్నవాఁడు. కావున నీ యుత్తరమందిన తత్క్షణమే తమ చతురంగ బలములను సర్వసైన్యాధిపతియగు జగదేవునిం దో డ్కొని మీరు తప్పక దయచేయవలయును. తమపుత్రిక తీర్థయాత్రలను సేవించి మా గూఢ నాత్మతత్వము నభ్యసిం చుచు యోగిని యై యున్నది. ఆ కన్నియం దోడ్కొని ధారానగరమునకు మేమును దగినంత వేగముగ వచ్చు చున్నాము. యుద్ధమున జయంతచంద్రునిం బరాభవించిన తరువాత మీ కూఁతురు మిమ్ము దర్శింపఁగలదు. మీ మనోరథము నప్పుడే ఫలింపఁగలదు, మీకు శుభ మగుగాక.

చిత్తగింపుఁడు
ఇట్లు మీశ్రేయోభిలాషియగు
సదానందయోగి.''

అది వినినంతనే రాజు సంభ్రమాశ్చర్య మహానంద ములు ముప్పిరి గొనఁ గను గొలుకుల నానందాశ్రువులు చాలువార జగదేవునిం గాంచి ''కుమారా! యుద్ధ వ్యాపార

మేమిదియో మఱచి, మనోవ్యాధిచే నే గ్రుగ్గుచున్నాడను. నీవే ముఖ్య సేనాధిపతివై రాజవై మన చతురంగ బలము లను ధారా నగర రణ క్షోణికి నడుపుము. నేనును బ్రయా ణమున కాయత మయ్యెదను. వెంటనే బయలు దేఱి వచ్చుచున్నా మని దయాళుం డగు సదానంద యోగి పుంగవునకుఁ బ్రత్యుత్తరము వ్రాయించి యిచ్చి యీ వార్తా వహులను సంతోష పఱిచి పంపించి వేయుము. నీవు పయ నమునకుఁ దగు జతనములను జేయుము'' అని గద్గద స్వర మున వచించెను. ఆ యుత్తరమును జదివినప్పటి నుండి జగదేవుని భావనా ప్రపంచమున నాలోచన పరంపర లుదయించు చుండెను. రాజుగారి మాటల వలన యథా స్థితికి వచ్చి యతఁడు ''చిత్తము'' అని యప్పుడే యుత్తరమును వ్రాయించి యిచ్చి వార్తావహుల సంతోషపఱిచి పంపించి వేసెను. రాజు గా రంతఃపురమున కేగిరి. సభ ముగిసెను.

జగదేవుఁడు సేనా నాయకులను రావించి రాజుగారి యానతి నెఱిఁగించి సమర సన్నాహ మొనరింపఁ జేసి యుద్ధ కాటోపముతో బలములతో బయలు దేఱెను. రాజుగారును, నంతఃపుర స్త్రీలును బరివార యుతమ్ముగ బయలు వెడ లిరి. వీరమతియుఁ బిల్లలును బయలు దేఱిరి. కతిపయ ప్రయాణమ్ములకు వా రందఱు ధారా నగర సవిధ భూముల నడుగు వెట్టిరి.

అట జయంతచంద్రుం డుద్దండుండై ప్రచండ బల దర్పితు లగు శూర శిఖామణులు గొలువ ననంత సేనా పారా వారమును బొంగి పొరలించుకొని, యమితాహంకారముతో నంతకు మునుపే ధారా నగరమును నలు దెట్టుల నరికట్టెను;

గౌడ దేశము నుండి కాని, [illegible] నుండి కాని యుదయా దిత్యునకు సాహాయ్య మొనరింప నెవ్వ రైన సైన్యములు వచ్చునేమో యని నాలుగు దారుల యందును దన సైన్యమును విభాగించి యడ్డు పెట్టి యుండెను. జయంతచంద్రుని బలంబులు ధారా నగర ప్రాంత గ్రామములు కొల్ల పెట్టెను. వారు సస్యములు పాడుసేసిరి. తోఁటలు మొదలంట నఱికిరి. చెరువుల కట్టలు తెగఁ గొట్టిరి. స్త్రీలను బరిభవించిరి. అక్కటిక మెఱుంగక పసి పాపలను సయితము ఘాతుకులు నఱికిరి. వారి దురాగతము దుస్సహముగా నుండెను.

జగదేవుని విడిచినప్పటి నుండియు నుదయాదిత్య సార్వభౌమునకు మనోవ్యాధి మెండయ్యెను. గయ్యాళి యగు పెద్ద భార్య నెదిరింప లేక యామె వాక్పాశములఁ గట్టువడి యున్నను, బరాక్రమ సముద్రుండగు తన చిన్ని తనయుని మఱువ నతండసమర్థుం డయ్యెను. రణధవళుఁడు యౌవరాజ్య పట్టభద్రుండయి రాజ్య మేలుచుండెను. ఇట్టి సమయమున నకస్మాత్తుగ జయంతచంద్రుని సైన్యములు ధారా నగరమును బెట్టుగా ముట్టడించెను. అది యెఱింగి యుదయాదిత్యుండు సంగ్రామ పరిణామ మనిష్టదాయక మగు నని నిశ్చయించుకొని సంధి వార్తలను నడిపెను; కాని జయంతచంద్రుని కోరికలు కేవల మసందర్భ స్థితియం దుండుటచేత నవి చెల్లించుట కంటె యుద్ధరంగమున వీర శయన మొందుటయే మానవంతున కవశ్య కర్తవ్య మ్మని దృఢనిశ్చయము చేసికొని యప్పటి కప్పుడు సేయఁ దగినంత యుద్ధ ప్రయత్నమును జేసి, రాజు కోటతలుపులు తీయించి

జయంతచంద్రు నెదురుకొనెను. రణధవళుం డొక్కండే పేరొందిన వీరుండా ధారానగర రాజసైన్యమున నున్నాఁడు. కాని యట్టివారు పలువురా వారాణసీ సైన్యమున నున్నవారు. ఉభయ బలంబులకును బోరు ఘోరమ్ముగా జరుగుచుండెను. సదానంద భట్టు రణధవళునితో హోరాహోరిగాఁ బోరుచు నాతని మించి రాసియుక నిలువరించెను. జయంతచంద్రుఁ డుదయాదిత్యునిం దలపడి ఘోరముగాఁ బోరుచుండెను. తక్కిన కాశీ సైన్యాధిపతులుక్కు మీఱి లెక్క మీఱి ధారానగర బలంబుల నంత మొందించుచుండిరి. మొదటి నాఁటి యుద్ధముననే రణధవళుఁడు నుదయాదిత్యుండును మిక్కిలి నొచ్చియుండిరి. వారి సైన్యములు సగమా దినముననే హతము లయ్యెను. నాయంత్ర మయ్యెను. యుద్ధ మాఁగిపోయెను. జయంతచంద్రుని వాహినీ వారము కెవ్వునఁ గేకవైచు చుండెను. ఉదయాదిత్యుఁడును దద్బలంబుల వారును దిగు లొందిరి. ఏమి చేయుటకును దోఁపక రణధవళుఁడు నిర్విణ్ణుండయి యుండెను.

మఱునాఁటి యుదయము రెండు వీడుల వారును నొండొరులఁ దలకడచు కండకతో నోహరి సాహరిఁ బెనఁగఁ దొడఁగిరి. నాలుగు గడియల ప్రొద్దెక్కెను. సుమారేఁబది మంది గుఱ్ఱపు రౌతులును నూఱుగురు పదాతులును యుద్ధ సన్నద్ధు లయి యుత్తర దిగ్భాగము నుండి యతి శీఘ్ర గతి నరుగుదెంచి, వెనుక ముందు లాలోచింపక జయంత చంద్రుని బలంబులపైఁ బడి చిందర వందర చేయసాగిరి. ఆ వఱకే వారి యొడళ్లు రక్తసిక్తము లయి యున్నవి.

త్రోవలో నడ్డుగా నిలిచి యున్న జయంతచంద్రుని బలంగ మును దుడ ముట్టించి వీరు వీరావేశముతో వచ్చినట్టులు పొడఁ గట్టుచున్నది. వారందఱును గాషాయాంబర ధారులగు జడదారులు. వారి యుద్ధ కౌశలము వర్ణింప నలవి గాకుండెను. ఆ వీరులలో మనకుఁ బూర్వ పరిచితుఁ డగు సదానంద యోగి గాన్పించు చుండుటచేత నా మహామహులని దీ దళ మని తెలియవచ్చుచున్నది. మానసిక శక్తియే కల యోగీంద్రు లయ్యు వారు రణరంగమున విహరించు వీర విహారము చూడఁ బరాక్రమోపేత మగు శారీరక శక్తి యందును వారిని మించు వా రుండ రని యనుకొనక తప్పదు. వా రంద ఱొక్కుమ్మడి రణఘవఘుని గలుపుకొని మహార్ణవము వలె ఘూర్ణిల్లు జయంత చంద్రుని చమూనికాయమ్మునం జొచ్చిరి. యోగీంద్రున కిరు వలంకుల నలువురు యోధులు నిలిచి యొకరి కొక రీషు తీయక పోరాటపు మెఱికలవలెఁ జెలరేఁగి శత్రు సేనా నివహమును బడలువడఁ జేయుచుండిరి. వారాణసీ సేనాధిపతు లెంద ఱేని వారిం గవిసి పరాక్రమించిరి; కాని నిముసములో వారి సాయ కానలముచే దగ్ధు లయిరి.

ఇట్టి సమయమునఁ బశ్చిమ దిగ్భాగమునుండి యుప్పొలికలని కొక పెద్ద యుద్ధ సైన్యము వచ్చుచుండెను. అందగ్రేసరుండు జయంతచంద్రునకు హృదయ శల్యుం డగు జగదేవ కుమారుండు. యుద్ధ పరిశ్రమమం దాతని వలన నాఱి తేఱిన పలువురు యోధు లాతనిం బరివేష్టించి యుద్ధరంగమున నుఱికిరి. వారి యిష్టము వచ్చినట్లు వీర విహారము సలుపుచు శాత్రవానీకినీ నికాయమును జప చుట్టలుగఁ

బడవైచు చుండిరి; శాఖ ఫలములవలె నరవీరుల శిరంబులు నేలకుఁ గొట్టుచుండిరి.

ఇట యోగీశ్వరుండును వదంగ రక్షకులును నేయు నద్వితీయ మగు దారుణ సంగ్రామ క్రీడ కరు కంద క్రోధో ద్రేకుం డయి యర్రాడు గలుచుచు జయంతచంద్రుఁడు కుడయా దిత్యుని బలమ్ములను విడిచి జడదారి బలంగములను రూపు మాప సాగెను. సదానందమునిం గాపాడ నాతని యోధు లహా మహామికతో నాతనిం దల కడచి జయంతచంద్రు నెదిరించి యత్యుగ్రముగఁ బోరిరి; కాని యాతని కోత్రిల కోర్వలేక పాపము పన్నిద్దఱు జటాధారులు వీర శయనము నలంకరించిరి. జయంతచంద్రుఁడు సంయమీంద్రుని దగ్గర యాతని యుభయ పార్శ్వములయందు నతి దారుణాకారులై పోరు సలుపు నిరువురి యోధులను గాంచి మండి పడి "దొంగ సన్న్యాసులారా! మీఁదియా యీ బలము! మీకు నూఱేం డ్లును నేటితో నిండినవి" అని మహోగ్ర మూర్తియై ప్రచండ గతిని వారి నెదుర్కొనియెను. రాజుగారి సాహ సము చూచి ప్రధాన యోధు లందఱు నొక్కుమ్మడి వారిపైఁ గవిసిరి. జడదారి సైన్యము చచ్చొ చచ్చొ నను హాహా కారము మిన్ను ముట్టెను. వారేవురు పంచాగ్ని హోత్ర ముల వలెఁ జెలరేగి తమపైఁ బడుచున్న యరి సేనా శల భంబుల ప్రసందించు చుండిరి.

ఇంతలోఁ బంచ శతాధికం బగు నేకాంగ వీరబలంబు లెన్నిం బరివేష్టించి శక్తి సామర్థ్యములు చూపించుచును నగ వీరుల నుఱుమాడు చుండఁ బ్రచండ మారుతోద్రేకత ... మహా ప్రళయాగ్ని పెంపున జగదేవ్రుఁడు. జయంతచంద్రుని

చతురంగ బలంబుల నావ్రు మాపి రాజు నెందుం గానక ప్రముక్కడి మానిసులతోం బోర నొల్లక తన వీరుల వెన్నంటి రా నాజ్ఞాపించి, యొక యోరగా నరి సైన్య సాగరమును జొచ్చి యెదు రగువారి నెల్ల ముట్టె నణుకుచు జయంత చంద్రునిం జేరం బోయెను. ప్రళయకాల రుద్రుని భాతి నరాతి బల వ్రాతంబును భస్మీభూతముగాం జేయుచు వచ్చు జగదేవు నెవ్వరు నెదురుకొనలేక త్రోవ యొసంగి పాఱి పోవం దొడంగిరి. "వాండే జయంతచంద్రుండు. వానిం బొదువుండు" అని జగదేవుండు బలంబులను బురికొల్పి కాశ్మీరు నదలించి పిలిచెను. యోగీంద్రు డప్పటికిం దన యంగరక్షకులను గూడి జయంతచంద్రుని బలమ్ములతో నతి ఘోరముగాం బోరాడు చుండెను. ఎందఱు చచ్చినను లెక్కకు మిక్కిలిగ జయంతుని సైన్యములు వచ్చి వారిం బొదువు చుండెను. యోగీంద్రుండును మఱి యిరువురు యోధులు నెంతయు నలసిపోయిరి. వారిలో నిద్దఱు యోధులు మాత్ర మెంత పరాక్రమము నైనం జూపించు చుండిరి. ఇంక నైదు నిముసములు జగదేవ కుమారుండు సైన్య యుతుం డయి రాకున్న యోగిచంద్రుం డస్తమింప వలసిన వాండే; కాని పరోపకార పరాయణుం డయి యుద్ధ మొనరించు నతనికి దైవ సాహాయ్య మేల కలుగ కుండును? జయంతచంద్రుండు యోగి చంద్రునితోం బోరుటం గాంచి మేఘ గంభీర నినాదంబున జగదేవుం డదలించి సంబోధించి "జలంధారులతోడను నాడువారితోడనా నీ పోరాటము? ని మద మడంతు నని జగదేవుం డేగు దెంచె. తిరుగు మిటు వైపు. కాన్పింపుము ని పౌరుషము. తొల్లి గౌడ దేశ

యశ్వమును నడిపెను. దానిఁ బిరాదినుండి పాంతఁడును లంఘించె. ఖడ్గములతో నిద్దఱును గొట్టుకొన సాఁగిరి. కొంత సేపా తీరున నయ్యిరువురు వీరులును యుద్ధము చేయ రెండు ఖడ్గములును దుత్తునియ లాయెవి. తరువాత వారు ముష్టి యుద్ధమునకు డీకొనిరి. జయంతచంద్రుని సేనానాయకులు తమ రాజును రక్షింప వచ్చి పడుచుండిరి; కాని యోగి వీరు లికువురును, జగదేవుని యంగ రక్షకులును వారి పొంత మగాంచు చుండిరి.

హాహా హూహూ, కేశా కేశిగా నా యిద్దఱు వీరాగ్రేసరులుఁ గొంత సేపు రణ మొనరింప జగదేవుఁడు మేలు చేయి గైకొని యతనిం బుడమిపైఁ బడవైచి యాతని మెడలు నజ్జునజ్జుగాఁ జిమకఁ గొట్టి తన పరివారముచే నాతనిం బెడరెక్కలు విఱిచి కట్టించెను. జయంతుని సేన యల్ల కల్లోలము లయి వచ్చి పడుచుండెను; గాని జగదేవుని మెప్పించు నాతని యంగ రక్షకు లైదు వందలు రౌతులును దత్సేనలఁ బీనుఁగు పెంటలుగాఁ జేయుచుండిరి.

అణహిలపుర బలమ్ము లకస్మాత్తుగా వచ్చి తమకు సాహాయ్యము గావించుట కచ్చెరు వొంది ధైర్యవంతుఁడై వారిం గలిసికొని తన వారిం బురికొలిపి రణధవళుఁడు విక్రమించుచు నటు సదానంద భట్టు మున్నగు వారికిఁ దెలిపి యాయక పోరుచుండెను. శత్రు బలములు కాందిశీకములై పరువిడఁ జొచ్చెను. అందుఁ గల యేకాంగ వీరులు దలపడి పెనంగిరి; కాని అణహిలపుర బలంబులఁ దేఱి చూడ లేక పోయిరి. సముద్రము వలె నుప్పొంగి రెండు యామములు గాఁజె నంతలోఁ దెఱిపి చేసికొని రణధవళుండు జగదేవుని

కడ కరుగు దెంచెను; జయంతచంద్రుని పరాభవమును
గన్నులారఁ జూచెను. తమ రాజు శత్రువులచేఁ జిక్కుటయు
దమ నాలుగు పతాకములు శత్రుహస్తంగతము లగుటయుఁ
దిలకించి బ్రతుకు జీవుఁడా యని కాశీ సైన్యములు తిరిగి
చూడక నలు వలంకులకుఁ బాఱిపోయెను. యుద్ధము
నిలిపివేయఁ బడెను. రణధవళుఁడు తన తమ్ముని రాక
కచ్చెరు వొంది యతనిని సగౌరవంబుగ నాలింగనంబు
గావించుకొని, యిష్టాలాపముల నాడుచుఁ గోటకుఁ దీసికొని
వచ్చెను. ఉదయాదిత్యుఁడును, సిద్ధరాజును, రణధవళుఁ
డును, జగదేవుఁడును గలిసికొని సముచితాలాపమ్ములం
బ్రొద్దు పుచ్చిరి. జయంతుని దాడి చారుల వలన విని గౌడ
దేశ మహారాజు గంభీరసింహుఁడు నాతని పుత్త్రుఁడును,
పుణకోటా నగరమునుండి వీరసింహుఁడును దమ తమ
చతురంగ బలములతో నానాఁటికి ధారా నగరమునకు వచ్చి
చేరిరి. వారును వీరును గలసికొని యానందమ్మున నోల
లాడిరి.

మఱి నాఁ డుదయాదిత్యుండు నిండు కొలువు దీర్చి
యుండెను. సిద్ధరాజ గంభీర సింహాదులు వచ్చి సభ నలంక
రించి యుండిరి. రాజకుమారులును వచ్చి తమ తమ యాస
నముల నలంకరించి యుండిరి. లోకాభిరామాయణముగాఁ
గథా కాలక్షేపములు జరుగుచుండెను. ఇంతలో నచ్చోటి
కొక కాషాయాంబరధారి వచ్చెను. ఎల్లరును లేచిరి.
కూర్చుండుఁ డని సంజ్ఞ చేసి యతఁ డొక శుభ లేఖను సిద్ధ
రాజుగారి చేతి కందిచ్చెను. ఆతఁ డా యుత్తరమును జదువు
కొనెను. ఆతని కన్నుల నుండి యశ్రు బిందువు లొకటి

రెండు జాతెను. చూచువారు నిర్వ్యాజ పడిరి. "నా భాగ్య మే మని చెప్పుదును? ఎనిమిదేండ్లనుండియు నన్నెడఁ బాసిన నా ముద్దుల బిడ్డ నేఁ డిచ్చటికి వచ్చి నన్నుఁ జూడఁ గోరుచున్న దఁట. కుమారా! జగదేవా! నీవును నా వెంట రావలయు నఁట" అని సిద్ధరాజుగారు వచించిరి. "ఆర్యా! జగదేవ కుమారా! మిమ్ముఁ జూడ నమ్మగారు తత్తరపడుచున్నారు. సిద్ధరాజ దుహితయు నమ్మగారి సన్నిధినే యున్నది" అని జడదారి వచించెను. అంత నుదయాదిత్యుండు తన మంత్రి దెసం దిలకింప నతఁడు రథ మాయత్త పఱచి తెప్పించెను. సిద్ధరాజును జగదేవుఁడును, జోగియు రథము నధిరోహించి శ్రీ లక్ష్మీ విలాస భవనమ్మును జేరిరి; రథమును దిగిరి. ఇంతలో లింటినుండి మఱి యిరువురు జోగు లెదురుగ వచ్చి సిద్ధరాజు నొక గదిలోనికిని జగదేవు నిం కొక గదిలోనికిం దీసికొని పోయిరి. అరదము దిగిన జోగి, నిరాటంకముగా లోని కరిగెను. సిద్ధరాజు గదిలో నడుగుఁ బెట్టినంతలో నాతని పుత్త్రికాకన్య యెదురుగ వచ్చి నమస్కరించెను. ఆతఁ డామెం గాంచి యానందమును బట్టలేక గట్టిగఁ గౌఁగిలించుకొని యశ్రు బిందువులచే నామె మూర్ధము నభిషేకించెను; ముద్దు పెట్టుకొనియెను; మూర్ధం బాఘ్రాణించెను. గద్గద స్వరయుత మగు కంఠస్వరముతో "నా తల్లీ! విజయవతీ! ఈ దీనుని విడిచి యిన్నాళ్లెచ్చట కేగితివి? మీయమ్మ శల్యావశిష్టయై యొంటి ప్రాణముతో నున్నది. ఆమెం జూచితివా?" అని రాజుగా రన "నాన్నగారూ! అమ్మగారు నిచ్చటనే యున్నవారు. హేమా! అమ్మగారిని

తీసుకొని రమ్ము" అని చెప్పునంతలో నామె తల్లియు వచ్చెను. పాపము! విశాలాక్షీదేవి యెంతటి యూపిరితో నున్నది. కానక కన్నసంతానము కాలపాలుగా కానరా-కున్నఁ గన్నవారి మనంబు లెట్టు లుండునో వర్ణింప నలవా! కరుణారసమున మునింగియుండు నమ్మ కేమి యాశ్చర్యము? తల్లిదండ్రు లిద్దఱు నామెం గవుంగిలించుకొని ముద్దాడి యానందబాష్పములో విచారాశ్రువులో కాని కన్నీళ్లతో నామె నభిషేకించిరి

అటు పిదప దేవుఁడును లోని కేగినంత శ్రీలక్ష్మీదేవి యెదురుగ వచ్చి, మ్రొక్క వచ్చు తనయు నాలింగనము చేసి కొని "నన్నుఁగన్నవాఁడా! నాభాగ్యవిధానమా! ఎన్ని దినము లయినదోయి నిన్నుఁ జూచి" అని యానందాశ్రువుల నతని పాదములు కడిగెను. "నాతండ్రీ! నీవ లన వీరమాత యను ఖ్యాతి వహించి, నా జన్మము సఫలితని. నినంటి తనయుం బొందించు బాలుఁడా" అని ముద్దు లాడుచుండ వీరమతియుఁ బిల్లలును వచ్చి శ్రీలక్ష్మీదేవి పాదములకు సాగిలి మ్రొక్కిరి. ఆమె కోడలిం గవుంగిలించు కొని కీర్తించి, మనుమల నెత్తుకొని ముద్దాడెను. వారివారి యానందము వర్ణింపఁ దరముకాదు. ముద్దులొలుకు రూపములును మాటలును గల యా మనుమలఁ జూచి యామె యుప్పొంగిపోయెను; తొల్లి తాఁ బడినకష్టములు నిముసములో మఱచిపోయెను.

ఆ మఱునాఁడే శుభముహూర్త మని పురోహితులు చెప్పుటచేత సిద్ధరాజు సాలంకృత యగు తన కన్నియను విజయవతి యను నన్వర్థాభిధానను. వీరమతీనామాఁ

తెరను జగదేవకుమారున కిచ్చి వరదక్షిణగాఁ దనరాజ్య మంతయును ధారవోసి యిచ్చి వివాహముం గావించెను. ఉదయాదిత్యుండును సిద్ధరాజు నానందపారావారమున నోలలాడిరి. శ్రీమహాలక్ష్మీదేవియు విశాలాక్షీదేవియు నెట్టి యానందము ననుభవించిరో యనిర్వాచ్యము. ఇట్లు లా వివాహ మహోత్సవ దినము లందఱకును సంతోష దాయకము లయి జరిగినవి.

---

వింశత్యుల్లాసము

# కల్యాణ పరంపర 2

తరువాత నొకనాఁ డొకసభ కావింపఁబడెను. రాజాజ్ఞ క్షేత్రభటులు ఆ సభకు శృంఖలాబద్ధుం డయి, కారాగారమున నున్న జయంతచంద్రుని రప్పించిరి. వాని నొకచో నిలువంజేసి యా సభ కపరిచితులగు మువ్వురు పురుషులను రప్పించిరి. వారిని జయంతచంద్రు నెదురుగ సముచితాసనంబులఁ గూర్చుండఁజేసిరి. వారల యుదంత మంతయును దననూతన వధూమణిచే నాద్యంతమును సవిస్తరముగ విని యుండుటంజేసి, జగదేవకుమారుం డాసనమునుండి లేచి నిలువంబడి యిట్లు చెప్పెను. "జయంతచంద్రభూపాలా! నీయవస్థకు నీవు విచారింప నవసరము లేదు. నిన్ను మేము హింసింపము. నీ క్రూర కర్మలకుఁ దగిన ప్రాయశ్చిత్తము నందితివి. ఈ వృద్ధుం డెవరో యెఱుంగుదువా? ఈ వీరుల నిరువుర నెఱుంగుదువా?" అని జయం

తుని కట్టెదుర నున్న తాసనము లధివసించి యున్నవారిం జూపించి యడిగెను. అతఁ డేమియు మాఱు వలుకక నిర్లక్ష్యముగాఁ జూచుచుండెను. తరువాత వారల వృత్తాంతము నంతయును జగదేవుం డీ తీరున నుపన్యసించెను.

"సభాసదులారా! ఈ జయంతచంద్రుఁడు తొలుదొల్త ధర్మవర్తనుం డయి తనపూర్వులతీరున న్యాయము దప్పక రాజ్యమును బాలించుచుండెను. ఆయన కెదురుగఁ గూరుచున్న యీ యనఘుఁడే వారిమంత్రిశేఖరుం డగు పరిపూర్ణచంద్రుండు. ఈతనికి దక్షిణపార్శ్వమ్మునం గూరుచుండిన యతఁ డీ మంత్రిగారి పుత్రుఁడు రత్నసింగు. వామభాగమ్మున నున్న వీరుం డీతని మేనల్లుఁడు మాణిక్యసింగు. గౌడదేశయుద్ధమున నాచే నిహతుఁ డయిన యరిభీకరుఁ డీ సచివాగ్రణికిఁ దమ్ముఁడు. వాఁ డసహాయ శూరుఁడు; అతిదుష్టుఁడు. వాఁడే జయంతునికి దుర్బోధఁ జేసి చెడు నడవడికలకుం బాల్పఱిచినవాఁడు. అంతియ కాక తన యన్నగారిబాగును జూచి యోర్వలేకుండువాఁడు. చదువుసాములయందుఁ దమ్మనుకరించు చెలియంద్రతో నీ బావమఱఁదు లిరువురును బదునాఱు వత్సరములు వచ్చువఱకు నింట సుఖంబుండిరి. తరువాత నొకనాఁడు వీ రిరువురును దేశాంతరదిదృక్షుచే నెవరికిం దెలియఁజేయకుండ హయారూఢులై ఖడ్గమాత్ర సహాయులై యొకనాఁటి నిశీథమున నిలు వెడలి పోయిరి. ఆ విచారముచే శుష్కించుచున్న యీ మంత్రిగారి కింకొక కష్టము వచ్చెను. పూఁగోఁట కాటకై పోయిన యీ వీరుల చెలియండ్ర నకస్మాత్తుగా వచ్చి యీ రాజు, తమ్ముఁ బెండ్లాడుఁ డని యనేకవిధముల బోధించెను.

ఎంతకును వా రొల్లకున్నఁ గోపించి బలాత్కరింప నెంచెను. వారల యదృష్టవశమ్మున నచ్చటికి కైదాయుగురు బైరాగులు వచ్చి, మొఱ్ఱ వెట్టుచున్న కన్నెమిన్నల నితనిబారికిం గాక కాపాడిరి. అంత వా రప్పురమ్మున నుండుట ముప్పని తలంచి యా యన్నుల మిన్నలు పురుష వేషములను ధరించి రెండు గుఱ్ఱములను రెండు ఖడ్గములను బైరాగులు తెచ్చి యీయఁ దీసికొని వారల యుపదేశము శిరసావహించి బయలు వెడలిరి ఈ నీచులును వీరి చెలియండ్రును కొన్ని నెలల్లు దేశాటన మొనరించి గౌడదేశ రాజధానికి సమీపమున నొకగ్రామమునందు దోపిడిగాండ్ర పోరాటములోఁ గలిసికొనిరి. తమచెలియండ్రాకళ్లు తెలియక యున్నతఱి వారి నా గ్రామముననే యుంచి వారిగాయములు మాన్పుటకై కొన్నివస్తువులు తేర వీరు గౌడరాజధానియగు వీరసాగరముం బ్రవేశించి యా నగరముపైఁ దను రాజు జయంతచంద్రుండు దాడివెడలి యుద్ధము చేయుచుండె నని తెలిసి, రాజభక్తి మెఱయ వచ్చి, యుద్ధరంగమున కుఱికి, మహాఘోరయుద్ధము గావించి, యద్వితీయ మగు తమ పరాక్రమమును జూపిరి. దైవవశమువలన యుద్ధమునందు నొచ్చి మూర్ఛపడి యున్నవీరిని, జయంతునితోఁ గూడఁ బట్టుకొని మే మప్పుడు విడిచితిమి. వా రనారోగ్యదశయం దున్నప్పుడే కృతఘ్నుఁ డగు నీ జయంతుఁడు, వారు చూపిన రాజభక్తి నైన గణింపక తా నావఱకు మంత్రిగారిని కారాగారమున నుంచినవాఁ డగుట నది విని వీ రేమి చేయుదురో యను భయమ్మున వీరిం గూడఁ గారాగృహముసఁ బడవైచెను. తరువాత వీ రెట్టులో తప్పించుకొని సదానందయోగీంద్రుని

సంరక్షణలో నున్న తమ చెల్లెండ్రను గలిసికొని యింతకాల మచ్చటనే వీరు నుండిరి.

మొన్నటియుద్ధమున యోగీశ్వరునితోపాటు పురుష వేషధారిణులయి యున్న వీరి చెలియండ్రును నీ వీరులును జయంతచంద్రునిబలంబుల నేలకుం గూలకు దెచ్చిరి. జయంతచంద్రుని జయించితి మను పేరు నూకు వచ్చినది గాని యోగీంద్రుని పోషణమ్మున నున్న జడదారులును వీరును గలిసి, యేబదిమంది ముఖ్య సేనానాయకులను నసంఖ్యాకులు దుర్వారబలగర్వితు లగు పోటరులను జంపి జయంతునిసైన్యము నడలఁగొట్టి సుమారు వీనిసైన్యమునం దర్ధభాగము వీరే హతాహతము గావించిరి. ఎట్టులయిన నేమి జయంతచంద్రుఁడును వీరు మువ్వురును శ్రీ నాన్న గారికి స్వాధీను లయిరి. వీరిం గాచి యింతకాలము సంర క్షించిన సదానంద యోగీంద్రులు శ్రీ మామగారికి ముఖ్య ప్రాణ తుల్యులు. కావున నీ నలువురును మామగారికిని స్వాధీనులయి యున్నవారు. ఈ వియ్యంకు లిరువురును జయంతచంద్రునిం దక్కిన మువ్వురి నే విధముగ శిక్షించి రక్షింతురో చూడవలసి యున్నది" అని యుపన్యసించి జగదేవకుమారుండు కూర్చుండెను.

తరువాత సిద్ధరాజోదయాదిత్యులు సంప్రతించుకొని యీవిధముగఁ దీర్పు చెప్పిరి.

"జరిగి పోయినదానికి జయంతచంద్రభూపాలుఁడు పశ్చాత్తాపపడి, తనప్రవర్తనమును దిద్దుకొని తన మంత్రి యగు పరిపూర్ణచంద్రుని మన్నింప వేఁడికొని తనరాజ్యము నకంటకముగా నేలుకొనవచ్చును. నరుం డెట్టివాఁడయు

నను దురాత్ముల చెలిమి సేయునేని యకృత్యము లొనరించుటకు సంశయింపడు. తన పొరపాటును గుర్తించుకొని, యయినదానికిఁ బశ్చాత్తాపపడి. తననడవడికను దిద్దుకొనునేని దైవమే వానిని క్షమించి తోడగు నన లోకము మాట చెప్పనిదేమి? ఆయన చేసిన యపకారములు విధికల్పితములని నిశ్చయించుకొని. యాకసి మనంబున నుంచుకొనక మన్నించి తన్మంత్రిశేఖరుఁడు తన యుద్యోగమును దన కుమారునిచేఁ జేయించుచు నందున కతఁడు తగినవాఁ డగు వఱకుఁ దాను దిద్దుచు రాజ్యతంత్రముల నడుపవలయును. రాజును దనబిడ్డలతోపాటు చూచుచుండవలయును. సదానందభట్టు రెండవమంత్రిగా నుండఁదగును. మాణిక్యసింగు సర్వసైన్యాధిపత్యమును వహింపవలయును. మేనత్త మేనమామలపిల్ల లొండొరులను వరించియున్నవారు గావున రత్నసింగునకును గనకాంగికిని. మాణిక్యసింగునకును హేమాంగికిని బరిణయము మా ధారానగరమ్మునే జరగవలయును. జయంతచంద్రు నిప్పుడే యభ్యంజన మొనరింపఁ జేసి మహారాజార్హములగు నంబరాభరణాదుల నలంకరించి మా యిరువురి యర్ధాసనము నధిష్ఠింపఁ జేయవలయును.''

అను నీ తీర్పును విని సభాసదులెల్లరు నౌ నౌ నని యామోదించిరి. జయంతచంద్రుని యజ్ఞాన మంతయును బటాపంచలయి పోయెను. చిన్ననాటినుండియుఁ దన్నెన్ని విధములనో కాపాడిన పరిపూర్ణచంద్రునికి నమస్కరించి యాతని గుణగణముల నుగ్గడించి తనయపరాధములను మన్నింప వేఁడుకొనియెను.

మఱునాఁడు జయంతచంద్రుండును సిద్ధరాజును,

గంభీరసింహునకును, నుదయాదిత్యునకును బరస్పర స్నేహ బాంధవ్య సమ్మిళిత మానసారవిందములయి; పరిపూర్ణ చంద్రు నెంతయుఁ గొండాడి రెండు వివాహములును విధ్యుక్తముగ మహా వైభవమ్మునఁ గావింపఁజేసిరి. రత్నసింగు కనకాంగిని, మాణిక్యసింగు హేమాంగిని బరిణయమై యమానానందమును జూఱగొనిరి. కృతజ్ఞులగు కొడుకులు నెంతయుఁ గొనియాడి గౌరవించిరి; దిక్కుమాలియున్న కొడుకు బోషించుటయే కాక మంత్రి మున్నగు ముగ్గురిని విడిపించిన కారాగార రక్షకున కొక సైన్యమున కాధిపత్యమిచ్చిరి. వానితోఁ గలిసి తత్కార్యమ్మునకు సాహాయ్యము గావించిన కారాగృహ రక్షకుల కిరువురకిని వానికడ సరదారులుగా నుండ ననువయ్యెను.

కొన్నిదినములచ్చటనుండి కాశీనగరాధివాసులందఱును సందఱికడ సెలవొంది తమ నగరమున కేగిరి. తక్కిన వారెవరి దేశములకు వారేగిరి. వాఘేలాదేవి మాత్రము సవతి యున్నతిని జూచి సహింపలేక యొకనాఁటిరాత్రి యాత్మహత్య గావించుకొనియెను. అందఱు నెంతయో దుఃఖించిరి, జగదేవుఁ డందఱికంటె నెక్కువగా దుఃఖించెను. ఆమెయే తన కంటె ప్రఖ్యాతియుఁ బ్రఖ్యాతి యగు సణాహితపురరాజ్యమును వచ్చుటకుఁ గారణమని యాతని యభిప్రాయము. ఆమెకు నుత్తరక్రియలు జరిగినవి. తరువాత నొకనాఁడు సిద్ధరాజు ప్రయాణమయ్యెను. ఉదయాదిత్యుఁడు తన రాజ్యము జగదేవునికే యీయవలయు నను తన యుద్దేశమును దెలియఁజెప్పెను; కాని జగదేవుఁ డందుల కంగీకరింపక, రణధవళునికే తద్రాజ్యము నభిషేకింపఁ జేసెను.

తలిదండ్రులకడ ననుజ్ఞ నొంది, యిరువురుభార్యలును నిరువురు బిడ్డలును వెంట రా నతఁ డత్తమామలం బోడ్కొని అణహితపురమున కేగెను. ఆ రాజ్యరమాలలామను వరించి పట్టాభిషిక్తుఁ డయ్యెను. పిమ్మట దిగ్విజయ మొనరించి సమస్తరాజన్యులవలనం గప్పములం గొనుచు ననంతయశోవిరాజితుం డయి శ్రీభూదేవతలతో నలరారు జగన్నాథునివలె నాశ్రితరక్షకుం డయి న్యాయ్యమ్ముగ రాజ్యమును బరిపాలించుచుఁ జిరకాలము మహామహుల కాదర్శకుండయి సుఖంబుండెను.

మొదటిభాగము ముగిసెను.

శ్రీ సద్గురవే నమః

# రెండవ భాగము

## ప్రథమోల్లాసము

# సింహావలోకనము

చదువరులారా!

కథ ముగిసినది; కాని మీ మదిలో సందియములు మాత్ర మచ్చటచ్చటఁ బొందుపడియుండును. అవి తీరుట కీ రెండవ భాగమును దప్పక చదువవలయును.

అణహిలపురమును రాజధానిగా నొనరించుకొని గుజరాతు దేశమునఁ గొంత భాగము సిద్ధరాజు పరిపాలించుచుండె ననుమాట మన మెఱింగినదే కదా! "తిండికి లేకున్న మెండు సంతానంబు, పసగల్గు వారికి నిసువు లేదు" అనునట్లు లమ్మహారాజునకుఁ గొంతకాలముదనుక సంతానము లేకుండెను. నవనవ మహావనవిలాసభాసురుండయి యున్నప్పుడు చక్కని చుక్కయగు తన సతీమణి విశాలాక్షీ దేవిం గూడి యా నరేశ్వరుండు నిత్యానంద తుందిల హృదయారవిందుండయి యుండుటం జేసి సంతానము లేని విచార మంతగా నాతని బాధింపదయ్యె. మహావనోపభోగంబుల నించుక దనివొంది, యతఁడు తనయొద్దనున్న సామంతులు పుత్త్ర పుత్త్రికావంతులై యానందించుచుండుటఁ జూచి తనకును సంతానము కలిగి యానందింపఁ జేయునని

యువిళ్లూరుచుండెను. కాలచక్రము గిఱ్ఱునఁ దిరుగుచుండెనే కాని సిద్ధరాజున కానందోదయ మగుచిన్న లేవియుఁ గానరాకుండెను. ఆ భార్యాభర్తల కది యొకవిచారముగాఁ బరిణమించెను. పరమేశ్వర కటాక్షంబునఁగాని యపత్యవంతులు కాఁజాల రని పెద్దలవలన విని యా రాజచంద్రుఁడు జాయాసహితుండై పరమేశ్వరు నారాధించుచు నా యూర వీధి కొక కోవెలవంతున నూఱు పరమేశ్వరాలయములు నిర్మింపంజేసి భూదేవతల కగ్రహారమ్ము లనేకమ్ము లొసంగెను. వ్రతనియమంబుల నిట్లు కొంతకాలము జగదీశ్వరు నతులితభక్తి నా దంపతులు గొలుచుచుండఁ బడంపడి వారి కొక పుత్రికారత్న ముదయించెను. వారి యంతఃపురము నంతరంగము నప్పు డెంతయుఁ దేజోవంతము లయి విరాజిల్లెను. ముద్దులు మూటకట్టు నా కన్యకామణిం జూచి యా దంపతులు చక్షుష్మంతులయిరి. అల్లారుముద్దుగా నమ్ముద్దు బిడ్డను బెంచుచు నానంద సుధారస తరంగ డోలికల వాలూఁగుచుండిరి. ఆ శిశువు దినదిన ప్రవర్ధమాన యగుచు సుధాంశురేఖవడువున లోకంబున కాహ్లాదమును గలిగించుచుండెను. చిన్నచిన్నయూసులు చెప్పుచు "ఉగ్గు, ఉగ్గు" అనుచుండెను. చిఱునవ్వులు నవ్వుచుఁ గేరుచుండెను. పలుకరించినఁ గిలకిల నవ్వుచుండెను ప్రకాశమానము లగు జ్యోతులను జెయ్యి చేయుచు జూచుచు నానందమ్మునఁ గాలుసేతు లాడనొయ్యెచుచు లాలి బాలిక నవ్వు కొనుచుండెను. తొమ్మిదవ నెల ప్రవేశించుటఁ బ్రాకసాగెను. పరిచయుల 'జగదీశ్వరి' యని పిలువఁ జేతు లాడించుచు బోసిపల నవ్వసాగెను. 'అత్త త్త' యనుచుండెను. ప్రాకసాగె

బడుచుండెను; మెల్ల మెల్లఁగ బంగురసాగెను; వడి వడిగ బంగురుచుఁ గూర్చుండ నేర్చెను; చిన్న చిన్న విద్దెములు సేయుచుండెను. "అమ్మా! మమ్మేల వచ్చిన జగదీశ్వరి యేదీ?" అని తలిదండ్రు లడిగిన. 'ఇదిగో' (ఈనో) అని తన బొజ్జపైఁ జిన్నిచేతు లుంచి తన్నే చూపించుచుండెను: 'మా యమ్మ యెవ' రని వా రడిగిన 'నేనే' అని బదులు పల్కుచుండెను. నవరత్నములు పొదిగిన యమూల్య సువర్ణాభరణ భూషితయై యా బాలిక గంధర్వ బాలిక వలెఁ జెన్నలరుచుండెను; గోడలు పట్టుకొనియు, దాదుల వ్రేళ్లు పట్టుకొనియు నడువసాగెను; తనంతట తానే చిన్ని తప్పటడుగులు వేయుచు నంతంతలో నిల్లంతయు నడువఁజొచ్చెను; ఒక్కొక్కమాటయు స్పష్టముగా ననుచుండెను; ఎప్పుడును చేతులమీఁదనె పెరుఁగుచుండెను; ఎవ రేమన్నను వెంటనే యనుకరించుచుండెను; తల్లిదండ్రుల నాటలాడించుచుండెను; చిన్ని చిన్ని పాటలు పాడ నారంభించెను. ఈ విధముగా నా బాలికాపాలనము దినమున కొక వింత సొబగు నొందుచు నెమగ నైదవ వత్సరము వచ్చెను. ఆ బిడ్డ, అక్షరములు నేర్చుకొనెను; ఒక వత్సరములోఁ బుస్తకమును బాగుగఁ జదువఁ గలిగెను; ప్రాక్తన జన్మ వాసనా విశేషమ్మున నాలుగైదేండ్లలో నా కన్నెచిన్న దేశ భాషయందును సంస్కృత భాషయందును సంగీతమందును మంచిజ్ఞానము సంపాదించెను. తలిదండ్రు లామెచదువున కెంతయు సంతోషించిరి; పాటలు పద్యములు నా బాలికవలన విని యమితానందము నొందిరి. తండ్రి యామెను ధనుర్విద్యా విశేషములు నేర్చుకొన నియమించెను. గజాశ్వ రథారోహణము

లయం దా కన్నియమిన్న మిన్న యయ్యెను; ధనుర్విద్యయం దారితేఱెను ; ఆయుధముల నన్నిటి నుపయోగించు పాటవము గలిగించుకొనెను. అంత నామెకు యౌవన మంకురించెను. సహజసుందరి యగు నా బాలికావతంసమునకు యౌవనంపు బస లెంతయు వింత యగు శృంగారమును గూర్చి బంగారునకుం బరిమళము గలిగినట్లు ఉత్కృష్టత గూర్చినవి. అట్టి తన పుత్త్రికామణికి ననురూప విద్యా వివేక బల సంపన్నుం డగు వరుని బతిం గూర్ప మన సిద్ధరాజు జతనము సేయుచుండెను.

ఇట్టు లుండ నొకనాంటి మధ్యాహ్నకాలమునం గపిల మహర్షివంటి యొక జడదారి యచ్చెరువుగ నచ్చోటికి కరుదెంచెను. పండ్రెండు పహారాలయందును విచ్చుకత్తులం బూని ప్రతీహారులు జాగరూకులై కాఁపున్నను నొక్కనికేనిం గానుపింపక, సతీ సంతాన యుతుం డయి యంతిపురి నున్న మహీకాంతుని సన్నిధి కాతండు సరసర నరుదెంచెను. వచ్చిన యమ్మహర్షిసత్తమునిం గాంచి తత్తరపాటుతో లేచి, యెదురేగి, తోడ్తెచ్చి యర్ఘ్యపాద్యాదు లొసంగి సిద్ధరాజు, మునినాథు నర్హాసనాసీనుం గావించెను. సాష్టాంగముగ సతీ సంతానముగ నయ్యోగీంద్రచంద్రునకు నమస్కరించి యా భూమహేంద్రుండు సంభ్రమాశ్చర్య భక్తియుక్తుండై యంజలి శిరంబునం గీలించి "స్వామీ! నన్నను గ్రహింప విచ్చేసిన నారాయణుని వలెం గాన్పించుచుంటివి. నా రాజ్యము నా గృహము నా జన్మమును బవిత్రములయ్యెను. సర్వమును నీ యధీనము చేసినాను. నీ యుద్దేశ

మేమిదో సెలవిచ్చి యీ సేవకుని ధన్యునిఁ జేయుము” అని వినయ విధిజ్ఞుం డయి పలికెను.

అంతట నయ్యోగీంద్రుండు గనుఁ గొలుకుల నశ్రువులు జల జల రాలఁ దుడుచుకొని సిద్ధరాజ మహీశును ఱెప్ప వేయక చూడసాగెను. అతని వైఖరిం జూచి యా ముప్వురును నిశ్చేష్టులైరి. ఆ యోగీశ్వరుని జూచి సంతసనే యా కన్నియకుఁ దన తండ్రియందు వలె నాతని యందును భక్తి యుక్త మగు ప్రేమ ముదయించెను. “మహానుభావా! తమరు కంటఁ దడి వెట్టుట కేమి కారణము? నే నేమి చేయ వలసినను జేయుటకుఁ జేతులు కట్టుకొని సంసిద్ధుండ నయి యున్నాఁడను. సంశయింపక యానతీయఁ గోరెదను” అని పలుతఱపులు రాజు, వినయ విధిజ్ఞుం డయి పలుక “రాజేంద్రా! ఏ మయిన నేమి? కారణ మిప్పుడు చెప్పుటకు వీలు లేదు. మీ కేమియును భయము లేదు. నే నొక సంవత్సరము మీ యంతఃపురమున నుండవలసి యున్నది. దీనికి నీ వంగీకరింప వలయును” అని యోగీంద్రుం డన “నా కింత కన్న నిం కేమి కావలయును? తమ యిష్టము వచ్చినన్ని సంవత్సరము లిచ్చట నుండవచ్చును” అని పలికి రాజు తన తనయ నాతనికి శుశ్రూష యొనర్ప నియమించి, యాతని సమాధి నిష్ఠకు భంగము కలుగకుండు నట్టులు కట్టు దిట్టము లన్నియు నొనర్చి, ధన్యుండ నయితి నని సంతసించుచుండెను.

ఆ బాలికామణి యోగీంద్రు ననిశము నతిభక్తితోఁ గొలుచుచు నాతఁ డనుగ్రహించి యుపదేశించు యోగ విద్యా రహస్యములు నుపనిష దర్థంబులు నల్ల నల్లన నభ్యసించుచుండెను. ఒక వత్సర మీ రీతిని గడచెను. పిమ్మట

నా మునీంద్రుం డొకనాఁడు రాజకుమారికా రత్నమును జేరం బిలిచి "అమ్మా! అనుదినమును నీవు సేయు శుశ్రూష కెంతయు సంతోషించుచుంటిని. నీ యెడల నా మనంబు ప్రసన్న మయినది. నీ కేమి కావలయునో కోరుము" అని పలికెను. "తండ్రీ! నీ పద పద్మ సేవ తక్క వేఱొం డేదియు నా కక్కఱ లేదు" అని యామె బదులు చెప్పెను. "తల్లీ నే నొక మాట చెప్పెద నాలకింపుము. నే నింక నీ యొద్ద నుండుటకు వీలు లేదు. నే నిప్పుడే యరుగ వలయును. ఇన్ని దినములు భక్తితో నీవు నన్నర్చించితివి. దాని కేదియేని ఫలము గలుగవలయును గదా! కావున నీ మనస్సులో నేమి కోరియుంటివో చెప్పుము" అనవుడు "స్వామీ! తీర్థ వాసుల సేవ లభింపని తఱిఁ దీర్థ సేవలను జేయవలయు నని యభిలషించుచున్న దానను. దయ యుంచి నా కోర్కె ఫలించు నట్లు వరము ప్రసాదింపుము" అని యామె పలికెను. అంత నతఁడు, "శిష్యా! నీ కవశ్యము తీర్థ యాత్ర లభించును. నీవు తండ్రిగారితోఁ జెప్పి కొంత సైన్యమును, విలువగల రత్నములను, కొంత ధనమును దీసికొని రేపటి యుదయమే పయనము గమ్ము. దారిలో నీ కనేక కష్టములు వచ్చును. దేనికిని భయంపడకుము. మిక్కిలి దుఃఖము నొంది నీ వొడలు తెలియక పడి యున్నప్పుడు నేను వచ్చి నీ శోకము నడంతును. దుష్టులను శిక్షింపుము; శిష్టులను రక్షింపుము. తొలుదొల్త నీ మనస్సు హరించు నెవఁ డతండే నీ మనోహరుండగును. అతఁ డెట్టి వాఁ డయిన నతనిం బరిణయ మగుటకే సర్వథా ప్రయత్నింపుము. రేపటి ప్రయాణము మాత్రము మానకుము. మఱి యొక్క మాట విన్నదుగ వలసి

యున్నది. నిజముగ నాయందు నీ కెట్టి భావ ముదయించి నదో వచింప వలయును'' అని యడిగెను. ''మంత్రీ! నిజ ముగ నీవు నా మంత్రి వని యే నా యభిప్రాయము. ఏ మందువా! మొట్ట మొదట నిన్ను జూచినప్పుడే నీ యందు నాకుఁ బితృభావ ముదయించినది. నే నటులఁ దలంచి యుండ నీవే యడిగితివి. పూర్వ జన్మ సంబంధ మెట్టిదగు చో నే నెన్నఁ జాలను'' అని యామె పలుక మోహనచంద్రుని కనుఁ గొలకుల నీరు నిండెను. ''అమ్మా! నిజము. ఇంత కంటె నిప్పు డేమియును చెప్ప వలను పడదు. తుద కన్ని యును దెలియఁ గలవు. నీవు తప్పక నేఁడు ప్రయాణము గమ్ము. రాజుగారితో నీ ప్రయాణమును గురించి ముచ్చ టించెదను నే నరిగెదను'' అని యతండు దిగ్గన లేచి యా కన్నియఁ గౌఁగిలించుకొని మూర్ధం బాఘ్రాణించి, దీవించి, యామెచే ననిపించుకొని రాజుగారి కడకు వచ్చెను. రాజుం జూచి, ''రాజేంద్రా! నే నిప్పు డేగుచున్నాఁడను. నీతో నొక్క మాట చెప్పవలసి యున్నది. దానికి నీ వంగీకరింపక తీరదు. నీ తనయ నిన్నేమి కోరినను నా దనక యనుమతింప వలయును. దానం జేసి నీకు నామెకును మే లగును. లేదేని దుఃఖములు మిమ్ముఁ జుట్టుకొనును. నే నా నాఁడు కన్నీరు పెట్టుట కిదియే కారణము. ఇంతకు మించి యిప్పు డేమియుఁ బలుకరాదు. కావునఁ దప్పక యామె యిష్టము వచ్చినట్లు సేయ ననుజ్ఞ యిమ్ము'' అని చెప్పి రాజుగా రెంత ప్రార్థించు చున్నను నిముస మయిన నచ్చట నిలువ నొల్లక యమ్మోహనయోగి రాణ్మౌళి యంత నంత ద్వారమ్ములు గడచి, రాజమార్గ

మును బట్టి చూచు వారందఱు నచ్చెరువొందు చుండ వాయువేగమునఁ గొంత దవ్వరిగి యదృశ్యుం డయ్యెను.

రాజపుత్త్రికయుఁ దలిదండ్రుల చెంత కేగి వెంచి నమస్కరించి "జననీ జనకులారా! తీర్థసేవ సేయవలయు నని నా కొక కోర్కి జనియించెను. యోగీంద్రు నాజ్ఞయు నయినది. కావున మీరును మాఱుమాటాడక యంగీకరింపవలయు నని మిమ్ము వేఁడుకొనుచున్న దానను. నాకుఁ గొన్ని యమూల్య రత్నములును గొంత ధనము నొసంగి, తగినంత సైన్యము నొసంగి మీ రిపుడును దీవించి నన్ను నంపవలయును" అని పలికెను. యోగీంద్రుని మాట విన్నప్పటి నుండియుఁ దన పుత్త్రిక తన్నెట్టి కోరిక కోరునో యయ్యది యెట్టి శ్రమపడి యైనఁ దప్పక తీర్పవలయు నని యువ్విళ్లూరుచున్న యా రాజోత్తముఁ డీ మాటలు విని మిన్ను విఱిగి మీఁదఁ బడినట్లు మూర్ఛ నొందెను. విశాలాక్షీ దేవియు మూర్ఛలో మునిఁగెను. పాపము! లేక లేక యొక్క యాఁడుబిడ్డ కలిగెను. అది లావణ్యాసీమ; విద్యానిధాన; గుణముల ధామము, అట్టి తమ యానంద నిధానము, కన్నియ యయి యున్నప్పుడే తమ్ము విడిచి తీర్థయాత్రాభిలాషిణి యై బయలుదేఱ నున్నది యని తెలియు నప్పుడు వారి సంతాపమునకు మేర యుండునా? మూర్ఛదేఱి పెద్దయుం బ్రొద్దు నీ వేగవల దని వారాపెను బ్రతిమాలిరి; తామును వచ్చెద మనిరి; నిన్ను విడిచి ప్రాణములు నిలుపలే మనిరి; ఏడ్చిరి. ఏమన్న నేమి ప్రయోజనము? ఆ బాలికామణి కన్నులు మూసి యోగీశ్వరుని ధ్యానించి మనంబులు తనకు స్వాధీనము లగునట్లు సేయు మని

ప్రార్థించెను. ఎట్టకేల కెట్టులయిన నేమి, తమ ముద్దు
తనయ కోరిక తీర్చుట కా రాజదంపతు లంగీకరించిరి; వేగ
ముగాఁ బరిజనమ్మును జెప్పి యొప్పించిరి; ఆమె కోరిన
ప్రకార మన్నియు సమకూర్చి యిచ్చిరి. తమ యనుంగు
కూతుం గవుంగిలించుకొని కన్నుల నీరు వెట్టుకొని యా
దంపతు లామెను గొంత దూర మనిపిరి. ససైన్యయై
యామె కనుచూపు మేర దాఁటినంత నా రాజదంపతులు
యోగీంద్రునిం దలంచి నమస్కరించి, చేతు లెత్తి సహస్ర
లింగేశ్వరునకును మనస్ఫూర్తిగ నమస్కరించి. తమ తన
యను నిరంతరమును గాపాడు చుండు మని వేఁడుకొని
కన్నీరు మున్నీరుగా నేడ్చుచు నింటికి మరలిరి. పాపము!
ఆ నాఁటి నుండియు నా యాలు మగలు సంతస మెట్టిదో
యెఱుంగ రైరి. అహా! ప్రారబ్ధమును దప్పింప నెవ్వరికిని
వశము గాదు గదా!

---

## ద్వితీయోల్లాసము

అటు నా రాజకుమారియుఁ జిన్న చిన్న మజిలీలు
చేయించుచు నచ్చటచ్చటం గల తీర్థమ్ముల స్నాన మొన
రించుచు దేవతలను దర్శించుచుఁ గతిపయ ప్రయాణమ్ము
లకు గంగా నదీ విహార భూమియుఁ, బవిత్రతమము నగు
శ్రీ కాశీ క్షేత్రమ్మును సమీపించెను; గంగా నదీ తీరమ్ము
నకు వచ్చు సరికై దాఱు గడియల రాత్రి యగుటచేత
నచ్చటనే యొక సమ భూమిని డేరాలు వేయించి, యా.

రాత్రి యందే నిలిచి, మఱునాఁడు పుణ్య వారాశి యగు వారణాసి కేగవచ్చు నని నిశ్చయించెను. పరివార మంత యును వంటలు చేసికొని భుజించి శయనించిరి. కావలి వారలు తప్ప రెండు యామముల రాత్రి కెల్లను నొడలు మఱచి నిదురింప సాగిరి. సిద్ధరాజ తనయయు శయనించి నిదురించు చుండెను. ఆ నిశీథమ్మునసే తత్సేనా నాయకుం డగు విట్ఠల దాసను నాతఁడు దుర్మార్గ ప్రవర్తకుఁడై, కావలి వారిని లోపఱుచుకొని. రాజపుత్రిక పండుకొని యుండిన తట్టు గుడారమునఁ బ్రవేశించి నిద్దురలోఁ గలఁ గాంచి కల వరించుచున్న యామె హస్తమును బట్టుకొనెను. వెంటనే యామె లేచి మొల నున్న కైజారు దూసి వాని కంఠమ్మునఁ గ్రుచ్చి చంపి వాని కళేబరముఁ బడిన చోట వదలఁ జేసెను. ఇది మన మిదివఱకె చెప్పియున్న విషయమే. అప్పుడే యామెకు మనము విజయవతి యని నామధేయమును వాడియున్నాము. ఇంక నామె నా నామధేయముతోడనే వ్యవహరింతము.

ఆ విజయవతి. నాఁటి రాత్రి యా సేనా నాయకు నట్లు త్రుటిలోఁ జంపి, యింక నెందఱు దుష్టవారా కూటమున నున్నవారో, యెప్పటి కేకీడు మూడ నున్నదో యని భయ పడి, తన కడ నున్న యమూల్యము లగు రత్నములను బదిలపఱుచుకొని, పురుష వేషమును ధరించి, విల్లు నమ్ములు ఖడ్గమును గైకొని, తన చెలులతోఁ గూడఁ జెప్పక యొంటిగ గుడారమును విడిచి హయారూఢ యయి బయలు వెడలెను. కావలి వా రామెను గుఱుతు పట్ట నేరక విట్ఠల దాసే తన వేషము నా తీరున మార్చుకొని యెచ్చటికో పని మీఁదఁ బోవుచున్నాఁ డనుకొని యూరకుండిరి.

విజయవతి, ఆ తీరున గంగాతీరము ననుసరించి గుఱ్ఱమును నడిపించుచు నొక మార్గమును బట్టి ఆ నిశీథమున నేఁగుచు మోహించుచు కొంతదవ్వరిగి గుఱ్ఱము నుండి దిగి, దాని నొక చెట్టునకుఁ గట్టి యొక చెట్టు క్రిందఁ బరుండెను. తాను బుట్టిన చోటును, పెరిగిన రీతియు, అభ్యసించిన విద్యలును, యోగీశ్వరుని సేవయు, తీర్థయాత్రా ప్రయాణమును సేనానాయకుఁడు గావించిన దారుణ సాహసమును, వచ్చిన విధమును. ఉండు చోటును, స్థితియును నొక్కొక్కటిగఁ దలంపునకు రా నామెకు దుఃఖ ముద్రేకించెను. అంతలో మూర్ఛ వచ్చెను. తరువాత నిద్రకు లోనయ్యెను. తూర్పు తెల్లవాఱు చుండెను. పక్షులు కల కూజితములు చేయు చుండెను. మంద మారుతమ్ములు వీచుచుండెను. విశ్వనాథుని యాలయము నుండి ఘంటానాదము వినవచ్చు చుండెను. విజయవతికి స్వప్నమున యోగీంద్రుఁడు సాక్షాత్కరించెను. ఆమె యులికి పడి లేచి కన్నులు విప్పెను. ఎదుట యోగీంద్రుఁడు పొడఁగట్టుచుండెను. ఆమె లేచి యాతని పాదమ్ములపైఁ బడి జరిగిన యుదంతము నెఱింగించెను. "తల్లీ! భయపడకుము; విచారింపకుము. ఇది యంతయుఁ బురాకృత కర్మ ఫలము. అనుభవింపక తప్పదు. మనము నేఁడే కాశీ నగరమున కేగవలయును. ఇవిగో, ఈ మూలికలను గైకొనుము. ఆఁకలి దప్పు లంతగా బాధించునప్పు డిందున నొక్కొక్కటి నమలి మ్రింగినచో రెండు మూఁడు దినములు మఱి యాఁకలి దప్పియుఁ గానరావు. ఈ ఘుటికయును నీ పెద్ద మూలికలును భద్రపఱుచు కొనుము. ఇవి సర్వవిష, విషజ్వర హారములు. శుద్ధోదక

ముతో వీని కనుపానము" అని యా వస్తువుల నొసంగెను. ఆమె యవి భద్రపఱుచు కొనియెను. తరువాత నతఁ డామెను దురంగ మెక్కించి గంగా తీరమునకుఁ దీసికొని వచ్చెను. పడవ నెక్కి వారు వారాణసీ నగరమును ప్రవేశించి, గంగా తీరమున నున్న యొక మఠములో బస చేసిరి. ఆ నాఁటి సాయంకాలముననే తన్నగరాధి నాథుం డగు జయంతచంద్రుఁడు మంత్రిగారి కూఁతురును, మేనగోడలిని నుద్యానమునం జేరం బోయి తన్నుఁ బరిణయము కండని చెప్పుటయు, వారు నిరాకరించుటయు, నతఁడు బలాత్కరింపఁ బ్రయత్నించుటయు. నష్టుం డకస్మాత్తుగాఁ గొందఱు బైరాగు లచ్చటికి వచ్చి వాని నా సాహసము నుండి మరలించి యా బాలికల నాతని బారినుండి తప్పించుటయు మనకుఁ దెలిసియున్న యంశమే కదా! ఆ బైరాగులలోఁ బ్రధానుఁడు మన యోగి పుంగవుఁడే. గంగా తీర మఠంబున నున్న తన శిష్యులను దోడ్కొని త్రికాలవేదియు సర్వజ్ఞుండు నగు నతఁ డచ్చోటికి వచ్చి రాజు నదలించి బాలికలను రక్షించెను. తరువాత నా బాలికలకుఁ గొంతదనుక బోధించి తన శిష్యులను బంపి యా రాత్రి వారి ఖడ్గములును, రెం డుత్తమాశ్వంబులును దెప్పించి మగవారి దుస్తులు గొన్ని దెప్పించి వారి కిచ్చి వా రిద్దఱం దెచ్చి విజయవతితోఁ గూర్చెను. "మీరు ముగ్వురును బురుష వేషధారిణు లయి కొంతకాలము తీర్థయాత్రలను జేయుచు దైవమును ధ్యానించుచుఁ బవిత్ర హృదయు లయి మెలంగుఁడు. మీ మీ వాంఛలు ఫలించును" అని చెప్పి దీవించి యోగి వారి ననిపెను.

ఆ మఱుచటి దినము రాత్రి, కారాగారమునం దుండి తన గతికి దురపిల్లుచున్న మంత్రి పరిపూర్ణ చంద్రుని కొక ఋషి. సత్తముఁడు గాన్పించి కొంతవఱకుఁ బ్రసంగించి ధైర్యము సెప్పి చనియె నని మన మీ వఱకుఁ బ్రథమ భాగమునఁ దెలిసికొని యుంటిమి గదా! ఆ ఋషి. సత్తముఁడును మన యోగి సత్తముఁడే. మంత్రి యాతని సహోదరుఁడె ట్లయ్యెనో మన యందు దయ గలిగి యోగీంద్రుఁడే యీ యుదంతము నానతీయ వలయును. లేకున్న మన కేమియును దెలియరాదు.

విజయవతి పురుష వేషధారిణి యై నిశీథమున గుడారమును విడిచి బయలు వెడలి పోయె నని మఱునాటి యుదయమునఁ గాని యీ సైన్యము వారికిఁ దెలియరా దయ్యె. తమ సేనాధినాథుండు చచ్చి పడి యుండుటయు, రాజకుమారి యెందె నరుగుటయుం దెలిసి, యంతలి యథార్థ మిట్టి దని బుద్ధిమంతు లగు నుద్యోగులు ఊహించిరి. రాజకుమారి లేక వారు సిద్ధరాజు నగరమున కెట్లు పోవుదురు? కావున వారామె యగుపించు నంతవఱకు వెదకుటయు, నర్ధరాత్రులయందు లూటీ చేసి జీవించుటయుఁ గార్యమని నిశ్చయించుకొని, పల్లెలు పట్టణములు వెదకుచు లూటీ చేయుచుఁ దిరుగుచుండిరి.

---

# తృతీయోల్లాసము

కాశీరాజమంత్రి యగు పరిపూర్ణచంద్రుని తనయుండు రత్నసింగును, మేనల్లుండు మాణిక్యసింగును దమకు వివాహములయి యుద్యోగములం గుదురుకొన్న పిదప, దేశసంచారము చేయుటకు వలనుపడ దనియు, దేశాటనమున నైజముగ నయ్యెడు వంశము లింతలోనే తెలిసికొనవలయు ననియు నిశ్చయమును గలియం బలికికొని యొకనాఁ డర్ధరాత్రమున్న నేరికిం దెలియకుండ నశ్వారూఢు లయి, తగిన ధనమును సేకరించుకొని, యిరువురు బయలువెడలి తిన్నగ కాశ్మీరదేశమున కేగిరి. తరువాతఁ గాన్యకుబ్జమున కేగి, యచ్చటి రాజు నాశ్రయించి వాని సైన్యమునకు నాయకులయి వారు కొంతకాల మచ్చట నిలిచిరి. పిమ్మట నా దేశమందుం డచ్చట నుండుట కిష్టము లేక బయలువెడలి వచ్చుచుం ద్రోవలో ననేక నగరములు పల్లెలు, గ్రామములు, నదులు, నరణ్యములు చూచి, యచ్చ టచ్చటం గల యాచారవిశేషమ్ములను, భాషా విశేషమ్ములును దెలిసికొని, ధారానగర సవిధ భూముల కొకనాఁటి సాయాహ్నమునకు వచ్చిరి. వారు వచ్చుదారిలో నష్టముగ నొక బ్రాహ్మణుఁడు పడియుండెను. వారు గుఱ్ఱములను దిగి యా విప్రుని చెంత కరిగిరి. అతఁడు కాయము నిండ గాయములు దగుల నొడలు తెలియక మూర్ఛపడి యుండెను. పాప మా బాపనిపై జాలి నొంది వారు సమీపమున నున్న జలాశయమునకుం బోయి తమవద్ద నున్న వెండి పంచపాత్రముతో నుదకము

దెచ్చి యాతని మొగముం గడిగి నోటిలోఁ గొంచెము నీరు వోసిరి. కొన్ని నిముసముల కా బ్రాహ్మణుఁడు కను విచ్చి చూచి "నాయనలారా! మీ రెవ్వరు? నేను గంత గత జీవినై యుంటిని. నా మనస్సున బాధించుచున్న యంశ మొక్కటి యెవ్వరితోఁ జెప్పికొనుటకు నింత వఱకు వీలు చిక్కినది కాదు. అది నా మనస్సులో నుండఁగ నా ప్రాణములు పోవు" అని యనెను. రత్నసింగాతనిం దన మీఁద జేరఁబడునట్లు చేసి యాశ్వాసింపఁ గొంతసేపటివఱకు నుపచారములు చేసి "స్వామీ! మీ మానసంబున నేమి యున్నదో వచియింపుఁడు" అని పలికెను. బ్రాహ్మణుఁడు హీనస్వరమున నిట్లు చెప్పెను. "కుమారులారా! వినుండు. ఈ ధారానగరమును బాలించు రా జుదయాదిత్యుఁడు. నేనతని యాస్థానమున జ్యోతిర్విద్యా విశారదుం డను బిరుదము నొంది రాజసన్మానము లందుచుఁ బండిత పదవియందుంటిని. జ్యోతిష శాస్త్రమున నన్ను మించిన వా రెవ్వరును లేరు. అట్లే యనను దారిద్ర్యమునఁగూడ నన్ను మించినవారు లేరు. పండితులయిండ్లలో నినుప కట్లతో దారిద్ర్యదేవత కట్టంబడి యుండు నని పెద్దలు చెప్పుమాట నాయం దన్వర్థమయినది. తిండికి లేనప్పుడు సంతానము తక్కుమిక్కిగ నుండు ననుటకును నేనే తార్కాణము. లేమితో బాధపడువాఁ డెట్టి కొంచెపుఁ బనినైనం జేయ వెనుదీయఁడు గదా! మా రాజుగారి పెద్దభార్య నా కమితముగ ధన మొసఁగి యామె సవతికిఁ గలిగిన పుత్త్రుని జాతకము విషమ గ్రహకూటముగ సిద్ధముచేయు మని బోధించినది. లేమి బాధ కోర్వలేక నే నాపాపపుఁబని కొప్పుకొంటిని. జాతకము

స్థము గొన్ని యనర్థములు శాస్త్రరీతి ననుసరించి కాన్పించు చుండుటచేత వానికి నా యిష్టము వచ్చినట్లు తలమార్పులు పెట్టి రాజునకు దుర్బోధ గావించితిని. నా మాటలు నమ్మి రాజు, పురుడు వెళ్లినంతనే చిన్నభార్యను దత్పుత్త్రినితో, నా పుట్టినింటికిఁ బంపివేసెను. తరువాత రెండు మూఁడేండ్ల వఱకును నా నదుమంత్రపుఁ గల్మి నన్ను విఱ్ఱవీఁగించినది; అంతలో దారిద్ర్యదేవతను మఱచితిని. ఇట్లుండ హఠాత్తుగా నాభార్య మహామారీ గ్రస్తయై మరణించెను. ఏడాది కొక్క సంతానము వంతున నా కొడుకు లాఱుగురును, కూఁతులు ముగ్గురును మృతినొందిరి. నేఁ జేసిన దుస్తంత్రము రాజుగారికి నా చర్యల వలననే తెలిసిపోయెను. ఆ బాల గోపాలమును నేఁ జేసిన యవినీత కార్యమును గుఱుతించిరి. రాజుగారు నన్నుద్యోగము నుండి తొలఁగించిరి. పిదపఁ జిన్న భార్యయుఁ గొడుకును వచ్చిరని యా పెద్దమ్మవారు నాపైఁ గోపించి నాకు దేవిడిమన్నా చెప్పించిరి. నాలు గైదు దినముల క్రిందట నర్ధరాత్రమున దొంగలు నాయింటఁ జొచ్చి నా సర్వస్వమును దోఁచుకొనిరి. నేను కేకలు పెట్టినను గ్రామములోనివా రెవరును రారైరి. తండ్రులారా! ఏమి చెప్పుము నెదరు నా యవస్థ! నే నీదుఃఖమును, నపకీర్తియుఁ బడలేక యాత్మహత్య చేసికొన వలయు నని యీ యరణ్యమునకు వచ్చితిని. నే వచ్చుసరికి, ఈ చెట్టుక్రిందఁ గూర్చుండి కొందఱు దొంగలు నా యింటఁ గొల్ల పెట్టిన ధనమే పంచుకొనుచుండిరి. వారు నన్నుఁ జూచి తమ్ముఁ బసిపట్టి వచ్చితి ననుకొని బడియల ధరించి నా మొఱ్ఱ వినక నన్ను హతా

హాతము గావించితి. ఆ ధనముం గొని వారందఱెందో పోయిరి. నేను గావించిన పాపమునకుం దగిన ప్రాయశ్చిత్త మొందితిని. నాలుక చుట్టుకొని వచ్చుచున్నది. మీ చేతులలో నేఁ బ్రాణములు విడుచుచున్నాఁడను. మీ కంటె నాకెవ్వరాప్తులు లేరు. ఈ యనాథ ప్రేతమున కగ్ని సంస్కారము గావించి కోటి యజ్ఞములు చేసిన ఫలము నొందుఁడు. మీరు దీర్ఘాయుష్మంతుల రయి సుఖం బుందురు గాత" మని చెప్పి యాశీర్వదించి కన్నులు తేల వైచి ప్రాణమ్ములను విడిచెను. అచ్చటి పుల్లలెల్లఁ బ్రోఁగు చేసి చెకుముకితో నగ్ని పుట్టించి వా రాతని కగ్నిసంస్కారము చేసిరి. అది పూర్తి యయిన తరువాత వారు యథేచ్ఛం జనిరి.

---

## చతుర్థోల్లాసము

పురుష వేష ధారిణు లగు మువ్వు రంగనలు వారాణసీ నగరము నుండి బయలు దేఱి యచ్చటచ్చటం గల పుణ్యక్షేత్రముల కేగుచుఁ గొన్ని దినంబులకు 'టుకటోడా' గ్రామమునకు వచ్చిరి. వారు వచ్చు సరికా నగరమ్మున వీరమతీ జగదేవుల కల్యాణ మహోత్సవము జరుగుచుండెను. వీ రొక యిల్లద్దెకుఁ దీసికొని యందు నివసించి పెండ్లి వేడుకలు తిలకించిరి. మఱునాఁటి యుదయమున సుమా రొక జాము ప్రొద్దెక్కు తరుణమున విజయవతి స్నానగృహమున స్నానము చేయుచుండ బొరుగింటి నుండి యిరువురు స్త్రీలాడుకొనుచున్న మాటలు విన వచ్చెను.

"సోదరీ! మా దేవి మనోరథమును నేఁటికిఁ బూరించితిని. జగదేవ కుమారు నెట్లు లయినఁ గడతేర్ప వలయునను నా ప్రాణిక నెఱవేఱినది. ఇంక నా యిల్లంతయు సువర్ణ మయ మగును. నా యొడలంతయు రత్నాభరణములతో నిండిపోవును; కాని పాపము నిష్కారణముగ జగదేవుని బావమఱఁదియు మా రాజుగారి యేకపుత్రుండు నగు వీరసింహుఁడు కూడ నేనిచ్చిన విషయుక్తమ్ముల నగు దుగ్ధములం ద్రావినాఁడు" అని యొకతె యన "అయ్యో! పాపాత్మురాల! మా రాజకుమారునిఁ గూడ నంత మొందించితివే! ఎంత పని చేసితివే" అని రెండవ యామె పలికెను. "ఏమి చేయు మనెదవు? ఇరువురును గలిసి వత్తు రని నే నెఱుంగుదునా? తలవని తలంపుగ నతఁడు వచ్చెను. జగదేవునికి నే నమర్చిన భోజనమే యిరువురును గొంచెము కొంచెము దిని యా క్షీరము ద్రావిరి. ప్రాతఃకాల భోజనమునకుఁ దన మఱఁదిని దీసికొని వచ్చిన జగదేవునిదే యీ తప్పు. ఈ పాటికి, వా రుద్యానము నందలి సౌధమున కేగి యుందురు. ఐశ్వర్యము వచ్చునను సంతోషము పట్టలేకున్నను దుష్కార్యము చేసితి నని యప్పటి నుండియు నేను హృదయ పరితాపము నొందుచుంటిని. వేయి తేళ్లొక్కసారి కుట్టినట్లు నా యొడ లాపాద మస్తకమును నొచ్చుచున్నది. పాపము! వా రేమగుదురో గదా!" అని మొదటి యామె పలికెను. "ఎట్లయిన నేమి, రాజకుమారుల కిరువురికిని మృత్యు దేవత వైతివి గదా! ఛీ, చాలు నీ పాటి కూరకుండుము" అని రెండవ యామె పలికెను. వా రిరు

పురిలో మొదటిది వాఘూల చెలికత్తె యగు కుశలయు రెండవది యామె చెల్లెలు నని మన మెఱుంగ వలయును.

ఆ మాటలు వినుచున్న విజయవతి యులికి పడి చెలికత్తెలను దుస్తులు వేసికొని తురంగముల నెక్కి వేగముగా రండని చెప్పి, తాను దన దుస్తులను వేసికొని మూలికలను బట్టుకొని తురంగము నెక్కి పూలతోఁట కరిగెను. అచ్చట జగదేవుఁడు శావమఱఁదితోఁ గలిసి మాటలాడు చుండఁ దోడివారిని గలిసికొని యొక రాజకుమారుండు వచ్చుటయు, సర్వ విషహర మను మూలిక నుపయోగించి వారిని బ్రతికించుటయు మన మెఱిఁగినదే గదా! ఆ రాజకుమారులే పురుష వేష ధారిణు లగు విజయవతీ, హేమాంగీ, కనకాంగు లని మన మెఱుఁగ వలయును. అప్పుడే జగదేవుని సుందరాకారము విజయవతి మనస్సును హరించెను. వారిని బ్రతికించు మందుల కోసఁగి సౌధము వెలువడి వచ్చు నప్పుడంతరంగమున విజయవతి "ఈ మహాపురుషునే నేను బెండ్లాడెదను. ఈతం డంగీకరింపని నాఁడు యోగిని నై యిట్టులే కాలము గడపెదను; కాని యన్యులఁ గన్నెత్తి యైనం జూడను" అని ప్రతిజ్ఞఁ గైకొనియెను.

వాఘూలా దేవి చెలిమికత్తె కుశలను మన మెఱుంగుదుము గదా! ఆమె కొక చెల్లెలు టుకటోడాలో నున్నది. శావ మఱఁదుల కిద్దఱకును విష ప్రయుక్తము లగు క్షీరమ్ములం ద్రావ నిచ్చి, యా ఘనకార్యమును దన చెల్లెలితోఁ జెప్పుటయు నామె తన యక్కను నిందించుటయును వారింటికిఁ బొరుగుననే బస చేసియున్న విజయవతి చెవులం బడుటయు మనకుఁ దెలిసినది. 'నిష్కారణముగా నిరపరాధు

నను జంప యత్నించిన దానఁ గదా యని కుశల పశ్చాత్తాప తప్త యైన యా నిముసము నుండియు శరీర స్మృతి తప్పి పోయెను. ఆమెకు హృదయము చెదరిపోయెను. రాజకుమారులు చని పో లేదని తెలిసినను కుశల మనస్సు కుదుటఁ బడదయ్యె. అప్పటి నుండియు నామె వెఱ్ఱి యెత్తి దేశముల పాలయి, తిన నన్నమును, గట్ట గుడ్డయును లేక యరణ్యమ్మున సర్ప దష్టయై మృతి నొందెను.

విజయవతి మున్నగు ముగ్గురును పెండ్లి వారి వెనుక నా రాత్రియే బయలు దేఱిరి. ఒక మజిలీ వెనుకగాఁ బెండ్లి వారితో వీరును గౌడదేశమున కేగిరి. పెండ్లి వారు వీర సాగరమును జేరిరి. వీ రా సమీపమున నున్న యొక గ్రామమును జేరిరి. సాయాహ్నమ్మున కా యూరు చేరి యందూరి చావడిలో బస చేసి గ్రామస్థు లొసంగిన పాలును బండ్లును నాపడి, యం దొక గదిలో శయనించిరి. తరువాత రత్నమాణిక్య సింగులు వచ్చి తమ గది కెదుటి గది యందు బస చేసి స్నానార్థము సరస్సున కేగుటయు, నంతలో లూటీ వ్యాపారమునఁ దిరుగుచున్న విజయవతి సైనికు లా గ్రామము కొల్లఁ బెట్టుటకై వచ్చుటయు, విజయవతి మొదలగు ముగ్గురును గ్రామస్థులను గాపాడుట కొఱకా దొమ్మిలో యుద్ధము చేయుటకై చొచ్చుటయు మనము చదువుకొన్న దే. విజయవతి దోపిడిగాండ్రను జూచి తన సైన్యమువారే వా రని యానవాలు పట్టి, వారి నే హానియు నొందింపక, కొల్ల చోటు విడిచి గ్రామోపాంతమున కేగి వారం దచ్చటఁ గూడుకొన్న తరువాత వారిం గలిసికొని తన్నెఱింగించు కొనక వారల వృత్తాంత మంతయును విని తా నొక రాజపుత్రుండ

ననియు వారికిఁ బ్రధానాధికారిగా నుండుననియు, వారి రాజ పుత్త్రికను వెదక సాహాయ్యము సేసెద ననియును జెప్పి యొప్పించి, వారిం దోడ్కొని మఱునాఁటి యుదయమునకు వీరసాగరమును బ్రవేశించెను. ఆ నాఁడు కాశీ నగరాధీశుని బలములకు గౌడ దేశ సైన్యములతోడను, ధారా నగర సైన్యముల తోడను జరుగుచున్న యుద్ధములో విజయ వతియుఁ గనచ్ఛారిణి యై, తన మనోహరుం డగు జగదేవుని కంగరక్షకత్వమును వహించి యోపిన కొలఁది బోరెను.

అట నా పల్లియలో దోపిడిమూఁకను దఱిమిన తరు వాత రత్న మాణిక్యసింగులును హేమా కనకాంగులును గలిసికొనిరి గదా! వారు శరీరాయాసము మిక్కుటముగా నొందియున్నవా రగుటచేఁ దమతమ యుదంతములను సాంత ముగాఁ బరస్పరమును దెల్పుకొను నవకాశ మంతగా లేక పోయెను. వారేవో కొన్ని కొన్ని సంగతులు మాత్రము మాట లాడుకొనిరి. తమ సోదరీమణులకుఁ గాయముల నిండ గాయ ములు తగులుటచేతఁ గొన్ని యుపచారము లచ్చటఁ జేసి యేవియో కొన్ని వస్తువులు కావలయునని రత్న మాణిక్య సింగు లిద్దఱును హయారూఢులై వీరసాగరమునకుఁ బయ నమై గ్రామాధికారి రక్షణమ్మున వారినుంచి వెడలిపోయిరి. రాజధాని నగరమున కేగినపిదపఁ దమ రాజగు జయంత చంద్రునం డారాజ్యముపై దాడివెడలె నని విని యుద్ధారూఢులై యొడళ్లు మఱచి యా బావ మఱఁదులు తమ రాజభక్తియుఁ బరాక్రమమును గనుపఱుప నదను నయ్యె నని పొంగి ఘోర ముగా జరుగుచున్న యప్పోరాటములోఁ జొచ్చిరి. తమ కాత్మబంధు వగు నరిభీకరసింహుఁడు జగదేవునితో నతిభర

మ్మగాఁ బోరుచుండుటఁ గాంచి యుట్టిపడి, యడ్డువచ్చిన వారి శరీరములు తుత్తునియలుగా నఱుకుచు నరిభీకరున కడ్డపడిరి. ఇరువురు మూఁడు సారులు జగదేవుని వ్రేయ నుంకించిరి. వీరమతి యొక మాఱును, విజయవతి రెండుసారులును వారిని భగ్నోత్సాహులుగఁ జేయుటయే కాక కంఠగత జీవులుగఁ జేసివైచిరి. తరువాత నరిభీకరుఁడు చచ్చుటయు ససైన్యముగ వారణాసీ నాథుండు జగదేవునిచేఁ బట్టువడుటయు, దయఁదలఁచి యుదయాదిత్యుఁడు జయంతచంద్రుని సబలంబుగ విడిచిపుచ్చుటయుఁ జదువరులకుఁ దెలియని విషయము కాదు గదా! రాజభక్తి మెఱయ సమయమునకు వచ్చి తన కెంతయో సాయ మొనరించి, యుద్ధరంగమున మిక్కిలి నొచ్చి పడియున్న రత్నసింగును మాణిక్యసింగును గౌరవించి చికిత్స చేయించుటకు బదులుగాఁ గృతఘ్నుండై జయంతచంద్రుండు వారిఁ గారాగారమున బంధించెను. వారు విచ్చలవిడిగా నుండి యారోగ్య మొందినచో వారి చెలియండ్రయెడలఁ దా నొనరించిన దుస్సాహసమునకును, మంత్రిని ఖైదు చేసిన దుష్కార్యమునకును, నరిభీకరుండు చావ, ఱెక్కలు తెగిన పక్షివలె నున్న తన్ను హింసింపక విడువరని యాలోచించి యా దుష్టాత్ముఁడు వారి నట్టి గతికిఁ బాల్పఱిచెను.

యుద్ధానంతర మిట గౌడదేశాధీశ్వరుం డగు గంభీరసింహుండు రహస్యముగాఁ బూఁదోఁటకు జగదేవుని రప్పించెను. జగదేవుని నిరంతరమును గనిపెట్టి తిరుగుచున్న విజయవతి యతనికిఁ దెలియకుండ వెనువెంట నుద్యానమున కేగెను. గంభీర సింహుఁడు సంజరాతిరి జగదేవునిచేయి

పట్టుకొని యటు నిటు పచారుచేయుచు "కుమారా! నీ శౌర్య ధైర్య పరాక్రమములకు నే నెంతయు సంతసించితిని. నేను మొదట నీవు పోటీ పోరాటములో విజయ మొందుట విని నాముద్దు తనయను నీకిచ్చి పెండ్లిచేయవలయునను సదుద్దేశముతోఁ దద్వివాహమునుగుఱించి మాటలాడుటకై నా మంత్రి పురోహితుల నచ్చటికిఁ బంపితిని. నే నొకటి చెప్ప వా రొకటి గావించిరి. నా కన్నియను నీ కీయవలయునను పట్టుదలతోడనే పెండ్లికి నిన్నుఁ దప్పక తీసికొనిరావలసిన దని మరల వ్రాయించి పంపించితిని. కావున నా కోరిక చెల్లించి నీవు నా తనయం జేపట్టవలయును" అని గంభీర సింహుఁడు పలికెను. ఆ మాటలు విని "ఆర్యా! మీ దయకు నేఁ గృతజ్ఞుఁడ నయి యున్నాఁడను. మించిన దానికి మన మేమి చేయఁగలము? త్రోవలోనే నాకు వివాహ మయినదన్న సంగతి తమకుఁ దెలియని సంగతికాదు గదా! దైవ మొకరీతి నిర్ణయించియుండ వేఱొకరీతి నేల జరుగఁ గలదు. అన్నిటను మిన్నయు, భావి రాజ్య రమావల్లభుఁడు నగు వరా యున్నకే మీ తనయ నొసంగిన సమాన మగు వియ్యముగా నుండును" అని జగదేవుఁ డన "నీకుఁ బరిణయ మయినను సరియే! నీ విష్టపడుదు వేని నా కూఁతును నే నొసంగుట కే యాటంకమును లేదు" అని గంభీరుఁడు పలికెను. "క్షమింపవలయును. నే నేకపత్నీవ్రతస్థుఁడను. ఎంతటి రాజాధిరాజు లయినను నీ వ్రతస్థులు గానిచో నాపదలలోఁ బడుట నిశ్చయము. అదియునుం గాక యిది నీతి బాహ్య మనియే నా తలంపు. కావున నీ విషయమున మీ రెంత చెప్పినను ఫలము లేదు" అని జగదేవుఁడు జవాబు చెప్పెను.

మఱి ప్రసంగింప గార్యము లేదని తెలిసికొని గంభీరుండు జగదేవుని గౌరవించి వీడుకొలిపెను. ఆ సమీపముననే యొక సౌధరెంట నుండి వారి సంభాషణము విన్న విజయవతికి గుండె జల్లు మనియెను. తాను బయలుపడి తన మనోభీష్టము మనోహరునితో విన్నవించినను నతం డంగీకరింపం డని యూహి నిశ్చయించుకొనెను; కానినాండు తనజన్మము దుఃఖ భాజనమే కదా యని యొక్కింత విచారించెను; యోగీంద్రుని వచనమ్ములం దలంచికొని ధైర్యము నవలంబించెను.

సీతాబాయికిని, రణధవళునకును వివాహము విధ్యుక్తముగ జరిగెను. పెండ్లివారందఱు విడిచి ధారానగరమునకు మరలిరి. నాంటి యుద్ధములో నరేశ్వరుని రక్షింప వచ్చిన వీర ద్వయమును గుఱుతించిన దగుటచే విజయవతి వారి పేరుం గాంచినది కావున హేమా కనకాంగులే మయిరో తెలిసికొనవెంచి వారున్న గ్రామమునకు ససైన్యయై వచ్చెను. ఇంచుక నారోగ్యము చెందక, తమ యన్నలు పట్టణము నుండి యింకను రాలేదని వెంగటిల్లి రోగశయ్యపై నున్న హేమా కనకాంగులను జూచి విజయవతి శోకించి వారిం దన గుడారమునకుం దీసికొనిపోయి తగు నుపచారములు చేయించుచుండెను. వారిరువు రారోగ్యవంతు లగునంతకు వారియన్నల నిజస్థితి చెప్పక వా రారోగ్యము నొంది తిరుగులాడుచున్నప్పుడు జరిగిన సమాచారమును జెప్పి వారు దుఃఖింప వారి నోదార్చి "మీ యన్నలతో మిమ్ములం గలిపెదను. అంత దనుక నా కడనే యుండుం" డని, వారి నూరార్చి ససైన్యయై ఒకకోట

గ్రామమున కరుదెంచెను; ధారానగరమునుండి యెప్పటి కప్పుడు జగదేవుని క్షేమవార్తలను చారులచేతఁ దెప్పించు కొనుచు నా చుట్టుపట్టులనే కొన్నాళ్లు నివసించుచుండెను; ఊరకయున్న నెవరే మనుమానింతురో యని వర్తకము చేయ మొదలిడెను: తన పరివారముచే నచ్చటచ్చటి సరకులు బేరము చేయించి తెప్పించి యా వస్తువుల నించు కించుక లాభమునకు బీదలకుఁ జిల్లరగా నమ్మించుచు దల్లాభమునఁ దన పరివారమును పోషించుచుండెను.

---

## పంచమోల్లాసము

సవతి తల్లి కొడుకు మాటలను విని మనస్సు విఱుగ ధారా నగరమును విడిచి వచ్చి యొకతోటలో జగదేవుఁడు ప్రవేశించుట చారుల వలనఁ దెలిసికొని విజయవతి యా గ్రామమునకుఁ బోయెను. ఆ మఱునాఁడే యాతఁడు బయలుదేఱుచుండె నని తెలిసి తన బలము నంతయును వెనుక రానాజ్ఞ యిచ్చి, వీరమతీ జగదేవుల వెనుక వారికిఁ దెలియకుండ నరణ్యమునఁ బ్రవేశించెను. అప్పుడు నా దంపతులను బులి బారినుండి తప్పించి యా పులిం జంపఁ బుంఖానుపుంఖంబులుగా బాణములను బ్రయోగించిన వ్యక్తి విజయవతియే. తరువాత నామె వెంటనే వెనుకకుఁ దిరిగి తన సైన్యమును గలిసికొని మూఁడు దినములు ప్రయాణము సాగించెను; వీరమతీ జగదేవులు బస చేసి యున్న గ్రామము కడకు వచ్చి తోఁటలో బస చేసి, గుఱ్ఱపు రౌతు నంపి, జగ

దేవుని రప్పించి విజయవతి, విజయసింహుఁ డను నామధేయ ముతో నుండి యెదురుకొని సంభావించెను; తన గుడార మునకుఁ దీసికొని పోయి తన వృత్తాంతమును దన చెల్లెలి వృత్తాంత మని మార్చి చెప్పి (తన్ను) వరింపు మని వేఁడు కొనియెను; అతఁ డెప్పటికిని లొంగుబాటునకు రాకుండుట వలన దుఃఖము పొంగి పొరలి రా నేడువ నాగెను; ఆ దుఃఖ మును జూడ లేక యతఁడు కన్నులు మూసికొని యున్నం తలోఁ దాను దాఁచుకొని యున్న యుదార పురుషోచితము లగు వస్త్రములను దీసి వేసి, జగదేవుఁడు గంభీరసింహు నితోఁ దా నేకపత్నీ వ్రతస్థుఁడ నని చెప్పిన నాఁటి నుండియుఁ దాను గైకొని యున్న యోగినీ వేషముతో దీనవదన యయి కానుపించెను; అది గాంచి జగదేవుఁ డేకాంతమునఁ గాంతల తోడి మంతనము తగ దని తలఁచి, లేచి వచ్చుచుండఁ దన మనోనిశ్చయమును స్పష్టముగా విజయవతి చెప్పెను. ఆమె నేఁడికోలు నంగీకరింపక జగదేవుఁడు గుడారమును నిర్గమించి పోయెను. నాఁటి రాత్రి యామె, యాత్మహత్య చేసికొన నుద్యుక్త యయి యుండ యోగిచంద్రుండు మరల సాక్షా త్కరించి, ధైర్యమును గొల్పి, తత్వమును బోధించి శ్రీ కాశీ నగరమున కేగి విశ్వనాథు ననుదినమును సేవించు చుండు మని నుడివి యదృశ్యం జనియెను.

పిమ్మట విజయవతి తన పరివారముతో శ్రీ కాశీ క్షేత్రమునకుఁ బోయెను; అతి భక్తితో నన్నపూర్ణా సనాథుని విశ్వనాథునిం బ్రతి దినము బోయి దర్శించుచు నిరంతరము ధ్యానించుచు నచ్చట దినములు గడపు చుండెను; తన పేరు 'సదానంద యోగి' యని ప్రకటిం

చెను; ముదుసలి యగు కౌడీబాయి వలన మంత్రిగారి చరి
త్రమును విని యామెకు హేమా కనకాంగులను జూపిం
చెను. కౌడిని రక్షించిన కారాగార రక్షకుని మూలమున
మంత్రిని రత్న మాణిక్య సింహులను విడిపించి వారితో
హేమా కనకాంగులను గలిపెను; తన వృత్తాంత మెవ్వ
రికిం దెలియ నీయ రా దని హేమా కనకాంగులకు గట్టి
కట్టడఁ జేసెను; ఆ రాత్రియే, యచ్చటి నుండి కదలి కతి
పయ ప్రయాణంబులకు, అజాహిత పురమునకు వచ్చెను:
అచ్చటఁ దన మనోహరుని కీర్తి ప్రతిష్ఠలను విని సంతోషిం
చెను: ఇచ్చట నా యూరు కొల్ల పెట్టుం డని తన పరివార
మున కాజ్ఞ యిచ్చెను. అందఱు నా యూరి వారే యగు
టచే నెవరి యింటి కడ వారే దొంగతనము చేసిరి. ఎవరి
భార్యలను వారే యపహరించి తెచ్చిరి. ఎవరి బిడ్డలను
వారే తీసికొని వచ్చిరి. వారు సేయు దుండగము లెవ్వియు
నిజముగ దుండగములు గావు; కాని రాజుగారి మహలున
ధనము కొల్ల గొట్టుటయే యించుక దుండగము. ఐన నిజ
మాలోచించినచో విజయవతియే చేసిన యా కార్యము
దుండగ మెట్టు లగును? తన తండ్రి సొత్తే గదా! దానితో
రాజుగారి సంరక్షణకు జగదేవుని నియమించి రని తెలిసి
కొని, యోగి చెప్పిన విధమ్మున నిశీథ సమయమ్మునఁ
గోటలో నంతఃపురమునకు వెనుక భాగమ్మున నార్త నాద
మును గావించినదియు విజయవతి యనియే తెలిసికొనవల
యును. కోటలో ధనము పోయిన నాఁటి రాత్రి యందును,
నాఁటి రాత్రి యందును యోగీంద్రుని మనోబలముచే ద్వార
పాలకులను నిద్రా దేవత యావేశించి యుండెను. తాను

రాజ్యలక్ష్మి యనియు, రాజ మరణంబునకు దురపిల్లుచుంటి
ననియుఁ జెప్పి యా మరణమ్మును దప్పింప భువనేశ్వరీ దేవికి
బలిగా జగదేవుని సతీ సంతానములను గోరి వారి నా దేవి
మందిరమునకు రప్పించెను. అంతకు మునుపే తాను భువ
నేశ్వరి యాలయమ్మున కేగి విగ్రహము వెనుక భాగమ్మున
నిలిచి, సిద్ధరాజు కూఁతును జగదేవుఁడు పెండ్లాడిన నే
బాధయు నుండ దని. మరణమునకుఁ గృత నిశ్చయు లగు
యున్న సిద్ధరాజ జగదేవులకుఁ దగవు తీర్చి వారి విరువుర
నిష్టపడునట్లు చేసెను; మఱుచటి దినమే యా యూరు
విడిచి తన సైన్యములతో నొక గ్రామమున కేగెను.
అణహిల పురమున దొంగతనములు మఱి జరగలేదు.
జయంతచంద్రుఁడు ధారానగరముపై దాడి వెడలుచున్నవాఁ
డని చారుల వలన విని. యామె సదానంద యోగి యను
పేరితోఁ దన తండ్రి కొక లేఖ వ్రాయించి జగదేవుఁడును
నాతఁడును ససైన్యముగ వచ్చునంతలోఁ దన దగ్గఱ నున్న
యోధుల కందఱకును నానాయుధాంబరములు గట్టి కొన
నాజ్ఞాపించి, పురుష వేషధారిణు లగు హేమా నవకాంగుల
తోడను, రత్న మాణిక్య సింగుల తోడను సంప్రదించుకొని
వారితోఁ గలిసి యుద్ధరంగమున జయంతచంద్రు నెదుర్కొని
వాని బలంబుల నేలకుం గూలకుం దెచ్చెను. ఇంతలో
జగదేవుఁడు వచ్చి యలసి యున్న వారిం గాపాడిన సంగతి
మన మెఱుంగుదుము. తరువాత విజయవతి, తన మనో
హరుని తల్లి యగు శ్రీ లక్ష్మీదేవి సౌధమునకు వచ్చి,
త న్నెఱింగించుకొని యావద్వృత్తాంతమును విన్నవించెను.

ఆమె, మఱుచటి దినము సభా భవనంబున నున్న తన

తండ్రి కొక జాబు పంపించి జగదేవునితోఁ గూడ నాతనిని దానున్న చోటికి రప్పించెను; పిమ్మట దన యోగినీ వేషమును విడిచి యథా పూర్వముగ రాజపుత్త్రి రమణీ మణి యయ్యెను; చిరకాలాకాంక్షిత మైన తన మనోరథ మీడేర జగదేవునిం బెండ్లాడెను: తన యుదంతము నాతనితోఁ జూచాయగా సంతయుం జెప్పి యాతని మెప్పుం బడసెను. ఆనంద పారావారమున నోలలాడెను.

ఒకనాఁడు విజయవతీ జగదేవులు మాటలాడుకొను చుండ యోగీంద్రుని ప్రసంగము వచ్చెను. అంతలో నాతఁడును వచ్చెనవుగ నచ్చోటికి నరుగుదెంచెను. ఎదురేగి యిరువురు నా బ్రహ్మానంద యోగీంద్రునకు సాగిలి పడి మ్రొక్కి పాదములు గడిగి. పాద తీర్థమును శిరస్సులపైఁ జల్లుకొని యతని నర్హాసనాసీనుం గావించి యమ్మహనీయ చరిత్రుని యాశీర్వచనము లందుకొనిరి. పిమ్మట యోగీంద్రు నాజ్ఞచేఁ బరిపూర్ణ చంద్రుఁడు నచ్చటికి రావించిరి. ఆతఁడు వచ్చి, జటావల్కలధారి యై యాజానుబాహుం డయి శాంతరసము, మూర్తిఁ గైకొని వచ్చెనో యను నట్టులలరారు యోగి పుంగవునిం గాంచి భక్తితోఁ బాదాభి వందన మాచరించెను. నాఁడు తాను గారాగారమ్మున నుండి, పుత్త్రి పుత్త్రికా వియోగమునకును, దన దుస్థితికిని మరపిల్లుచున్నప్పుడు సాక్షాత్కరించి యోదార్చిన మహనీయ మూర్తి యాతఁడే యని నిశ్చయించుకొని చిఱునవ్వు వెన్నెలల వెదఁజల్లుచున్న యోగీంద్రచంద్రుని ముఖచంద్రుం గాంచి యిట్లు పలికెను. "స్వామీ! నాడు విచార సాగరంబున మునింగి యున్న నా కభయం బిచ్చిన మహనీయులకు

తామె యని తోఁచు చున్నది'' అన, నౌనని యతఁడు పలికెను. ''మీరు నా పాలిటి గౌరీనాథు లనియే నా యుద్దేశము; కాని, నాఁడు మీ రానతిచ్చిన రెండు మాటలకును నా కర్థము కాక, నేఁటి దనుక నను నిమేషమును నే నాలోచించు చుంటిని. మీరు నా కెట్లు సహోదరు లయితిరో నే నెఱుంగఁజాల కున్నాఁడను. మఱియు నిట్టి విరాగు లగు మీ కొక బిడ్డ యున్నదా యనియు నామె యెవ రనియు సందేహము. అరిభీకరుఁ డను వాఁడు నా కొక యనుజుఁ డుండెడి వాఁడు. అతఁడు గౌడ దేశపు దాడిలోఁ గథావశేషుం డయ్యెను. వాఁడు తక్క నా కిం కెవ్వరు నన్నదమ్ములు లేరు. పిన తల్లి పెద తల్లి కుమారులు గాని, పిన తండ్రి పెద తండ్రి కుమారులు గాని నా కెవ్వరును లేరు. ఈ సందియములు నన్ను బాధించు చున్నవి. వీని యుదంతమును సమగ్రముగ సెల విచ్చి నన్నుం గృతార్థుని సేయఁ బ్రార్థించు చున్నాఁడను'' అని మంత్రి పలికి యూరక నిలువం బడి యుండ యోగీంద్రుఁ డాతని సముచితాసనమ్మున నాసీనుం గావించి మెల్లగా నొక వృత్తాంతమును జెప్ప మొదలు పెట్టెను.

''అయ్యా! ఇప్పుడు నేఁ జెప్పఁ బోవు వృత్తాంతము మిక్కిలి గూఢ మయినది. ఇది యితరు లెవ్వరును వినఁ గూడదు. కావున మీరు మువ్వురు నీ యుదంత మేరితోడ నెప్పుడును నొడువ వలదు.''

''పూర్వ కాలమున మధుసూదనుఁ డను రాజు కాశ్మీరమును బాలించు చుండువాఁడు. అతనికి లేక లేక యొక్క కుమార్తె కలిగెను. హేమచంద్రుఁ డను నొక

తమ్ముఁడాతనికిఁ గలఁడు. అతఁడు బలపరాక్రమముల యందే కాక సత్ప్రవర్తన మందును నన్నతోఁ దులఁదూఁగు చుండెను. ఇట్టి తమ్ముండు తన్ను భక్తితోఁ గొలుచుచుండ మధుసూదనుఁడు ధర్మము తప్పక రాజ్యము నేలుచుండెను. ఆ రాజన్యుండు తన యనుంగు తనయ యగు జగదీశ్వరిని సుజ్ఞయునీ నాయకుండగు నరేంద్రసింహున కిచ్చి పరిణయము గావించెను. నరేంద్రసింహుఁ డంతకు ముందు వీరమోహిని యను నామెం బరిణయమయి యుండెను. వీరమోహిని నిజముగ వీరమోహినియో యను నంత చక్కనిది. జగదీశ్వరి యతి చతుర. నరేంద్రుఁ డిరువుర నొక్క రీతిగాఁ జూచుచు సుఖించుచుండెను.

"లేక లేక యొక్క కూఁతురే కలుగుటయు, నామె యనురూప వరునిం జెట్టఁ బట్టి సుఖించుచుండుటయుం గాంచి, తన యనంతరము రాజ్యమును దన కూఁతునకే యొసంగ మధుసూదనుఁడు నిశ్చయించుకొనెను. సంసారమునందు నిస్పృహుండయి, యాతఁడు తపస్సునందును, యోగాభ్యాసము నందును దన మనస్సును నెలకొల్పి లోకవ్యవహారముల విడిచెను. ఆతని తమ్ముఁడే యన్న యానతిని రాజ్యము నేలుచుండెను. అన్నగారి యనంతరము రాజ్యము తనకు రావలయు నని యతఁడు దలంచి యుండ దానికి విరుద్ధముగ నన్న తలంచుచున్నవాఁ డని గ్రహించి, హేమచంద్రుఁడు కొంచె మనిష్ట మన్నయెడల వహించెను. అది వెలిపుచ్చక, రాజ్యము నంతయుఁ దన కైవసము గావించుకొని, సామంతులను మంత్రులను లోపఱచుకొని యన్న నే వెరపున మోసగించుటయో తెలియక యాలో

చింపుచుఁ దతీవేచు చుండెను. ఇంతలో మధుసూదనుఁడు శ్రీ కాశీ విశ్వనాథుని దర్శింప వలయు నని తలంచి వారణాసి కేగఁ బయన మయ్యెను. అదియె, సందను కొని తగిన పరివారమును సాయ మిచ్చి హేమచంద్రుఁ డన్నగారి నంపించెను. పరివారమున నొక గట్టి కట్టడఁ జేసెను. భార్యా సహితుం డయి మధుసూదనుండు ప్రయాణము సాగించెను. పాప మతఁడు కాశీ క్షేత్రమునకే పోవు చుంటి ననియు, దన జన్మము సాఫల్యము నొందు ననియు, గంగా తరంగిణిలో మునిఁగి యన్నపూర్ణను విశ్వనాథుని సందర్శించి కృతార్థుల మగుదు మనియును దలంచెను; కాని, కొన్నాళ్ళ కాతఁడు హిమవత్పర్వత ప్రాంతములను గాంచెను. ఇది యే మని పరివారము నడుగ వాడు దారి తప్పితి మనియు మంచి దారి చిక్క ననియుం జెప్పిరి. ఔ ననుకొని యతఁ డూరకుండె నా రాత్రి యాతని పల్లకి నొక లోయలో దింపి యాతుంటరు లాతని కాలు సేతుల కరదండములను దగిలించి మాటు మాయ మయిరి. తెల్లవాఱె నంతఁ జలిచే గజ గజ వణఁకుచు నతఁడు లేచి చూచు నరి కొక్క సేవకుఁడు నగుపింపఁ డయ్యె. కాలు సేతులు కదలింప వీలు లేక పోయెను. భార్య యే మయ్యెనో యతనికిఁ దెలియ దయ్యె. తన గతి కాతఁడు మిక్కిలి దుఃఖించె. ఈ మోస మంతయుఁ దన తమ్ముఁడే చేయించెనా యని యనుకొనెను; కాని తమ్ముని సత్ప్రవర్తన మంతయు బాగుగ నెఱింగి యుండుటచే నా యూహ మార్చుకొనియెను. ఆతని కేమి సేయుటకును దోఁప దయ్యె. ధైర్యవంతుఁడు గాన నతఁ డించుకయు భయం పడక యది యంతయు దైవ విలాస మనియు, సంసార బంధముల నుండి

దైవమే మోక్షము తన కారితిని గలిగించె ననియుం దలంచి కన్నులు మూసికొని పరమేశ్వరునిం బ్రార్థించు చుండెను. ఇట్టు లొక దిన మంతయు నతఁడు ధ్యానించుచునే యుండెను. రెండవ దినము నట్టులే గడచెను. మూఁడవ దినము గూడ నదే విధముగఁ గడచిపోయెను. అతఁ డాహారము నిద్రయుం గోరక చలికి జంకక నిరంతరమును బరమేశ్వరుని ధ్యానించుచు సంకెలలతో నట్టులే కూర్చుండి యుండె.''

''ఇచ్చట రాణిగారిని బరిజనులు హిమవంతము నందే మఱియొక లోయలోఁ బల్లకితో విడిచి యదృశ్యులయిరి. ఆమెయుఁ దెల్లవాఱి నంత నేరిం గానక యడలుచు భర్తను గానక విలపించుచు నం దందు వెదకెను. పాపము! ఆమె యసూర్యంపశ్య; క్రింద నడుగు వెట్టి యెఱుంగదు. కష్టము లెట్టు లుండునో యావ లా కామె కేమియును దెలియదు. ఆమె యొక్క విధముగా మొఱ్ఱ లిడుచుఁ దన నాథునిం బిలుచుచు నేడ్చుచు నా లోయలో నుండి యెటు పోవుటకును దెలియక, పతి వియోగమును సహింప లేక, యాత్మహత్య గావించుకొన నిశ్చయించి, 'హా! పరమేశ్వరా! మ మ్మిట్టి బాధలు వెట్టిన యా దురాత్ము లిట్టి కష్టముల ననుభవింతురు గాక. తండ్రీ! నా పతి వియోగమును నే సహింపఁ జాలను. కావున నాత్మహత్య చేసికొను చున్నాను. నా కీ దోషము లేకుండఁ జేసి నన్ను నీలో నైక్యము పొందించుకొనుము' అని భక్తితోఁ బ్రార్థించి యొక పాషాణంబున శిరస్సు పగులఁ గొట్టుకొని యా పతివ్రతా శిరోమణి ప్రాణంబుల విడిచెను'' అని నిట్టూర్పు పుచ్చి యోగిచంద్రుం

డించుక తల యూఁచి "ఆహా! ఎవరి కెప్పు డెట్టి గతి పట్టునో తెలియదు కదా" అని యూరకుండెను.

ఆ ముప్పురు శ్రోత లా చరిత్రమున కద్భుత విషాదం బుల నొందుచు "స్వామీ! తరువాత మధుసూదనుం డే మయ్యెను?" అని ప్రశ్నించిరి.

ఆ మధుసూదనుఁడు నాల్గవ నాఁడు నట్టిలే యాహార మును నిద్దురయును విడిచి పరమేశ్వర ధ్యానైక మానసుం డయి యుండ నచ్చోటి కొక జడదారి వచ్చి యాతనిం గాంచి, "తండ్రీ! నీ వెవ్వఁడవు? ఇచ్చోట నిర్విధముగా నెందులకుఁ గూర్చుండి యుంటివి?" అని యడిగెను. మధు సూదనుఁడు మెల్లనఁ గన్నులు విప్పి సర్వేశ్వరుని విధమునఁ దన యెదుట సాక్షాత్కరించిన మునినాథుని యడుగు దమ్ము లకు నమస్కరించి, తా నంత దనుఁక నే మూర్తిని ధ్యానించు చుండెనో, యాతఁడే యాతఁ డను నిశ్చయముతో, మనం బున నాతని ధ్యానించుచుఁ బాద పద్మముల విడువక భృంగాయమానుం డయి యుండెను. "వత్సా! లెమ్ము. లెమ్ము. నీ భక్తికి మెచ్చితిని. తాపత్రయమును నీషణ త్రయమును నిన్నింతగా నింక బాధింప నేరవు. రమ్ము. నా యాశ్రమమునకుఁ బోవుదము" అని యమృతమును జిలుకుచున్నట్లు వచియించుచు న మ్మునినాథుం డాతని నెత్తి కౌఁగిలించు కొనియెను. ఆ మహా మహుని శరీర స్పర్శ విశేష మెట్టి ప్రభావ వంతమో కాని మధుసూదను సంకెల లూడిపోవుట యె కాక యనిర్వాచ్యానందమ్మాతనికిఁ గలిగెను; వేదాంత తత్త్వార్థమ్ములు కరతలామలకము వలెఁ గాన్పించె;

నిత్యవస్తు విట్టిదను నిశ్చయ మాతని కంతలోనే కలిగెను" అని బ్రహ్మానంద యోగివర్యుండు చెప్పుచున్నంత నాతని శరీర మంతయును బులకరించెను. కన్నులనిండ నీరు గ్రమ్మెను. హృదయము ద్రవీభూత మయ్యెను. కంఠము రుద్ధ మయ్యెను. నోటినుండి మాట వెడల కుండెను. అట్టు లతడు పదునేను నిముసము లర్ధ నిమీలిత నేత్రుండై యుండఁ దక్కిన మువ్వురు నచ్చెరువు నొందిరి. తమకును దచ్చరిత్రమున సంబంధము కలదేమో యని వారి మనంబుల నూహ లంకురించినవి. తరువాతి వృత్తాంతమును వినఁ గుతూహలులై "స్వామీ! పిమ్మట నేమి జరిగెను?" అని యా మువ్వురు నొక్కమాటగా నడిగిరి. యోగీంద్రుండును హృదయమును బదిల పఱచుకొని మరల నిట్లు వచింప సాగెను.

"ఆ మునీంద్రు నాలింగనంబువలనఁ దనకుఁ గలిగిన జ్ఞానమునకును, శక్తికిని, బంధ విముక్తికిని, ఆనందమునకును నబ్బురపడి మధుసూదనుఁడు కనులు తెఱచి చూచెను. చూచునప్పటి యద్భుత మేమని చెప్పఁగలము? ఆ జడదారి శరీరము, మునుపటికంటె మున్మడిగాఁ బెరిఁగినది. చూచుచుండ నొక్కశిరస్సు మూఁడు శిరస్సులుగా మాఱినది. మూఁడు మొగమ్ములు, సత్త్వ రజస్తమో గుణమ్ముల కాలపట్టు లయి వెలుఁగొందుచుండెను. రెండు బాహువుల వెనుక మఱిరెండు జతలు బాహువులు మొలచెను. అందొక హస్తమునఁ జక్రమును, రెండవ హస్తమునఁ ద్రిశూలమును గానుపించుచుండెను. మూఁడవ హస్తమున జపమాలికయు నాల్గవ హస్తమునఁ బుస్తకము నుండెను.

తక్కిన రెండు హస్తములయందు యోగదండముం గమండులువును మొదటినుండియు నున్నవి. ఆ మూర్తిని స్తుతింప నా వశము కాదు. అది మూఁడుమూర్తుల మూలవిరాట్టు. పరికించి చూచితిని. హరి హర హిరణ్యగర్భుల నెట్టులు వర్ణింతురో, యా మూఁడు మూర్తుల రూపమ్ములును, గుణమ్ములును, శక్తులును నా మహనీయమూర్తియందుఁ బ్రత్యక్షముగాఁ గానవచ్చుచుండెను. నలు వలంకుల నాతని నాశ్రయించి తచ్ఛరీరావలేహన మొనరించుచు నాలుగు శ్వానంబులు, మిక్కిలి మచ్చికమై తోఁకలాడించుచుఁ జెలంగుచున్నవి. నిదానించి యా మూర్తులను గాంచితిని. అవి నాలుగును ఋగ్యజుస్సామాథర్వణమ్ములు. ఆహా! నా భాగ్య మేమని చెప్పుదును" అని యోగీశ్వరోత్తముఁడు నిమీలితనేత్రుఁడై, తద్రూపమును గాంచుచు నానందించుచుండెను. వినుచున్నవారు మువ్వురును నాసికాగ్రమున నంగుళి నుంచి, "ఆహా. ఈ మహానుభావుఁ డానందమును బట్టలేక తాను మధుసూదనుఁడ నని చెప్పకయే, "పరికించి చూచితిని. ఆ మూర్తులను గాంచితిని. నా భాగ్య మేమని చెప్పుదును" అని యుత్తమ పురుషలోఁ గ్రియారూపముల నుపయోగించి చెప్పుచుఁ దన్మూర్తి మరల నిపుడు ప్రత్యక్షమగుటచేత నొడలు మఱచియున్నవాఁడు" అని యంతరాత్మలయం దనుకొనిరి. కొంతవడికి యోగిరాట్టు తెలివొందెను. ముగ్గురును "మహాత్మా! తరువాత నేమయ్యెను?" అని మరల నొక్క మాటగా నడిగిరి.

"అటులు ప్రత్యక్షమయిన యమ్మహానుభావుఁడు దత్తాత్రేయ మహర్షి యని మధుసూదనుఁడు గ్రహించి మరల

నతనికి నమస్కరించి తదాజ్ఞ నాయన వెనుక నశ్రమంబున నాశ్రమంబున కరిగెను. త దాశ్రమము బదరి కారణ్యాంతర్భాగమున నున్నది. అచ్చట వేదాంత రహస్యములును, తారక రాజయోగ విధానములును న మ్మహామహునికడ నుపదేశమాత్రమ్మున మధుసూదనునకు విశదము లయ్యెను. తన్మహాత్వమునఁ గొన్ని సంవత్సరములు సమాధిలో నతఁడు కూర్చుండెను; బద్ధపద్మాసనుం డయ్యెను; ఉచ్ఛ్వాసనిశ్వాసములను నిరోధించెను; కుండలిని లేపెను; జ్ఞానేంద్రియ పంచకమును గర్మేంద్రియ పంచకమును జయించెను; అనాహత నాద తంతువు నవలంబించెను; ఆజ్ఞాచక్రమును స్పృశించెను; చంద్ర మండలమును భేదించెను; తేజః పుంజములఁ దిరస్కరించెను; సహస్రదళకమలములోనం బ్రవేశించెను; పరమాత్మను సాక్షాత్కరించుకొనెను; అచ్చటనే నిత్యమును విహరించుచుండెను; మృత్యువుం దృణీకరించి ధిక్కరించెను; ఆనంద స్వరూపి యయ్యెను; జ్ఞానావస్థితుం డయ్యెను. ఇట్టు లవిచ్ఛిన్నసమాధిలో నున్న యాతనికిఁ గాలచక్ర క్రమ మెఱుంగరాదయ్యె.’’

---

## షష్ఠోల్లాసము

‘‘ఇట నాతని తమ్ముఁడు సోమచంద్రుఁడు, తన యన్న వైరాగ్యమునొంది, కాశీ క్షేత్రమునుండి జాయా సహితుం డయి బదరికాశ్రమమున కరిగినవాఁ డని ప్రకటించి యొకటి రెండు సంవత్సరము లాతఁడే రాజ్యము నేలెను; కాని తాను

జేసిన దుష్కృత్యము ప్రతి నిమేషమును దన్ను బాధించు చుండుటం జేసి సంతోషము మాత్ర మాతనికి దూర మయ్యెను. అంత కంతకుఁ బశ్చాత్తాపము హెచ్చెను. తా నొనరించిన దుష్కార్యమునకై తన్నుఁ దాను నిందించు కొని శపించుకొనెను. తుదకా పాపమే యాతనికి మనో వ్యాధిగాఁ బరిణమించెను. అది యసహ్యమగు రోగముగా మారెను. ఆ రోగ మాతని యవసాన కాలమును సూచించెను. అంత నా హేమచంద్రుఁడు భయంపడి తన యన్న గారి తనూజాత యగు జగదీశ్వరిని నామె భర్తతోఁగూడఁ బిలువ నంపి రప్పించి రాజ్యము వారి స్వాధీనము చేసి తాను ప్రాణముల విడిచెను.

"అంత జగదీశ్వరి తన మగనితోఁ గూడఁ గాశ్మీరమునఁ గొన్నాళ్లుండి పిమ్మట నుజ్జయనీ నగరమునకు వచ్చెను. కాశ్మీరమునుండి వచ్చినప్పటినుండి యొక రోగ మంకురించి నరేంద్రసింహుండు మిక్కిలి బాధ నొందు చుండెను. తుద కాతఁడు మంచము పట్టెను. ఇట్టి సమయములో నాయన భార్య లిరువురికిని జగడము వచ్చెను. అఖండైశ్వర్య యుత మగు కాశ్మీర రాజ్యము తనకు వచ్చినప్పటి నుండియు నరేంద్రసింహుఁడు వీరమోహిని కంటె జగదీశ్వరి నెక్కువ గౌరవయుక్త మగు ప్రేమతోఁ జూచు చుండెను. అతఁడు మంచము పట్టి యున్న కాలమున జగదీశ్వరి మహలులోనేఁ యాతఁ డుండుటయు నామెయే యాతని సేవ చేయుటయుఁ జూచి వీరమోహిని కొక్కింత యనుమాన ముదయించెను. కాశ్మీరము నుండి వచ్చినది మొదలు భర్త తనతో నంతగా మన సిచ్చి మాటలాడ జే

డనియు, రోగి యై యుండె ననియు, మగని స్వాధీనము చేసి కొనుటకు జగదీశ్వరి యౌషధ ప్రయోగ మే దయినఁ జేసి యుండ వచ్చు ననియు నామె తలంచెను. తాను పెద్ద భార్య ననియుఁ దన మహలునందే రాజుగా రుండవలయు ననియుఁ. గావునఁ బల్లకిలో భర్తగారి నంపించి వేయవలయు ననియు వీరమోహిని జగదీశ్వరికిఁ దెలియఁ జేసెను. సౌందర్య పక్షపాతి యై నాథుఁడు వివాహ మయిన దాదిగ వీరమోహిని నెక్కువగాఁ బ్రేమించుచున్నాఁ డని యించుక మనంబున ననుమానించి జగదీశ్వరి సమయము వచ్చి నప్పుడు పతిని దన వశము గావించుకొనవలయు నని నిరీక్షించుచున్న దగుటచే, తన రాజ్య కారణమునఁ బతి కొన్ని దినములు కాశ్మీరమునఁ దన కడనే యుండుట వలన నతి చతుర యగు నామె మునుపటి కంటె నెక్కువ పరిచర్య చేసి యాతని నింపగు చతురోక్తులచేఁ దనియించి మెప్పించెను. అది కారణముగ జగదీశ్వరీ సౌధమునం దతఁడుండుట తటస్థించెను. పతి రోగి యై యుండుటచే జగదీశ్వరి యహర్నిశము నాహారము నిద్రయు నభిలషింపక పతి కెంతయు భక్తితోఁ బరిచర్య చేయుచుండెను. ఆ కారణమున వీరమోహిని యంపిన వార్త కిట్టులు బదులు చెప్పి పంపించెను. “భర్తగా రిచ్చటనే యుందురు. అచ్చటికిఁ బంపించుటకు వీలు లేదు.” ఆ మాటలు విని కోపించి వీరమోహిని భర్తగారిని రప్పింపఁ దగినంత ప్రయత్నము గావించెను; కాని యతి చతుర యగు జగదీశ్వరి కడ నామె ప్రయత్నములు ఫలించినవి కావు. ఇరువురు భర్తను మిక్కిలి ప్రేమించి యున్నవారే; మంచి నడవడిక గలవారే. అయి

నను రాజపుత్రి స్త్రీలగుటచేఁ దన మాటయే చెల్లవలయు నను పట్టుదల యిరువురికిని సమానముగానే కలిగెను. వీరమోహిని పంపిన సమాచారము రాజుగారి చెవిని బడనీయకుండ జగదీశ్వరి కట్టుదిట్టములు చేయుచుండెను. తుదకు విసిగి రాజుగారితో సమయము గనిపెట్టి తన సవతిపై నేవియో పుల్లవిఱుపు మాటలు చెప్పుచు నామె వీరమోహిని యం దాతని కనిష్టమును బుట్టించెను. ఇన్ని దినముల నుండియుఁ దాను రోగశయ్య యందున్నను దన్నుఁ జూచుటకైన వీరమోహిని రా దయ్యె నని యా నరేంద్రునకుఁ గోపము వచ్చెను. ఆ కోపాగ్ని నప్పుడప్పుడు తన పుల్లవిఱుపు మాటలచే జగదీశ్వరి మండించుచుండెను. ఇట్లు రెండు మూడు మాసము లయిన పిమ్మట వీరమోహిని యొక యుత్తరమును వ్రాసి సీలు చేసి విశ్వాసి యయిన సేవకుని చేతి కిచ్చి మంత్రికిఁ బంపెను; ఈ యుత్తర మెట్టు లయిన రాజుగారి చేతి కందింప వలయు' నని నోటి మాట చెప్పెను. మంత్రి కా యుత్తరమును, బెద్ద రాణిగారి యాజ్ఞయును జేరినవి. ఆ యుత్తరమును జేతఁ బట్టుకొని, జగదీశ్వరి యంతఃపురమునకు మంత్రి వచ్చెను. జగదీశ్వరి మంత్రిని గౌరవించి మోమోటపఱచి యా లేఖను సంగ్రహించుకొని యాతనికిఁ గొంత ధన మిచ్చి తన యాజ్ఞ యయినప్పుడు రావలసిన దని చెప్పి పంపెను. జగదీశ్వరి తా నొక్కర్తయుఁ గూరుచుండి సీలు విచ్చి యుత్తరమును జదువుకొనెను. అం దిట్లుండెను. "ప్రాణనాథా! మిమ్ము దర్శించుట కేనియు నోచుకొనైతినా? నేఁ జేసిన దోస మేమి? మీ దర్శన మింతలోఁ గాకున్న నేఁ బ్రాణములను విసర్జించు

దాన; లేదేని యోగినినై తీర్థ యాత్రలకుఁ బోవుదాన, కాని ఇందుండి యీ విధముగా మిమ్ము దర్శింపక మీ సేవ చేయక యుండి బ్రతుకు బ్రతుకఁ జాల. తక్కిన యంశములు తమ రాలోచించినచోఁ దెలియరానివి కావు. తమ చిత్తము నా భాగ్యము. ఇట్లు మీ సేవకురాలు. వీరమోహిని."

"ఆమె యా యుత్తరమును జదువుకొన్న తరువాత వీరమోహిని నెట్లయినఁ దీర్థ యాత్రలకుఁ బంపవలయు నని నిశ్చయించి యొక యుత్తర మిట్లు లిఖించెను. "స్వామీ! నా మనసున నేమియో సంకటముగా నున్నది. శరీర మనారోగ్య దశయం దున్నది. కొన్నాళ్లు తీర్థ యాత్రలను సేవింపవలయు నని యున్నది. నాకు దేవర వారి నిమిత్తము కొన్ని మ్రొక్కు లున్నవి. అవి తీర్చుకొనుటకు శ్రీ కాశ్యాది పుణ్య క్షేత్రముల కేగి తా మారోగ్య వంతులరగు లోపున వచ్చు దానను; కావునఁ దగిన పరివారమును ధనమును వెంటనే ప్రసాదింపవలయు నని కోరుచున్న దానను; తీర్థ యాత్రలు ముగిసినం గాని మిమ్ముఁ జూడ నని నే మ్రొక్కుకొన్న దానను; కావున దయ యుంచి వేగముగా ననుజ్ఞ నిప్పించి యంపఁ బ్రార్థించు చున్న దానను.

చిత్తగింపుఁడు.

ఇట్లు మీ ప్రేయసి, వీరమోహిని."

అని వ్రాసి రాజుగారి కడ కరిగి యా యుత్తరమును జదివి జగదీశ్వరి వినిపించెను. "ఓహో! ఈ మ్రొక్కులు క్రొత్త మ్రొక్కుల వలె నున్నవే. కానిమ్ము నీ యిష్టము

వచ్చినట్లు వ్రాసి యామెను నేఁడే యంపివేయుము'' అని కోపావేశుండయి రాజు వచించెను. అది విని జగదీశ్వరి సంతోషించి ''నీ యిష్టము వచ్చినట్లు తీర్థయాత్రలను సేవించుకొని రమ్ము. ఎనిమిదేండ్ల లోపున నీవు రావలెను. ఈ దినమున నీ యిష్టము వచ్చినంత ధనమును బరివారమును దీసికొని వెడలి పోవలయును'' అని వ్రాయించి రాజుగారి మొహరు ముద్ర వేయించి, మంత్రిని బిలిపించి వీరమోహినీ దేవి కా యుత్తరమును బంపించి వేయుమని చెప్పెను. మఱియు నామెకుఁ గావలసిన పరిజనమును, ధనమును వెంట నే యిచ్చి ప్రయాణము చేయింపు మనియుం జెప్పి పంపెను. మంత్రియుఁ దద్వృత్తాంతము పెద్దరాణిగారితో మనవిచేసి యుత్తర మర్పించెను. ''రాజుగారు, అది గాక భర్తగారు, వారు సేయు నాజ్ఞను దిరస్కరింపఁగలనా? నా యదృష్ట మిట్లున్నది'' అని వీరమోహిని మిక్కిలి దుఃఖించి పయన మయి పరివారముతోఁ దీర్థయాత్రకుఁ బోయెను.

''తరువాత రాజు దినదినమున కారోగ్యవంతుఁ డగుచుండెను. రెండు మూఁడు మాసములలో నాతఁడు స్వస్థుఁ డయ్యెను. పెద్దభార్యా విషయమున నప్పుడప్పుడు కొప్పుదల మాటలఁ జెప్పుచుఁ జతురయగు జగదీశ్వరి తనపైఁ బతి కనుమానము కలుగకుండఁ జేసికొనెను. అతఁడు వీరమోహిని నొక విధముగ మఱచునట్టులామె ప్రవర్తించెను. ఇట్లు లెనిమిది సంవత్సరములును గతించినవి. జగదీశ్వరి నిర్భరానందము ననుభవించుచుండెను.

''ఒకనాఁడు నరేంద్రుఁడు వేటాడుటకై యరిగి యరణ్యమ్మున గుడారమును వేయించుకొని యుండగా నా

యరణ్యమార్గమునుండి వీరమోహిని యోగినీ వేషమ్మూనఁ దీర్థయాత్రలు సేవించుకొని పలు కడగండ్ల నొంది యా దినమున నచ్చోటికి వచ్చెను. వేఁటకాండ్రను జూచి యామె, యెవ్వ రా వేఁటకు వచ్చినవా రని యడిగించి తెలిసి కొని 'ఒక యోగిని మీ దర్శనమునకు రానున్నది. రావచ్చునా' యని నరేంద్రున కొకచీటి వ్రాసి పంపెను. ఆ చీటి జవానుల చేతులమీఁద నరిగి రాజుగారి సన్నిధిం జేరెను. 'తప్పక రావలసినది' అని జవాబు వచ్చెను. పరిచారకుల దూరముగా నుంచి యోవాదపుస్తకమును గప్పుకొని కాషాయాంబరధారిణి యగు వీరమోహిని రాజుచెంత కరిగెను. రాజు లేచి నమస్కరింపఁబోవునంతలోనామె దన మేలిముసుఁగును దొలఁగించి సాష్టాంగముగఁ బాదాభివందన మాచరించి యశ్రుజలముచే నాతని పాదముల నభిషేకించెను. నరేంద్రుఁ డామెను గాంచి గుఱుతించి యచ్చెరువొంది నిశ్చేష్టితుం డయ్యెను. వీరమోహిని జరగిన సమాచార మంతయు మెల్లగ నివేదించెను. రాజంతయుఁ జింతించి యామె నోదార్చి మంత్రిని రావించి సంగతి యంతయును నిజము చెప్పు మని బెదరించి యడిగిన నాతఁడు తా నొనరించిన తప్పు నొప్పుకొనెను. వీరమోహినిం గౌగిలించుకొని తన పొరపాటు మన్నింపు మని వేఁడుకొని, యామెం దోడుకొని నగరమునకు వచ్చి నరేంద్రుఁ డామెసౌధమున కరిగెను. వీరమోహిని వచ్చుటయు జరిగిన యుదంతమును జగదీశ్వరికిఁ దెలిసెను. ఆమె చమత్కారము లప్పు డేమియుఁ బనిచేయ వయ్యె. నరేంద్రుఁడు జగదీశ్వరి చేసిన యకృత్యముచే మనసు విఱుగ నామెతో మాట లాడుటకుఁ గాని, తుద

కామెం గాంచుటకుఁగాని యిష్టపడఁ డయ్యెను. తన తప్పిదము నెఱింగి జగదీశ్వరి పశ్చాత్తాప తప్తయై యవమానమును భరింపలేక తన ఛురికతోఁ బొడుచుకొని యాత్మహత్య గావించుకొనియెను. ఆమె యాత్మహత్య చేసికొనెనని విని వీరమోహినియు నరేంద్రుఁడును మిగుల దుఃఖించిరి 'పురుషుఁ డేకపత్నీ వ్రతుం డయినచో నిట్టి చిక్కులు గలుగవు గదా!' అని నరేంద్రుఁడు దన్ను దానే నిందించుకొనియెను. మఱి కొంత కాలమునకు వారును గాలధర్మము నొందిరి. తుదకు ఫలితార్థ మిది. ఆ నరేంద్రుఁడే యీ జగదేవుఁ డయి పుట్టెను. ఆ వీరమోహినియే వీరమతియై పుట్టెను. ఆ నాబిడ్డ జగదీశ్వరియే యీ విజయవతి యై పుట్టెను. ఆ నాసహోదరుఁడు హేమచంద్రుఁడే యీ పరిపూర్ణచంద్రుఁడయి పుట్టెను. ఇంక నా మధుసూదనుఁడ నేనే యని చెప్ప నక్కఱలేదు గదా! ఎవ రెవరు చేసిన కర్మమునకు వా రా యా ఫలముల ననుభవించిరి. అన్ని సిద్ధులును గలిగి యది మొదలిప్పటివఱకు నేను సాంత్రమిట్టులే యుంటిని. ఇందులకుఁ గారణ మా దత్తాత్రేయ భగవానుని కృపయు, యోగాభ్యాస ప్రభావము నని తెలిసికొనవలయును. యోగదృష్టి వచ్చినపిదప, నా యాత్మబంధువు లేమయిరో యని తిలకించితిని. ఆ వృత్తాంతము జరిగి కొన్ని శతాబ్దులు గతించినవి. మీ మీ సమాచారములు నా కొకప్పుడు తెలిసినవి. జరుగఁ గల సంగతియును యోగదృష్టిని దిలకించి యది యంతయు నడపించుటకు నేనే కారకుఁడనై యుండవలయు నని యెఱింగి, వాని కనుగుణముగ నాబిడ్డకును దమ్మునికి నగుపించి. వారి శోకము పో

గొట్టి మిమ్ముల నందఱను నిట్లు కలిపి కృతార్థుండ నయితిని. నే నింక బదరికాశ్రమమున కేగెదను. నా సంకల్ప మీడేరినది. మీ రందఱును గురులు లయి యున్నవారలు. నా మమత్వమును దీఱినది; ఇదిగో నేఁ బోవుచున్నాఁడను. జయజగన్నాథా! దూరీకృత తాపత్రయ! దత్తాత్రేయ! పాహిమా'' మ్మనుచు వా రేమనుచున్నను వినిపించుకొనక బ్రహ్మానంద యోగీంద్రుండు లేచి, తన దారిని దా నరిగి యదృశ్యుం డయ్యెను. ఆ యోగివర్యుని మహిమాతిశయమును దలంచి వారు మువ్వురు నాశ్చర్యము నొందిరి. "యోగ విద్యయందును యోగీశ్వరులయందు నింత మహాత్త్వమున్నది గదా! ఇంక దత్తాత్రేయుం డెట్టి మహానుభావుండో గదా!" అని యనుకొనుచు నమ్మువ్వురును యోగీంద్రుండు రచించిన కథా సందర్భమును మరల మరలఁ దలంచుకొనుచుఁ బూర్వజన్మమందుఁ దా మొనరించిన కర్మములకు నిప్పటి జన్మములో ననుభవించిన యంశముల నొకొక్క దానికి సమాధానములుగా భావించుకొనుచు నా రాత్రి వేగించిరి.

---

# Pancharathnamu

# పంచరత్నము

---

ఈ పుస్తకము సీత, శకుంతల, రుక్మిణి, దమయంతి, సావిత్రి యను నైదుగురు పతివ్రతా రత్నముల చరిత్రములు గూర్చి చక్కని శైలిలో వ్రాయఁబడి యున్నది. ఇది బాలుర బాలికలు పఠించుటకుఁ దగినట్లు సులభముగను, మనోహరముగను ముద్రింపఁబడి యున్నది. మదరాసు పచ్చయప్ప హైస్కూలు ప్రధానోపాధ్యాయులయి కీర్తిశేషులైన వి. వెంకటసుబ్బయ్య, బి. ఏ. గారు ఈ పుస్తకమునకుఁ బీఠికను వ్రాసిరి.

అయిదు చిత్రపటము లిందుఁ గలవు.

వెల రు. 1—0—0.

---


వివేకబోధినీ కార్యాలయము,

మైలాపూరు,

మదరాసు.